# శ్రీ రాఘవేంద్ర

## కల్పవృక్షము



# శ్రీరాఘవేంద్ర కల్పవృక్షము

ఓం పూజ్యాయ రాఘవేంద్రాయ సత్య ధర్మ రతా య చ ।
భజతాం కల్ప వృక్షాయ నమతాం కామధేనవే ॥


రచయిత :
'పౌరాణిక రత్న'
'మహాపురాణాంధ్రీకరణచణ'
**శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త**



ప్రకాశకులు :
**శ్రీ మట్టుపల్లి జగన్నాథం**
మహాపురాణ ప్రచార సంఘము
కొత్తపేట, గుంటూరు–1

1 9 8 2





[మూల్యము రు. **15-00**

శ్రీ రస్తు　　　　　　　　　　　　　　శుభమస్తు

శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర ప్రసన్నో భూయాత్

# ఉపోద్ఘాతము



వ్యాసేన వ్యుక్తబీజ శ్రుతిభువి భగవత్పాద
లబ్ధాంకుర శ్రీః ।
ప్రత్తైరీషత్ప్రభిన్నోఽజని జయమునినా సమ
గుద్భిన్న శాఖాః ॥
మానీశ వ్యాసరాజా దుదిత కిసలయః పుష్పితోయం
జయీంద్రాత్ ॥
అద్య శ్రీరాఘవేంద్రాద్విలసతి ఫలితో మధ్వసిద్ధాన్తశాఖీ॥
(శ్రీగురుగుణ స్తవము)

మోక్షమనెడు ఫలమును సజ్జనులు భుజించి ఆనందింపవలెననెడి యుద్దేశ్యముతో శ్రీవేదవ్యాసదేవుడు కరుణ కలిగినవాడై వేదోపనిషత్తు లను నుత్తమభూమిలో [ బ్రహ్మసూత్రము లనెడు దివ్యబీజమును నాటెను పద్ధునైశ్వ ంపన్నులైన శ్రీమధ్వాచార్యులు తమభా ము ద్వారమున ఆబీజమును అంకురింపజేసెను ప్రాచీనాచార్యు లైన శ్రీపద్మనాభతీర్థులు

శ్రీ నరహరితీర్థులు శ్రీ అక్షోభ్యతీర్థులు మున్నగువా రొనరించిన మహోన్నతము లగువ్యాఖ్యానములచే ఆ యంకురము మొలకెత్తి వృక్షమయ్యెను టీకాచార్యు లైన జయతీర్థస్వామి యొనరించిన దివ్యవ్యాఖ్యానముల వలన ఆవృక్షమునకు కొమ్మలు ఏర్పడెను శ్రీ వ్యాసరాయ తీర్థసార్వభౌములచే రచింపబడిన అసద ౕ గ్రంథములవలన ఆ వృక్షమునకు పత్రములు కల్గెను ౹ జయీంద్ర తీర్థులు రచించిన నూటనాల్గు ద్వైతగ్రంథముల వలన ఆవృక్షము పుష్పించెను ఇపుడు శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి రచించిన టిప్పణీ గ్రంథముల వలన శ్రీమధ్వసిద్ధాంత మను కల్పవృక్షము మోక్ష ఫలభరితమై ప్రఖ్యాతిమై శోభిల్లుచున్నది

పూర్ణ పురుషుడు, పరాత్పరుడు, యజ్ఞేశ్వరుడు పరమ కారణ కారణుడు, పరిపూర్ణతముడు, గోలోకాధీశ్వరుడు, శ్రీరాధావరుడు నైన శ్రీకృష్ణభగవానుని అనుగ్రహ విశేషముచే నేను శ్రీమద్బ్రహ్మవైవర్త వ ౹ను (అష్టాదశ పురాణములలో నొకటి) ఆంధ్రీకరించితిని అయ్యది ఖండాత్మకము ఒకటి బ్రహ్మఖండము, రెండు ప్రకృతిఖండము, మూడు గణపతి ఖండము, నాలుగు శ్రీకృష్ణ జన్మఖండము, అయిదు సారసంగ్రహము ఈ మహాగ్రంథమును ముద్రించిన తదుపరి నాకొక మహాపురుషుని భవ్యచరిత్రమును రచింప వలెననెడి సంకల్పము కలిగెను భగవంతుని దివ్యలీలలను

స్తుతించితిని మహదానందమును పొందితిని నేను భగవదంశ సంభూతుడు, పరమభక్తాగ్రేసరుడు నైన శ్రీరాఘవేంద్ర తీర్థుల పావన చరిత్రను రచించి బ్రహ్మానంద మొందుచుంటిని శ్యామల వర్ణుడు, స్థూలశరీరుడు, ఆజానుబాహుడు, సూర్యసమప్రభా సంపన్నుడు నగుమహాపురుషుడు నాకు స్వప్నములో గోచరించి అనుగ్రహించెను ఆయన యెవ్వరని విచారింపగా నేను మంత్రాలయాంతర్గత బృందావనములో విరాజిల్లి యున్న శ్రీరాఘవేంద్రతీర్థపాదులని యెఱింగిపరమాశ్చర్యచకితుడనైతిని తదనంతరము అనేక ప్రాచీన కన్నడ గ్రంథములను పరిశీలించి శ్రీరాఘవేంద్ర కల్పవృక్ష మనునామముతో శ్రీవారి పావన చరితమును నామాతృభాషలో రచించి కృతార్థుడనైతిని

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి జగద్గురువు శ్రీతిమ్మన్న భట్టారకుడు శేషాచలముపై ఘోరతపమాచరించి శ్రీవేంకటే శ్వరుని కరుణకు పాత్రుడై సాక్షాత్తుగ శ్రీహరిపార్షదు డైన శ్రీశంఖుకర్ణుని కుమారునిగ పొందెను ఆదివ్యశిశువునకు వెంకన్నభట్టు అని నామకరణముచేసి అల్లారుముద్దుగ పెంచ సాగెను ఒకశుభముహూర్తమున శ్రీతిమ్మన్నభట్టు ఆయద్భుత శిశువునకు అక్షరాభ్యాసము జేయ సంకల్పించి మహోత్సవ మొనరించెను అనేకు లైనబంధువులు విద్వాంసులుం ఆమహో త్సవమున కఱుదెంచిరి జనకుడు 'ఓం' అని లిఖించి 'ఓం' అని పలుకుము, కుమారా! యనెను అపుడు శ్రీవెంకన్నభట్టు (శ్రీరాఘవేంద్రతీర్థస్వామి) 'ఓం' అని దీనిని పఠింపుము, తండ్రీ!'

యని పల్కెను ఆ పసిబాలుని మహాజ్ఞానమునకు అచ్చోట చేరిన వారందఱు విస్మయమును చెందిరి ఈబాలుడు అక్షరాభ్యాసకాలమందే గురువునకు (తండ్రికి) గురువుగా భాసించెను పెద్దవాడై ఈతడు జగద్గురువు కాగలడని బుధజనులు, అపరోక్షజ్ఞానులు పల్కిరి శ్రీరాఘవేంద్రస్వామి జగద్గురువుమాత్రమే కాదు, ఆశ్రితజనులకు కల్పవృక్షము, భక్తులకు కామధేనువు కల్పవృక్షము భక్తులచెంతకు జని అభీష్టముల నొసంగును అట్లే శ్రీగురుదేవులు భక్తులను అనుగ్రహించును తన్నుదలంచి ఆశ్రయించిన భక్తులకు అనిష్టపుణ్యమును దానమొనరించి వారి త్రితాపములను బాపుచున్నాడు

పవిత్రభారతవర్షములో ఆంధ్రరాష్ట్రమందు కర్నూలు జిల్లాలో ఆదోని తాలూకాలో, ఆదోని గ్రామమునకు ముప్పది మైళ్ళ దూరమున పవిత్రతుంగభద్రానదీ ము కలదు ఆతీరమందే కృతయుగములో శ్రీప్రహ్లాదచక్రవర్తి అనేక యజ్ఞయాగాదుల నొనరించెను ఆప్రాంతమును పూర్వము 'మంచాల' గ్రామమందురు అచ్చోటనే శ్రీరాఘవేంద్రతీర్థస్వామి సజీవముగ బృందావనమును ప్రవేశించిరి శ్రీవారి దివ్యమహిమా విశేషముచే 'మంచాల' గ్రామము 'మంత్రాలయ' మయ్యెను

శ్రీహరిపార్షదుడైన శంఖుకర్ణుని అవతారముల సంఖ్యను గుఱించి ప్రాచీనుల అభిప్రాయము పలువిధములుగ నుండెను కొందఱు మూడు, కొందఱు నాలుగు, కొందఱు అయిదు

అవతారములు అనిరి మంత్రాలయములో శ్రీవారి మఠము నందుగల రికార్డులలో నాలుగు అవతారములుగ నుండెను మూలపురుషుడు శ్రీశంఖుకర్ణుడు ఆయన మొదట కృత యుగములో ప్రహ్లాదుడుగను 2 ద్వాపరయుగములో బాహ్లీకుడుగను 3 కలియుగములో శ్రీవ్యాసరాయతీర్థులుగను 4 శ్రీరాఘవేంద్రతీర్థస్వామిగనుఅవతరించెను శ్రీరామచంద్రు డవతరించిన త్రేతాయుగములో శ్రీవారి యవతారములేదు

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ ధ ధ ం సంభవామి యుగే యుగే ॥

భగవంతుడు యుగయుగములందు సాధువులను రక్షించుటకు, అసాధువులను శిక్షించుటకు అవతరించెద నని పలికెను అట్లే భగవద్భక్తులైన పార్షదులుకూడ భగవంతుని యానతిపై ప్రతియుగమునం దవతరించెద రనుట నిర్వివాదాంశము ప్రాణ స్వరూపుడైనవాయుదేవుని రూపము లైదు మహాభూతము లైదు అగ్నులైదు తన్మాత్రలైదు కోశములైదు శ్రీఆంజనేయస్వామికి ముఖము లైదు శ్రీశంఖుకర్ణుని యవతారము లైదు అని మావిశ్వాసము కృతయుగములో ప్రహ్లాదావతారము త్రేతాయుగములో విభీషణుడు (అంశావతారము) ద్వాపరయుగములో బాహ్లీకుడు, కలియుగములో శ్రీవ్యాసరాయతీర్థులు, శ్రీరాఘవేంద్రతీర్థులు ఈగ్రంథమందు పంచావతారములుగ మేమువర్ణించితిమి కల్పభేదమననుసరించి

నై న జెప్పబడిన వాదములన్నియు సత్యములని విశ్వసింపవచ్చును. శ్రీమూలరామమూర్తులు శ్రీరాఘవేంద్రబృందావన మఠము మంత్రాలయములో నున్నవని ఆమతాధిపతులు, ఉత్తరాది మఠములో నున్నవని ఆమతాధిపతులు పలుకుచున్నారు శ్రీరామచంద్రుడు సర్వాంతర్యామి భక్తాధీనుడు కనుక రెండు మఠములలోను అర్చావిగ్రహరూపమున విరాజిల్లుచున్నాడని మావిశ్వాసము.

శ్రీవారి సన్న్యాసాశ్రమ స్వీకారము తంజావూరు రాజాస్థానములో జరిగెనని చరిత్ర కలదు. ఈ గ్రంథములో తంజావూరు రాజులే శ్రీవారి ఆశ్రమస్వీకారమహోత్సవమును కలుదెంచినట్లుగ వర్ణింపబడెను.

ఈమహాగ్రంథ రచనకొఱకై శ్రీరాఘవేంద్రవిజయమహా కావ్యమును, కొన్ని ప్రాచీన కన్నడగ్రంథములను పరిశీలించితిమి. కొందఱు భక్తులు భక్తిపారవశ్యముతో చెప్పిన కథలను కూడ స్వీకరించితిమి. ముఖ్యముగా బిదరహల్లి శ్రీనివాస తీర్థులు, శ్రీరాఘవేంద్రస్వామి పూజారులు, మొదలగునవి. ఆదైవస్వరూపు డైనశ్రీరాఘవేంద్ర తీర్థభగవత్పాదుల పావన చరితమును ఏబదియైదు అధ్యాయములలో రచించి మీముం దుంచుచున్నాము. శ్రీశంఖుకర్ణునినుండి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి బృందావన ప్రవేశానంతరము థామస్ మన్రోవరకు గలవిషయమును సుమారు 300పేజీలలో నీగ్రంథములోపొందుపరచబడినది.

పాఠకుల సౌలభ్యముకొఱకై యీగ్రంథములో శ్రీఅప్పణాచార్యుల విరచితమైన శ్రీరాఘవేంద్ర స్తోత్రము, శ్రీరాఘవేంద్ర కవచము, శ్రీరాఘవేంద్ర మంగళాష్టకము తాత్పర్య సహితముగ ప్రచురించితిమి ఇదియేగాక అర్చక రాఘవేంద్రాచార్యులచే రచింపబడిన అణు రాఘవేంద్ర స్తోత్రము సాహిత్యరత్నం అర్చక వేదవ్యాసాచార్యులచే రచింపబడిన శ్రీరాఘవేంద్ర అష్టోత్తరశతనామావళి తాత్ప సహితముగ మీముందుంచితిమి

శ్రీవారు ఒనరించిన అద్భుతములగు దివ లీలలను శ్రీరాఘవేంద్రమహాత్మ్య మను గ్రంథముగ రచన కొనసాగించుచున్నాము ఈ బృహద్గ్రంథము త్వరలో మీ ముందుంగలము ప్రాణదేవుడైన శ్రీఆంజనేయస్వామి పావనచరితమును సకల పురాణములనుండి, సంహితలనుండి సేకరించి శ్రీహనుమద్భాగవత మనుపేర సాంగోపాంగముగ రచన చేసితిమి ఈమహాగ్రంథమును కూడ అనతికాలములో మీ ముందుంచగలము

ఈగ్రంథ రచనలో ఎందరో మహానుభావులు వాకు తోడ్పడి వారందఱికి నావందనములు ముఖ్యముగ సహృదయులు, నా మిత్రులు శ్రీ **P V R K** ప్రసాదుగారు (**T T D E O**) దేవస్థానము గ్రాంటుగ రు 4330/- లు, ఈ గ్రంథమునకు ఆర్థిక సాహాయ్యమొనరింపజేసిరి నామిత్రులు

బ్రహ్మశ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రిగారు భాషావిషయము లోను, ప్రెస్ విషయమందు, ప్రూఫ్ రీడింగు మొదలగు కార్యక్రమములందు సంపూర్ణ సహకార మొనరించిరి మధ్వ కత్రిసాల్ గోపాలరావుగారు గ్రంథ రచనలో పెక్కు కన్నడ గ్రంథములను చదవి వినిపించి సాహాయ్య మొనరించిరి శ్రీ రాఘవేంద్ర స్తోత్రమునకు తాత్పర్యమును మధ్వశ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులవారు రచించిన గ్రంథమునుండి వారి కుమారులైన మధ్వశ్రీ పళ్ళె శ్రీనివాసాచార్యులగారి అనుమతితో స్వీకరించితిమి శ్రీరాఘవేంద్ర మంగళాష్టకము నకు తాత్పర్యమును రచించి బ్రహ్మశ్రీ జన్నాభట్ల వీరేశ్వర శాస్త్రిగారు సహకరించిరి బ్రహ్మశ్రీ జమ్ములమడక మాధవ రామశర్మగారు సంస్కృత శ్లోకములకు తాత్పర్యముల నొసంగి సాహాయ మొనరించిరి శ్రీరాఘవేంద్రస్వామి మృత్తికా బృందా ము (బ్రాడీపేట, గుంటూరు) పాలకవర్గము ఈగ్రంథ రచనకు సలహాలనొసంగి ప్రోత్సహించిరి

ఈ గ్రంథ రచనలో సహకరించిన పై పెద్దలందఱకు నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలియబరచుచు వందన ము సమర్పించుచున్నాను

'మాతృదేవోభవ, పితృదేవోభవ' అను సూక్తుల నను సరించి భగవత్సేవాంకిత మైన నాకీ జన్మము నిచ్చిన నాతల్లి దండ్రులగు శ్రీమతి వేంకటమహాలక్ష్మమ్మ శ్రీ జగన్నాథము

గార్ల కాజన్మాంతము నేను ఋణపడియున్నాను దానశీలురు, జ్ఞానవైరాగ్య సంపన్నులు, పుణ్యమూర్తులు, భగవద్భక్తి యుతులునగు వారియనుగ్రహ విశేషముచే నాకీమహాత్కార్య మొనరించు అదృష్టము లభించినదని చెప్పుకొనుట కెంతయో గర్వపడుచున్నాను వారికి పాదాభివందనముల నర్పించు చున్నాను ఆధ్యాత్మిక చింతనలోను, సద్గ్రంధ రచనలోనుఅనేక విధముల సహకరించుచున్న నాధర్మపత్ని శ్రీమతి శ్యామ సుందరికి, నాకుమారు లగు యదువీరరంగధామ్, శ్రీనివాస శరణ్, నాగమల్లిఖార్జునులకు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ఆయు రారోగ్య ఐశ్వర్యాదులను, భక్తిజ్ఞాన వైరాగ్యాదులను ప్రసాదించుగాక !

పుత్రికా సంతాన రహితుడ నగునాయనేక జన్మల సుకృతవశమున శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తమహాపురాణ కన్య పెద్ద కుమార్తెగా ప ి న్మించెను శేషాచలవాసుడు విమలరవికోటి సంకాశుడు సర్వజగన్నివాసుడు, కలితలక్ష్మీశుడు నగుశ్రీవేంకటేశ్వర విభునకు శ్రీసిద్ధార్థనామసంవత్సర ఫాల్గుణ బహుళ సప్తమి ఆదివారము (ది 9–3–1980) శుభదినమున గుంటూరునందు గల శ్రీ శ్రీ శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థాన ప్రాంగణములో భక్తుల సమక్షమున నాపురాణకన్య నిచ్చి కళ్యాణమహోత్సవ మొనరించి కృతార్థుడ నైతిని

శ్రీరాఘవేంద్ర కల్పవృక్ష మను ఈ కావ్యకన్యక నాకు కల్గిన రెండవకుమార్తె

ఉత్తమ చరిత్రుడు, శివాంశ సంభూతుడు, వాయు నందనుడు, శ్రీరామచంద్రుని పరమభక్తాగ్రేసరుడు, జగ ద్రూపుడు, వజ్రశరీరుడు, దయాసముద్రుడు, సూర్యపుత్రికకు చెలికాడైనవాడు, పంచముఖములు కలిగినవాడు, క్షేమకర ఫలస్వరూపుడు నైన ప్రసన్నాంజనేయస్వామికి నా రెండవ కావ్యకన్యక యైన శ్రీరాఘవేంద్ర కల్పవృక్షమును సతమస్త కుడనై పరమభక్తిభావముతో సమర్పించుకొనుచున్నాను పాణదేవుడైన శ్రీహనుమత్ప్రభువే నాయీకృతికి కర్త్య ముగ భర్త

ఈ గ్రంథమును ముద్రణకు సుందరముగా వ్రాసిన చిరంజీవి యల్లాప్రగడ రంగనాయకులకు, సకాలములో చక్కగ ముద్రించి యిచ్చిన రమ ప్రింటింగ్ వర్క్సు అధినేత శ్రీ తోట సీతారామయ్యకు నా ధన్యవాదములు

ఏమైనను 'ప్రమాదో ధీమతామపి' యను నార్యోక్తి యనుభవసిద్ధమైన దగుటవలన నిందెన్నియో ప్రమాదము లుండి తీరునుగాన, సహృదయు లగుపాఠకులు దయతో మన్నింప ప్రార్థితుడను శేషం శ్రీకృష్ణ స్మరణం

గుంటూరు
27-1-1982

భక్తజన దాసానదాసుడు
సుజనవిధేయుడు
మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త

# రచయిత పరిచయము

పేరు — శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త

జననము — విక్రమనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ అష్టమి
ది 8-10-1940 అనగా దుర్గాష్టమి దినము
గుంటూరు ఆంధ్రప్రదేశ్

జననీజనకులు — శ్రీమతి వేంకట మహాలక్ష్మమ్మ
శ్రీజగన్నాథం గారలు

గోత్రము — పారాశర్య

కుటుంబము — ధర్మపత్ని శ్రీమతి శ్యామసుందరి
కుమారులు — యదువీర రంగధామ్
శ్రీనివాస శరణ్
నాగమల్లి ఖార్జున్

విద్యాభ్యాసము — 1 గుంటూరు హిందూకళాశాల ఉన్నత పాఠశాల
2 హిందూకళాశాలలో బి కాం వఱకు,

బిరుదులు — 'పౌరాణికరత్న', 'వ ధ్రీకరణచణ

వృత్తి — శివాఇంజనీరింగు కంపెనీ, గుంటూరు
నర్సరావుపేట

యమ్ జగన్నాధం అండ్ జె యస్ ప్రసాదు,
హిందూస్థాన్ పెట్రోలియం డీలర్సు
చిలకలూరిపేట

అభిరుచులు 1 గ్రంథరచన, ధర్మప్రచారము, హోమియోపతి ఉచిత వైద్యము

2 అనేక సభలలో ఆధ్యాత్మిక విషయములను గురించి ప్రసంగించిరి

3 రెండున్నర సంవత్సరముల కాలము గుంటూరు నందుగల శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయ ప్రాంగణములో శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తక ప్రవచనము చేసిరి.

ఆశయము మహాపురాణ రచన, ధర్మప్రచారము, పరంధామ గమనము

గౌరవాధ్యక్షులు 1 విశ్వ హిందూ పరిషత్, గుంటూరు
2 హోమియో పరిషత్, గుంటూరు

ఇతరభాషా పరిచయము సంస్కృతము, హిందీ, ఇంగ్లీషు

ముద్రిత రచనలు

| శ్రీ మదాంధ్ర బ్రహ్మవైవర్త | రో సాదా ప్రతి | మేలుప్రతి |
|---|---|---|
| బ్రహ్మ ఖండము | 10 - 00 | 15 - 00 |
| ప్రకృతి ఖండము | 30 - 00 | 45 - 00 |
| గణపతి ఖండము | 12 - 00 | 25 - 00 |
| శ్రీ కృష్ణజన్మ ఖండము (పూర్వార్థము) | | 50 - 00 |
| సారసంగ్రహము | 2 - 00 | |

# శ్రీ మంత్రాలయ క్షేత్రము



శ్రీ మంత్రాలయక్షేత్రము భారతదేశములో ఆంధ్ర ప్రదేశమున కర్నూలు జిల్లాలో ఆదోనితాలుకాలో ఆదోని గ్రామమునకు షుమారు ముప్పదిమైళ్ళదూరములో నున్నది పవిత్రతుంగభద్రానది యీ గ్రామమునంటి ప్రవహించుచున్నది న రములో శ్రీ రాఘవేంద్ర తీర్థస్వామి షుమారుగ మూడు వందలపదకొండు సంవత్సరముల పూర్వము సజీవముగ ప్రవేశించిన బృందావనము కలదు సత్యయుగములో శ్రీ ప్రహ్లాదుడీప్రదేశమందే యజ్ఞయాగాదుల నొనరించెను

బృందావన మందిరములో ఉదయము తొమ్మిది గంటలకు అభిషేకము ప్రారంభమగును తదనంతరము బృందావనమలంకరింపబడును తదనంతరము తులసీదళార్చన ప్రారంభమగును శ్రీరాఘవేంద్రతీర్థస్వామి బృందావనమునకు శ్రీ వాదీంద్రతీర్థస్వామి బృందావనమునకు మధ్యనున్న పవిత్రస్థలములో ప్రతిదినము ప్రస్తుత మఠాధిపతులైన శ్రీ సుజయేంద్రతీర్థులు మూలరాముని, ఆశ్రమ భగవన్మూర్తులను పూజించెదరు తదనంతరము నివేదనమొనరించి మూల బృందావనమునకు, తదితరబృందావనములకు నాస్తోదకము నొసంగెదరు ఉదయముగం 11లకు మంత్రాలయముసందర్శించు భక్తులకు ఉచితముగా భగవత్ప్రసాదమును (భోజనమును)

మఠమువారిచే నొసంగబడును సాయంత్రముకూడ పూజలు, సేవలు, మహామంగళహారతి మొదలగు కార్యక్రమములు జరుగును రాత్రి గజారోహణోత్సవము, రథోత్సవము కన్నుల పండువుగ నొనరింపబడును

మంత్రాలయమునకు వచ్చిన యాత్రికులు మానసీకముగ శారీరకముగ పరిశుద్ధులై భగవద్భక్తితో నుండవలెను ప్రతి యాత్రికుడు మూలబృందావన మందిరమునకు చేరువలో నున్న తుంగభద్రానదిలో స్నానమాచరించి పవిత్రుడై ఉతికిన వస్త్రములను ధరించి బృందావన దర్శనార్థియై మందిరమునకు పోవలెను మొదట బృందావనమునకు ప్రక్కగా నున్న క్షేత్రదేవత మంచాలమ్మను సేవించి బృందావన మందిరమును ప్రవేశింపవలెను తదనంతరము మొదట ప్రాణనాథుడైన శ్రీ ఆంజనేయస్వామిని దర్శింపవలెను తదుపరి మూలబృందావనమును దర్శింపవలెను మూల బృందావనమునకు ఎదురుగనే శ్రీ ఆంజనేయస్వామి మందిరము కలదు

యాత్రికులు బృందావన మందిరమును ప్రవేశింపగనే మూల మందిరమునకు ప్రదక్షిణము గావింపవలెను ప్ర గావించు సమయములో అయిదు స్థలములలో సాష్టాంగ నమస్కారముల నొనరింపవలెను నాల్గు దిక్కులందు నాల్గు మారులు నమస్కారములు ఎదురుగా ఒకనమస్కారము ఒనరింపవలెను స్త్రీలు మోకాళ్ళపై వంగి నమస్కరింప

వలెను ప్రదక్షిణ మొనరించు సమయమున

ఓం పూజ్యాయ రాఘవేంద్రాయ సత్యధర్మరతాయ చ ॥
భజతాం కల్పవృక్షాయ నమతాం కామధేనవే ॥

యని పఠింపవలెను మూల బృందావనములో నున్న మృత్తిక పరమ పవిత్రము ప్రతి యాత్రికుడు ఆమృత్తికను బృందావనము చెంత తీసుకొని తిలకముగ ధరింపవచ్చును ఔషధముగ స్వీకరింపవచ్చును మృత్తికాధారణము సకల తాపములను, రోగములను నివారించి ఆయురారోగ్యైశ్వర్యా దులను, మనశ్శాంతిని ప్రసాదించును ప్రతిదినము సాయంత్రము ఐదుగంటలకు । మూల బృందావన అభిషేకతీర్థము భక్తులపై చల్లబడును ఈ తీర్థము సకల గ్రహములను దూరం మొనరింప గలదు, సర్వవ్యాధులను నివారింపగలదు ఈ తీర్థప్రోక్షణము పొందదలచినవారు సాయంత్రము 4 గంటలకు తుంగభద్రా నదిలో స్నానమాచరించి బృందావనము ఆఫీసులో ఒక రూపాయి చెల్లించి బృందావనమునకు ఎదురుగ కూర్చుండ వలెను ఐదు గంటలకు తీర్థము చల్లబడును

తిరుపతిలో లడ్డుప్రసాద మున్నటులుగ ఇచ్చట పరిమళ ప్రసాదము గలదు, ఖరీదు 0-60 పైసలు బృందావన మందిరములో మూడు రకము లైన యంత్రములను భక్తుల కిచ్చెదరు రాత్రి మహామంగళహారతి యైన తదనంతరము శ్రీ సుజయీంద్రతీర్థుల సమక్షములో నీ యంత్రముల నిచ్చెదరు

1. భీతి యంత్రము. 2. సంతాన యంత్రము. 3. సర్వసిద్ధ యంత్రము. ఈ యంత్రములకు మూల్యమును చెల్లింపవలెను. మేనేజరు, శ్రీ రాఘవేంద్రస్వామిమఠము, మంత్రాలయము-518345. ఈ చిరునామాకు మనియార్డరు పంపి యంత్రములను, మృత్తికను తెప్పించుకొనవచ్చును.

మంత్రాలయములో యాత్రికులకు సకల సౌకర్యములు లభించును. మంత్రాలయమునకు అన్నిజిల్లాల ముఖ్య పట్టణములనుండి ఎక్స్‌ప్రెస్ బస్‌వసతి కలదు. బొంబాయి-మద్రాసు రైలుమార్గములందు మంత్రాలయ గ్రామమునకు చేరువలో నున్న తుంగభద్రా రైల్వేస్టేషను (మంత్రాలయం రోడ్డు) యందు అన్నిరైళ్ళు నిలచును. అచటనుండి మంత్రాలయమునకు బస్సు సౌకర్య మున్నది. మంత్రాలయములో మూల బృందావనమును, శ్రీ వాదీంద్రతీర్థుల బృందావనమును, శ్రీ సుధర్మేంద్ర, శ్రీసువ్రతీంద్ర, శ్రీ సుయమీంద్ర బృందావనములను దర్శింపవలెను.

మంత్రాలయమునకు చేరువలోనున్న శ్రీ పంచముఖాంజనేయస్వామిని దర్శింపవలెను. అచటికి బస్సు సౌకర్యము కలదు. మంత్రాలయములో శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయము కలదు. తుంగభద్రా రైల్వేస్టేషనుచెంత అణుమంత్రాలయ క్షేత్రముకలదు. మంత్రాలయములో అర్చకులైన శ్రీ కృష్ణాచార్యులవారి గృహములో శ్రీరాఘవేంద్రస్వామి ధరించిన

పాదుకలు కలవందురు వానిని కూడ దర్శింపవచ్చును శ్రీరాఘవేంద్రస్వామి అంతరంగిక భక్తులైన శ్రీ మల్లప్పసింధె గారు ఇటీవలకాలమున మంత్రాలయ బృందావన మందిరమును పునర్నిర్మాణ మొనర్చిరి మద్రాసుప్రాంతము రామనాడ్ జిల్లాలో కొట్టియూరు అను గ్రామనివాసి శ్రీ రామనాధచెట్టియారు శ్రీవారి యనుగ్రహామువలన భయంకర వ్యాధినుండి విముక్తుడై శ్రీసుయమీంద్ర తీర్థులు విరాజిల్లి యున్న కాలములో శ్రీవారికి వెండిరథము చేయించి యిచ్చెను భక్తులు రథోత్సవ, గజోత్సవ సేవలకు రుసుములు చెల్లించినచో రాత్రి ఆలయ ప్రాంగణములో రథోత్సవ, గజోత్సవము లొనరింపబడును

మంత్రాలయమున కఱుదెంచు భక్తుడు తప్పనిసరిగ శ్రీ రాఘవేంద్ర తీర్థస్వామి ఫలమంత్రాక్షతలను, అభిషేక తీర్థమును, బృందావన మృత్తికను, పరిమళ ప్రసాదమును పొందవలెను భారతదేశములో అని ప్రాంతములనుండి తండోప తండములుగ కులమత వివక్షతలేక భక్తులు మంత్రాలయ మఱుదెంచి శ్రీరాఘవేంద్ర తీర్థస్వామిని సేవించి ధన్యులగు చున్నారు విదేశముల నుండికూడ ఎందఱో భక్తులు మంత్రాలయమునకు వచ్చుచున్నారు ప్రతి గురువారము మంత్రాలయములో మహోత్సవ మొనరింపబడును విశేష కార్యక్రమములు నిర్వహింపబడును



# విషయ సూచిక

## చిత్ర సూచిక



# అంకితము

ధన్యా వాచః కపివర గుణస్తోత్రపూతాః కపీనాం
ధన్యో జంతుర్జగతి హనుమత్పాదపూజాప్రవీణః ।
ధన్యా సంవసత హనుమత్పాదముద్రాభిరామం
ధన్యా లోకే విశ్వమ యావతారాత్ ॥

కపులలో వరిష్ఠు డగు శ్రీఆంజనేయునిగుణగాన మొనరించుటలో విశ్రమగుచున్నవాణి ధన్యము శ్రీహనుమత్పాదసేవలో ప్రవీణు డగు జీవుడు ధను శ్రీహనుమత్పాదముద్రికలతో అలరారువారు ధన్యతములు శ్రీఆంజనేయావతారముచే ఈలోకము విశ్వము అంతయు ధన్యములైనవి

'శివ'



TO OFFSET BY
IIVAS INDUSTRIES.
KASI.

पूज्याय राघवेंद्राय सत्यधर्मरताय च ।
भजतां कल्पवृक्षाय नमतां कामधेनवे ।।



శ్రీరస్తు శ్రీ మూలరామో విజయతే శుభమస్తు

# శ్రీ రాఘవేంద్ర కల్పవృక్షము

## మంగళాచరణము

శ్లో॥ వన్దే వానర నారసింహ ఖగరాట్ క్రోడాశ్వవక్త్రాంచితం
నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్యమాన రుచా ।
హస్తాబ్జైరసి ఖేటపుస్తకసుధా కుంభాంకుశాద్రీన్ హలం
ఖట్వాఙ్గం ఫణిభూరుహం చ దధతం సర్వారిగర్వాపహమ్॥
(పరాశర సంహిత)

వానర నృసింహ గరుడ సూకరాశ్వముఖములు కలవాడు, అనేకాలంకారములు కలవాడు, కాంతిచే దేదీప్యమానముగ ప్రకాశించుచున్నవాడు, ప్రతిముఖమునందు మూడు నేత్రములు కలవాడు, పద్మములవంటి కరములందు ఖేటము (డాలు)ను, పుస్తకమును, అమృతకలశమును, అంకుశమును పర్వతమును, నాగలిని,ఖట్వాంగమును(మంచపుకోడు)ను,మణిని, వృక్షమునుధరించినవాడును, వైరులందఱిగర్వమును హరించిన వాడును నగు హనుమంతునకు నమస్కరించుచున్నాను

శ్లో॥ హనుమంతం చ భీమం చ పవనం చ పున పునః
నతోఽస్మ్యహం పునర్మధ్వం మధ్వో మాం పాతు సర్వదా॥

హనుమంతుని, భీముని, వాయుదేవుని మాటిమాటికి నమస్కరించుచున్నాను మరల మధ్వాచార్యుని నమస్కరించుచున్నాను. మధ్వాచార్యులు నన్ను ఎల్లప్పుడు కాపాడుగాక!

శ్లో॥ పూజ్యాయ రాఘవేంద్రాయ సత్యధర్మరతాయ చ।
భజతాం కల్పవృక్షాయ నమతాం కామధేనవే॥

పూజింపదగినవాడును, సత్యధర్మములయందు ఆసక్తి గలవాడును, భక్తితో సేవించువారికి కల్పవృక్షము వంటి వాడును, ప్రపత్తితో నమస్కరించువారికి కామధేనువువంటి వాడును నగు శ్రీరాఘవేంద్రస్వామికి నమస్కారము

శ్లో॥ ఓం శ్రీరాఘవేంద్రాయ నమ, ఇత్యష్టాక్షరమంత్రతః।
జపితాద్భావితాన్నిత్యమిష్టార్థా స్యు ర్న సంశయః॥

'ఓం శ్రీరాఘవేంద్రాయ నమ' అనునీయష్టాక్షరీ మంత్రమును నిత్యము జపముసేయువారికి సర్వాభీష్టములు సిద్ధించును ధ్యానము చేయువారికి సంశయములు నశించి యెల్లప్పుడు కోరినకోర్కెలు సిద్ధించును ఇందు సంశయము లేదు

# ప్రస్తావనము

శ్లో॥ స వై పుంసాం పరో ధర్మో యతో భక్తిరధోక్షజే ॥
అహైతు ప్రతిహతా యయాఽఽత్మా సుప్రసీదతి ॥
(శ్రీమద్భాగవతము-1-2-6)

ఇంద్రియజ్ఞానాతీతుడగు శ్రీకృష్ణునియందు ఫలాభిసంధానరహితము, ఐకాంతికము, స్వాభావికము, నిరపేక్షము, శ్రవణాదిలక్షణము నగుభక్తిని కలిగించునదియె మానవుల సర్వశ్రేష్ఠధర్మము, ఆభక్తిబలము చేతనె అనర్థములు తొలగును, ఆత్మ ప్రసన్నతను పొందును

శ్రీకృష్ణభగవానునియందు జీవున కనన్యభక్తి గలుగగనే ఆభగవద్భక్తి అఖండజ్ఞానమును, నిష్కామత్వమును, వైరాగ్యమును బ్రసాదించును స్వధర్మముల నన్నింటిని బరిపూర్ణముగ నాచరించుచున్నను మానవుని హృదయములో శ్రీకృష్ణభగవానునియందు బవిత్రప్రేమ అంకురించి పెంపొందదేని ఆధర్మానుష్ఠానము లన్నియు నిష్ప్రయోజనములే యని తెలిసికొనవలయును ఈసిద్ధాంతమును, శ్రీహరిశక్తిని, శ్రీహరిభక్తిని, ద్వైతమతమును ఈయవనిపై బ్రచార మొనరించిన భాగవతోత్తములలో శ్రీరాఘవేంద్రస్వామి అగ్రగణ్యుడు

భారతావని భగవత్ప్రేమకు బుట్టినిల్లు, ఇదిధర్మభూమి, కర్మభూమి, భగవంతుడె దివినుండి భువికి దిగివచ్చినపరమ

పవిత్ర పుణ్యక్షేత్ర మిది ఈపవిత్రప్రదేశమందే మహాత్మ్ము లావిర్భవించి భగవదాదేశమ్ములైన వేదముల నాలకించి మానవాళికి నివృత్తిమార్గమును ప్రబోధించిరి భగవానుడే యీభరత భూమిపైకి అనేకపర్యాయములు దిగివచ్చి దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించి ధర్మసంస్థాపన మొనరించెను

కాని ఒక్కొక్కప్పుడు శ్రీభగవానుడు భవరోగపీడిత మానవకళ్యాణార్థమై తదితర దేవతాశ్రేష్ఠులను అవనిపైకి బంపుచుండును భగవదాదేశానుసారముగ శ్రీవాయుదేవుడు ఈకలి యుగములో శ్రీమధ్వాచార్యులై శ్రీహరిశక్తిభక్తులను భారత వర్షమందంతట ప్రచార మొనరించి ద్వైతమతమును స్థాపన మొనరించెను ఆయనతదనంతర మెందరో మహాత్ములు శ్రీ మధ్వాచార్యప్రబోధిత మైన ద్వైతసిద్ధాంతమును ప్రచార మొనరించిరి ఆమహానుభావు లందరిలో నేడు మంత్రాలయములో విరాజిల్లియున్న శ్రీరాఘవేంద్రస్వామి అత్యంత ముఖ్యులు గోలోకవాసి, శ్రీకృష్ణపార్షదు డైనశ్రీశంఖుకర్ణు డనుభాగవతోత్తముడే సత్యలోకమునుండి బ్రహ్మదేవు నాదేశానుసారముగ శ్రీహరియనన్య భక్తిని ప్రచార మొనరించుటకై ఈపవిత్రభారతావనిలో శ్రీరాఘవేంద్రస్వామిగ నవతరించెను

శ్రీశంఖుకర్ణుడు కృతయుగములో హిరణ్యకశిపునకు పరమభాగవతోత్తము డైనపుత్రునిగ జన్మించి ప్రహ్లాదు డను నామమున విఖ్యాతి నొందెను సర్వధర్మములను పరిత్యజించి

శ్రీహరిదివ్యపాదారవిందములందు అనన్యభక్తితో తండ్రినిసయి తము ఎదిరించి శ్రీభగవానుని ఉగ్రనారసింహునిగ అవతరింప జేసిన యాప్రహ్లాదుడే ఈకలియుగములో ఆశ్రితభక్తపారిజాత మై శ్రీరాఘవేంద్రస్వామిగ నవతరించి మంత్రాలయమునను వేంచేసియున్నారు

శ్రీప్రహ్లాదావతారము మొదలుకొని శ్రీరాఘవేంద్రావ తారమువఱకు శ్రీశంఖుకర్ణు డనేకయజ్ఞయాగాదికర్మల నొనరించి అఖండమైన, అనిష్టమైన పుణ్యము నార్జించెను ఈయనిష్ట పుణ్యము జీవన్ముక్తికి నిష్ప్రయోజనము కేవలము ఈప్రపం చములో సుఖముల ననుభవించుటకే యీపుణ్యము దోహద మొనరింపగలదు కావున శ్రీరాఘవేంద్రస్వామి తన్నాశ్రి యించు భక్తులయార్తిని బాపుటకు, వారికి ఆయురారోగ్యైశ్వ ర్యాదుల నొసంగుటకు, శ్రీహరియందనన్యభక్తిని ప్రసాదించు టకు బవిత్రతుంగభద్రానదీతీరమున మంత్రాలయాంతర్గత మగు బృందావనములో నేటికిని విరాజిల్లుచు అఖండము, అనిష్టము నగు తన పుణ్యమును ప్రసాదించుచున్నాడు తన యనిష్టపుణ్య మును యథేచ్ఛగ ఆశ్రితులకు ప్రసాదించి పుణ్యక్షయ మొన రించుకొని శ్రీరాఘవేంద్రస్వామి గోలోకమునకుమఱలిపోగలరు

జీవుడు భగవంతునిలోని భాగమనియు, మాయావరణ ముచే నాతడు దనకు భగవంతునకు గల సనాతనసంబంధమును విస్మరించినాడనియు, శ్రీహరియందనన్యభక్తిదాస్యసేవలద్వార

మున అతను భవబంధనములను త్రెంచుకొని ఈప్రాకృతప్రపంచ మును వీడి చిన్మయాకాశములో విరాజిల్లియున్న దివ్యపరంధా మమును జేరగలడనియు శ్రీరాఘవేంద్రస్వామి నొక్కివక్కాణిం చెను ఆయనయే స్వయముగ శ్రీహరిభక్త్యారాధనసేవాదుల నాచరించి సకలమానవాళికి మార్గదర్శకుడయ్యెను

శ్రీరాఘవేంద్రస్వామి పరమభక్తుడు, కరుణాంతరంగుడు, ఆశ్రితజనవత్సలుడు, సత్యసంధుడు, నిరహంకారి, మోహరహి తుడు, పరిశుద్ధుడు ఆయన తన్నాశ్రయించువా రేకులమువా రైనను, ఏమతమువా రైనను, ఏదేశమువా రైనను వారలకు సకలమనోభీష్టములను ప్రసాదించును ఆధునిక వైద్యశాస్త్ర ద్వార మున బాగుపడని యనేకమహారోగములుకూడ శ్రీరాఘవేంద్ర స్వామి నాశ్రయించిన మాత్రముననే గరుడుని గాంచి పలాయ నము చిత్తగించు సర్పములవలె తొలగిపోవుచున్నవి ఎందరో భక్తులు స్వామి నాశ్రయించి రోగవిముక్తులు, భవరోగవిము క్తులు నగుచున్నారు ఎందరో పేదలు స్వామికరుణకుపాత్రులై శ్రీమంతులైరి ఎందరో నిరుద్యోగులు ఉద్యోగులైరి ఆ కల్ప వృక్షస్వరూపు నాశ్రయించి నిరాశజెందినవారు ఒక్కరైనను లేరనుట అతిశయోక్తిగాదు నేటికిని అసంఖ్యాకముగ భక్తులు మంత్రాలయము జేరి శ్రీరాఘవేంద్రస్వామి నాశ్రయించి మనో భీష్టములను బొందుచునేయున్నారు శ్రీరాఘవేంద్రస్వామి తన్నాశ్రయించినభక్తులకు భక్తిజ్ఞానవైరాగ్యముల నొసంగు

మహాత్ముడు త్రికాలవేది, భక్తజనరక్షకుఁ, ధర్మార్థకామ మోక్షప్రదాతయు నైయున్నాడు

శ్రీరాఘవేంద్రస్వామి శ్రీహరిని, వాయుదేవుని ఆరాధించు బరమభక్తాగ్రగణ్యుఁడు శ్రీహరివాయుదేవులు స్వామి యన భక్తారాధనల కత్యంతప్రీతు లైసపరివారముగ స్వామి విరాజ యున్న మంత్రాలయాంతర్గతబృందావనమున నేంచేసి యున్నారు

పవిత్రాత్మలారా! భగవచ్చరితములకంటె భాగవతుల చరితము లత్యంతమధురాతిమధురములు భగవంతుఁడు దుస్సాధ్యుఁడు, సర్వతంత్రస్వతంత్రుఁడు కాని తన యనన్యభక్తులకు మాత్రమే వశుఁడు, భక్తికి సదా బద్ధుఁడగును భగవద్భక్తున కసాధ్య మైనదేదియు నీత్రిలోకములందును లేదు భగవద్భక్తులలో శ్రీరాఘవేంద్రస్వామి యగ్రగణ్యుఁడు ఆమహానుభావునిదివ చరితమును వర్ణించుట మహాపండితు లైనవిద్వాంసులకే యసాధ్యము

# దివ్యమంత్రభూమిక

ఈజగమున కాదిదేవుడు, అఖిలదేవతలకు విభుడు, త్రిలోకములకు పాలకుడు, శ్రీహరిదివ్యపాదారవిందభక్తిరహస్యోపదేష్టయు నైనవిధాత కల్పారంభములో దనజన్మస్థానమైనపద్మమునకు మూల మేదో తెలిసికొనుటకు అనేకదివ్యవర్షములు ప్రళయజలములలో వెదకి వెదకి మొదలు గానలేక విసిగి వేసారి పద్మమునకు దిరిగి చేరి మనస్సులో సృష్టిచేయవలె నను వాంఛ ఉదయించినను సృష్టినిర్మాణజ్ఞానమును బొందజాలక వ - తు డై చింతాక్రాంతు డై యుండెను

ఒకదినమున సరోజభవుడు పద్మంబున నుండి చింతించుచుండగా ప్రళయజలములనుండి వ్యంజనములలో పదునారవ యక్షరమైన 'త, ఇరువదియొకటవ యక్షరమైన 'ప' అను వానితోగూడిన తప యనుపదము రెండుపర్యాయములు వినిపించెను ఆశబ్దమును బల్కినపురుషుని దర్శించ లె నని బ్రహ్మ నాలుదిక్కులందు వెదకెను ఎచ్చోటను అతని గానక మఱలివచ్చి తన స్థాన మైన బద్మమున నాసీనుడై కొంతతడవు యోచించి ఆశబ్దము తనను తపస్సుజేయ మని ఆదేశించె నని నిర్ణయించుకొని, ప్రాణాయామపరాయణు డై, కర్మేంద్రియాదులను నిగ్రహించి ఏకాగ్రమనస్కు డై సకలలోకసంతాపహేతు వైనఘోరతపము నాచరించుటకు సంసిద్ధు డయ్యెను అపుడు సరస్వతీదేవి బ్రహ్మతో "బ్రహ్మదేవా! క్లీం శ్రీకృష్ణాయ గోవిన్దాయ గోపీజనవల్లభాయ స్వాహా" యనునీదివ్యమంత్రము

నీయభీష్టముల దీర్చు ననిబల్కెను ఆదిపురుషుని యాదేశాను సారముగ విధాత సహస్రదివ్యవర్షములు శ్వేతద్వీపపతియు, గోలోకేశ్వరుడు నగు శ్రీకృష్ణునిగూర్చి ఘోరతప మాచరించెను

బ్రహ్మదేవు డొనరించినతపస్సున కత్యంతప్రసన్నుడై భగవంతు డాయనకు సర్వశ్రేష్ఠము, సర్వోన్నతము, జన్మ మృత్యుజరాదుఃఖరహితము, మోహభయరహితము నైనతన దివ్యగోలోకపరంధామమును చూపెను ఆలోకము త్రిగుణా తీతము, కాలాతీతము, మాయారహితము, స్వయంప్రకాశకము, చింతామణి నిర్మితము ఆదివ్యలోకములో అనంతకింజల్క సహిత మైన సహస్రదళపద్మముమధ్యలో కర్ణికపై నధిష్ఠించి శబ్దబ్రహ్మమయ మైనవేణునాద మొనరించుచు గోపికలు బరి వేష్టించియుండగా అనంత కోటిసూర్య ప్రభకంటె మిన్నగ ప్రకా శించుచున్న చిదానందుడును, సనాతనుడును, సచ్చిదానందవిగ్ర హుడును నైనశ్రీకృష్ణపరమాత్మను బ్రహ్మ తనకన్నులకఱవు దీర దర్శించి చరితార్థుడయ్యెను

ఆసచ్చిదానందవిగ్రహుని దివ్యవేణునాదమునుండి సకల వేదజనని యైనగాయత్రి ప్రాదుర్భవించి జగన్నాథుని సంకల్ప ముచే బ్రహ్మదేవునిఅష్టకర్ణములద్వారమున చతుర్ముఖములలో ప్రవేశించెను ఇట్లు ఆదిగురు డైనశ్రీకృష్ణపరమాత్మనుండి గాయత్రీమంత్రోపదేశమునుబొంది సంస్కృతుడై జలజభవుడు ద్విజుడైనాడు భగవంతునిసంకల్పమాత్రముననే బ్రహ్మ

సకలవేదశాస్త్రపారంగతుడై దివ్యజ్ఞానసంపన్నుడై, తత్త్వనాగరుడై ప్రకాశింపనారంభించెను

అపుడు బ్రహ్మదేవుడు తనశరీర మంతయు బులకింపగా అనన్యభక్తిపారవశ్యమున కంఠము కంపింపగా, నేత్రములనుండి ఆనందాశ్రువులు ప్రవహించుచుండగా వినీతుడై సనాతనుడైన పురుషోత్తముని "గోవిందా, ఆదిపురుషా, ఆదిమధ్యాంతరహితా, సచ్చిదానందవిగ్రహా, సకలకారణకారణా, అరవిందదళాయతాక్షా, దివ్యవేణుగానవినోదీ, గోపీజనవల్లభా, ఆశ్రితభక్తరక్షకా, పాహి, పాహి" యనుచు అనేకవిధముల స్తుతించెను బ్రహ్మదేవునిస్తోత్రమునకు సంతుష్టుడై ప్రభువైన శ్రీకృష్ణభగవానుడు శ్వేతద్వీపాధీశ్వరుడైన మహావిష్ణువుగ అసంఖ్యపార్షదపరివేష్టితుడై బ్రహ్మసమక్షమున ఆవిర్భవించి యిట్లు పల్కెను 'వత్సా! నళినసంభవా! నీహృదయములో సకలవేదజ్ఞాన ముదయించినది నీవు సృష్టిచేయవలె ననెడిసంకల్పముచే నాయాదేశానుసారముగ నన్నుగూర్చి చిరకాలము ఘోరతపమాచరించి నాయనుగ్రహమునకు పాత్రుడవైతివి కుమారా! నీకు శుభమగుగాక నీయభీష్టముల నర్థింపుము, ప్రసాదించెదను నేను దేనినైనను ఈయగలవాడను బ్రహ్మదేవా! జీవులసకలశ్రేయస్సాధనములకు పర్యవసానము లేదా ప్రతిఫలము నాదివ్యసందర్శనమే పాపరహితుడా! తపమే నాహృదయము, నేనే స్వయముగ తపమున కాత్మను తపశ్శక్తిచే నే నీసకలజగ

న్నిర్మాణకార్య మొనరించుచున్నాను తపశ్శక్తిచే విశ్వములను ధరించి పోషించుచున్నాను, తపశ్శక్తిచే సకలవిశ్వములను నాలో లీనమొనరించుకొనుచున్నాను తపస్సు దుర్లంఘ్య మైనమహాశక్తి

పరబ్రహ్మ మగువిష్ణువు పల్కిన మధురాతిమధురము లైన యనుగ్రహవాక్యముల నాలకించి బ్రహ్మ పరమానంద భరితుడై భగవంతు నిట్లుప్రార్థించెను "దేవాదిదేవా! నీవు సకలప్రాణుల హృదయాంతరంగములలో సాక్షీరూపుడ వై యుండెడుపరమాత్మవు, సర్వజ్ఞుడవు, సకలశక్తిసమన్వితుడవు, సకలవిశ్వములకు బీజస్వరూపుడవు, నాహృదయాంతరంగము నీకు విదితమే ప్రభూ! నీదివ్యతత్వజ్ఞానమును నాకు బ్రసాదింపుము నీసచ్చిదానందవిగ్రహసందర్శనసేవాసౌభాగ్యము నొసంగుము పరమాత్మా! నీవు మాయాధీశుడవు నీసంకల్ప మెన్నడును వ్యర్థము కాజాలదు గోవిందా! నీవుమాయాద్వార మున వివిధశక్తిసంపన్నము లైన యసంఖ్యాకవిశ్వములను సృజించి, ధరించి, పాలించి, సంహార మొనరించుచు అనేకరూప ముల బ్రాదుర్భవించి దివ్యక్రీడల నొనరించుచున్నావు నీదివ్య స్వరూపజ్ఞానమునునాకు బ్రసాదించి నన్ను గరుణింపుము దేనిని దెలిసికొన్న దెలియనిది మఱియొకటి యుండదో, యట్టి మహా జ్ఞానమును నా కుపదేశించి నన్ను రక్షింపుము నిష్కామి నై నాకర్తవ్యమును బరిపాలింపగలశక్తిని నాకు బ్రసాదింపుము"

బ్రహ్మదేవు డర్థించినవరముల నాలకించి శ్రీహరి యత్యంతప్రసన్నుడై మహాజ్ఞానము నిట్లుపదేశింపనారంభించెను. "కుమారా! అనుభవము, ప్రేమభక్తి, విజ్ఞానసమన్వితము, అత్యంతగుహ్యము నైననాస్వరూపజ్ఞానమును, నాప్రేమభక్తి కంగమగుసాధనభక్తిని ఉపదేశించెద నవధరింపుము నే నెంతటి వాడనో, యెట్టిలక్షణములు గలవాడనో, నా లెన్నియో నీ కావిషయములయథార్థజ్ఞానము నాకరుణవలన బరిపూర్ణముగ లభింపగలదు సృష్టికిపూర్వము నే నొక్కడనే యుంటిని నాకంటె వేఱుగ స్థూలముగాని, సూక్ష్మముగాని, వీనిరెంటికి గారణ మగుప్రధానము (అజ్ఞానము గాని లేదు. ఎచ్చోట ఈసృష్టి లేదో అచ్చోటగూడ నేనే యున్నాను. దృశ్యము లైనయీసమస్తచరాచరపదార్థము లన్నియు నేనే యనిదెలిసికొనుము అనంతకోటివిశ్వముల లోపల, బయట నేనుగానిది ఏదియు లేదు అన్నియు నేనే, అంతయు నేనే, శేషించువాడనుకూడ నేనే వాస్తవముగ లేనప్పటి ని అనిర్వచనీయ మగునేవస్తువు నాకంటే భిన్నముగ పరమాత్మనైననాలో ఇఱువురు చంద్రులవలె అనగా మిథ్యగ గోచరమగుచున్నను ఆకాశమునందలి నక్షత్రములలో రాహువువలే ఆవస్తువువెల్లడి కాదు దానినే నామాయగా దెలిసికొనుము ఎట్లుపృథివ్యాధి పంచభూతములు పంచభూతనిర్మితము లైనదేవతిర్యగాదిదేహ ములందు నిర్మాణానంతరము ప్రవేశించియు నిర్మాణమునకు ముందునుండి యచ్చోటనే యున్నందున ప్రవేశింపనట్లుండునో,

అట్లే నేను భూతమయము లగుసకలజగములలో సర్వభూతము లందు ఆత్మరూపమున విరాజిల్లి యున్నవాడ నైనను యథార్థ ముగ నేనుదక్క మఱియొకటి లేనికారణమున వానిలో ప్రవేశింపక యున్నాను ఇది బ్రహ్మముకాదు, ఇది బ్రహ్మము కాదనెడినిషేధ పద్ధతిద్వారమున, ఇదిబ్రహ్మము, ఇదిబ్రహ్మము ననెడి అన్వయపద్ధతిద్వారమున సర్వాతీతుడను, సర్వస్వరూపుడను, భగవంతుడను నైననేనే సర్వదాసర్వత్రవిరాజిల్లి యున్నానని తెలిసికొనుటయే సత్యతత్త్వము ఆత్మనుపరమాత్మను దెలిసికొనదలచినవారు ఈవిషయమును మొదట తెలిసికొనవలెను

జగన్నిర్మాణమునకు సంకల్పించి భగవానుడ నగునేను స్వయముగ రెండురూపములుగ ప్రకటితుడనైతిని ఒకరూపము నేను శ్రీకృష్ణుడను, రెండవరూపము శ్రీరాధ, ఆమె పరబ్రహ్మస్వరూపిణి, నిత్యసనాతని, ఆమె యైదురూపముల ప్రాదుర్భవించినది 1 శివస్వరూపిణి, నారాయణి, సంపూర్ణబ్రహ్మస్వరూపిణి, దుర్గ 2 శుద్ధసత్త్వస్వరూపిణిశ్రీహరిశక్తి సర్వసంపదలకు నధిష్ఠాత్రి దేవి యైనశ్రీమహాలక్ష్మి 3 బుద్ధికి, వాణికి, విద్యకు, జ్ఞానమునకు నధిష్ఠాత్రీదేవి యైన సరస్వతి 4, బ్రహ్మ తేజసంపన్న, శుద్ధసత్త్వమయి, బ్రహ్మకు బరమప్రియశక్తి యైనసావిత్రి యనగా గాయత్రి 5 శ్రీకృష్ణ భగవానునిహృదయేశ్వరి, సంపూర్ణ దేవతలయం దగ్రగణ్య, సర్వలక్షణవిలక్షణ, అనుపమేయ, అతులితసౌందర్యరాశి, సద్గుణ

సమూహసమాంపన్న, మధురభక్తిసమన్విత చిన్మయస్వరూపిణి యైన శ్రీరాధ

క్షీరములందు ధవళత్వము, అగ్నియందు దాహకశక్తి, పృథ్వియందు గంధము, జలములందు శీతలత్వము నుండునట్లు ఈ యాద్యప్రకృతి నాయందు మిళితమైయున్నది పురుషప్రకృతులమైన మాయందు భేదములేదు సృష్టియంతయు ఆద్యప్రకృతిరూపమే నేను మూలము, ఆమె రూపము నేను లేని యామె నిర్జీవము ఆమె లేనినేను అదృశ్యుడను నేనెట్లునిత్యుడనో, పరాప్రకృతి యైన ఆమెయు నిత్యమే సువర్ణము లేనిదే స్వర్ణకారుడు ఆభరణములు నిర్మింప లేనట్లు ఈమె లేనిదే నేను సృష్టిచేయలేను ఆమె సచ్చిదానందశక్తిస్వరూపిణి, సత్తు, చిత్తు, ఆనందము ఆమెయొక్క మూడురూపములు ఆనందము నిత్స్వరూపశక్తి ఆమెయె హ్లాదిని యగురాధాదేవి అంతరంగ శక్తి, మూర్తిమతి యగుహ్లాదినీశక్తి ఆనందస్వరూపుడ నగు నాకు (శ్రీకృష్ణునకు) అనిర్వచనీయము, మధురము, దివ్యము నగు అనుభూతిని కలిగించును నాదివ్యానందానుభూతిద్వారమునను ఆమెకూడ అచింత్యదివ్యసుఖము నాస్వాదించును ఆమెయొక్క మరియొకరూపమే మాయాశక్తి యనగా బహిరంగశక్తి సకల విశ్వములరూపము మూడవది జీవశక్తి అనగా తటస్థశక్తి ఈసకలశక్తి స్వరూపిణి యైన శ్రీరాధ శ్రీకృష్ణభగవానునియాత్మ. ఆమెయందు నిత్యము రమించుచుండుటచేతనే శ్రీకృష్ణునాత్మారాము డందురు

బ్రహ్మదేవా! నీవు అవిచల మైన తపస్సమాధిద్వార మున నా యీ గుహ్యసిద్ధాంతమును బరిపూర్ణముగ దెలిసికొనె దవుగాక! ఈజ్ఞానముచే ప్రతికల్పమునందును వివిధసృష్టుల నొన రించు నీకు నేనే సృష్టికర్త నను అహంకారము గలుగజాలదు

ఇట్లు మహాజ్ఞానోపదేశ మొనరించి శ్రీహరి బ్రహ్మ దేవా! నీవు నాభక్తశిఖామణివి కావున నీభక్త్యారాధన నిరా టంకముగ సాగుటకు నీసేవలకై నాపార్షదు డైన శ్రీశంఖుకర్ణుని వినియోగించుచున్నాను ఈపరమభాగవతోత్తముని సాంగత్య ముచే నిరహంకారుడ వై సృష్టికార్యముల నిర్వర్తింపు మని పల్కి శ్రీశంఖుకర్ణుని బ్రహ్మదేవుని సేవలందు వినియోగించి శ్రీహరి అంతర్హితుడయ్యెను

శ్రీశంఖుకర్ణుడు సత్యలోకమున బ్రహ్మదేవునకు సేవ లొనరించుచు సతతము శ్రీహరిదివ్యనామసంకీర్తనాతత్పరుడై హరినామసుధామాధుర్యము ను గ్రోలుచు ఏబది సంవత్సరములు (బ్రహ్మకాలమానప్రకారము) పూర్తి చేసెను ఒకదినమున శ్రీకృష్ణనామసుధాపానమత్తు డై శ్రీశంఖుకర్ణుడు బ్రహ్మసేవలకు ఆలస్యమును గల్పింపగా విధాత ఈభాగవతోత్తముని యనన్య భక్తిప్రపత్తుల కత్యంతప్రసన్నుడై ఈమహానుభావుని భవరోగ పీడితమానవశ్రేయస్సునకై అవనిపైకి పంపవలె ననిసంకల్పించి తన సేవలకు లోప మొనరించినా డనెడిమిషతో దైత్యతనయుడ వై వసుధపై జన్మింపవలసినదిగా ఆదేశించెను

శ్లో॥ శంఖుకర్ణాఖ్యదేవస్తు బ్రహ్మశాపాచ్చ భూతలే ।
ప్రహ్లాద ఇతి విఖ్యాతో భూభారక్షపణే రత ॥
స ఏవ రాఘవేన్ద్రాఖ్యయతిరూపేణ సర్వదా ।
కలౌ యుగే రామసేవాం కుర్వన్ మన్త్రాలయే భవేత్ ॥

(శ్రీస్తు) ౨

తా॥ శ్రీశంఖుకర్ణు డను దేవుడే శ్రీహరి ని ప్రవార మొనరించి భూభారమును తగ్గింపవలె ననెడియాకాంక్షతో బ్రహ్మశాపముచే ప్రహ్లాదునిగ వసుధపై నవతరించెను ఆయన యే కలియుగములో సర్వదా శ్రీరామసేవ చేయుటకు శ్రీరాఘవేంద్రయతిగ ఆవిర్భవించి మంత్రాలయములో విరాజిల్లగలడు

కృతయుగములో ఈయనని యంతయు మహాదైత్యుడైనహిరణ్యకశిపునిపరిపాలనలో నుండెను ఆదైత్యాగ్రేసరుడు ఘోరతప మాచరించి బ్రహ్మదేవుని ప్రసన్ను నిగ నొనరించుకొని ఆయనద్వారమున అప్రతిహతము లైనదివ్యవరములను బడసెను బ్రహ్మప్రదత్త మైనవరశక్తిచే బలోన్మత్తుడై అహంకరించి నేనే భగవంతుడ ననిబ్రకటించుకొనెను ఆదైత్యుడు పరమక్రూరుడై 'నన్నే దైవముగ నారాధింపు' మనిసకలమానవసమాజమును బీడించి దేవప్రీతికరము లైనయజ్ఞయాగాది కర్మలకు భంగ మొనరించి శ్రీహరినామసంకీర్తనమును నిషేధించెను

సత్యలోకమునుండి బ్రహ్మదేవునియాదేశానుసారముగ భువికి దిగివచ్చిన శ్రీశంఖుకర్ణుడు హిరణ్యకశిపునకు పుత్రునిగ జన్మించి ప్రహ్లాదు డనునామమున జగద్విఖ్యాతిగాంచెను ప్రహ్లాదుడు క్రూరుడైనరాక్షసునకు పుత్రుడుగ జన్మించినను పూర్వజ్ఞానముచే శ్రీహరియం దనన్యభక్తుడై యుండెను జన్మించినదిమొదలు ప్రహ్లాదుడు శ్రీహరిదివ్యనామసంకీర్తన మనెడు అపారశక్తిసమన్వితుడై శ్రీహరికి బద్ధవిరోధియైనతన తండ్రినిరంకుశత్వము నెదిరించి శ్రీహరిశక్తిని బ్రకటించె ముక్కుపచ్చలారని ను చేయు శ్రీహరిదివ్యనామస ర్తనప్రచారముచే ధరాతలమందు గలసకలజీవులు పరమవైష్ణవులైరి ప్రహ్లాదునివాక్యములను సత్య మొనరించుటకే శ్రీ శ్రీనరసింహాస్వామిరూపమున స్తంభమునుండి బయల్వెడలి అసురుని సంహరించి తనయనన్యభక్తుడైన ప్రహ్లాదుని యనుగ్రహించెను శ్రీహరియె స్వయముగ సింహాసనము నధిష్ఠించి దైత్యుని పాపకర్మలవలన దాని నావరించిన కల్మషములను హరించివై చెను తదన ర మాపవిత్రసింహాసనముపై పరమభాగవతాగ్రణి యగు ప్రహ్లాదు నధిష్ఠింపజేసి ఆయనను అఖిలభూమండలమునకు ఏకఛత్రాధిపతిగ నభిషేకించెను

శ్రీహరిపరమభక్తుడైన శ్రీప్రహ్లాదచక్రవర్తి ఆయనయాదేశానుసారముగ ఈధరాతలమును చాలకాలము పరిపాలించెను తనరాజ్యకాలములో ప్రహ్లాదుడు అఖండహరినామసంకీర్తన

భక్తిసేవాదులచే నఖండపుణ్యమును, రాజోచితధర్మము లైన యజ్ఞయాగాదిక్రతువులచే అనిష్ట పుణ్యములను సముపార్జించెను ప్రాణి యనిష్టపుణ్యము ననుభవింపనిదే ముక్తిని బొందలేడు ఈయనిష్టపుణ్యము కేవలము భౌతికసుఖముల ననుభవించుటకే దోహదము కాగలదుకాని ముక్తికి నిష్ప్రయోజన మగును కావున వైకుంఠమును జేరినప్రహ్లాదుడుతనయనిష్టపుణ్యవిశేషముచే మరల త్రేతాయుగమున విభీషణునిగ జన్మించెను ఈజన్మములో మర్యాదాపురుషోత్తము డైన శ్రీరామచంద్రు నారాధించి ఆయనకరుణకు పాత్రుడై బ్రహ్మచేనారాధింపబడినమూలరామ మూర్తులనుపొంది చిరకాలము రాక్షససామ్రాజ్యమునకు చక్రవర్తి యై యజ్ఞయాగాది కర్మల నొనరించి తనయనిష్టపుణ్యమును మరల వృద్ధిచేసికొనెను

ద్వాపరయుగములో శ్రీమూలరామమూర్తులను సేవించుటకుఆయనబాహ్లీకచక్రవర్తిగ జన్మించెను కాళింగదేశమునకు సమ్రాట్టైన బాహ్లీకుడుకూడ శ్రీమన్నారాయణునియందనన్యభక్తిగలవాడై వైష్ణవశిరోమణిగ ప్రసిద్ధిగాంచెను శ్రీ మూలరామమూర్తులను ఎంతగనారాధించినను ఆజననాథునకు దృప్తిగలుగలేదు ఆతడు తనపూర్వజన్మమందార్జించిన యనిష్టపుణ్యముల ననుభవింపక విరాగి యై, శ్రీహరిభక్తుడై

ఇ కర్మల నొనరించి మరల యనిష్టపుణ్యము నభివృద్ధిచేసెను

ప్రహ్లాదు డేకారణమువలన దివినుండి భువికి దిగివచ్చెనో ఆకారణమువలననే బాహ్లీకుడు కలియుగములో శ్రీరామచంద్రుని ఆరాధింపవలె ననెడిప్రగాఢవాంఛతో (క్రీ శ 22-4-1447) విజయనగరసామ్రాజ్యమున శ్రీవ్యాసరాయునిగ నవతరించెను

# శ్రీ వ్యాసరాయ తీర్థులు

విజయనగరసామ్రాజ్యములో శ్రీబ్రహ్మణ్యతీర్థు లను గొప్ప వైష్ణవయతీంద్రులు విరాజిల్లిరి వారికాలములో కావేరీ తీరములో బన్నూరను కు గ్రామములో రామాచార్యు లనునొక భక్తుడు నివసించుచుండెను ఆయనభార్య లక్ష్మిబాయి ఆయన వృద్ధు డైనను సంతానమును బడయజాలక సత్పుత్రుని బొందుటకై మహాత్ము డైన శ్రీబ్రహ్మణ్యతీర్థుల నాశ్రయించెను శ్రీరామాచార్యునకు బుత్రసంతానము గల్గిన ఆశ్రమమున కర్పింపవలె ననెడిషరతుతో శ్రీబ్రహ్మణ్యతీర్థులవారు "సత్పుత్ర ప్రాప్తిరస్తు 'అని ఆశ్రితుని దీవించెను స్వామియాశీర్వాదబలముచే ఆసంవత్సరముననె రామాచార్యునిగృహమున మహాత్ము డైనపుత్రు డుదయించెను నాటిప్రహ్లాదుడే నేటి యీదివ్యశిశు వనిపారకమహాశయులు గ్రహించియే యుందురు

శ్రీబ్రహ్మణ్యతీర్థుల కొసంగినవచనానుసారముగ శ్రీ రామాచార్యులు తనతనయుని ఆశ్రమమున కర్పించి సత్యవాక్పరిపాలన మొనరించెను ఆదివ్యశిశువునకుయతిరాజని నామకరణ మొనరించి శ్రీబ్రహ్మణ్యతీర్థులవారే స్వయముగ దన పర్యవేక్షణలో బెంచనారంభించిరి బ్రహ్మణ్యతీర్థులు ప్రతి దినము దేవున కర్పించిన పాలుపండ్లు యతిరాజునకిచ్చెడివారు యతిరాజునకు నాల్గవసంవత్సరములోనే ఉపనయనసంస్కార మొనరించి శ్రీతీర్థులవారు యెనిమిదవసంవత్సరమున సన్యాసాశ్రమము

నొసంగి శ్రీవ్యాసరాయు లనునామము నొసంగిరి శ్రీబ్రహ్మణ్య తీర్థులవారే స్వయముగ శ్రీవ్యాసరాయునకు ద్వైతసిద్ధాంత ములో శిక్షణ నిచ్చి విద్యాభ్యాసా మై శ్రీశ్రీపాదరాజస్వామి చెంతకు బంపిరి శ్రీశంఖుకర్ణనియవతార మైన శ్రీవ్యాసరాయలు సత్యసంధు డైన నరేంద్రికి తనయు డై జన్మించి పరమభాగవతో త్తము డైన శ్రీబ్రహ్మణ్యతీర్థునిచే పెంచబడి శ్రీశ్రీపాదరాజ స్వామిచే సకలయాధ్యాత్మికవిద్యలను బడసి గొప్పవిద్వాంసు డై ద్వైతసిద్ధాంతములో అసమానప్రజ్ఞాధురీణు డయ్యెను పుట్టుక తోనే మహాకవిగ జన్మించిన శ్రీవ్యాసరాయలవారు గొప్పతప మాచరించి మహాతపస్వి యయ్యెను

శ్రీబ్రహ్మణ్యతీర్థుల యనంతరము (1468 సం॥లో) శ్రీవ్యాసరాయలవారు ఆశ్రమాధిపతు లైరి తదనంతర మాయన భారతవర్షమందు గల సమస్తపుణ్యక్షేత్రములలో బర్యటించెను ఆయన పర్యటించిన ప్రదేశములలోనివా రందఱిని ద్వైతసిద్ధాంత వాదులుగ మార్చి రైచెను తనయఖండపాండిత్యము లతో శ్రీవ్యాసరాయలవారు ఆశ్రమమున కనేకజాగీరులను, అగ్రహారములను, ధనకనకవస్తువాహనములను సముపార్జించిరి నాటినుండి ఆయాశ్రమము శ్రీవ్యాసరాయమఠ మనిప్రసిద్ధి గాంచెను

ఆసమయములో కర్ణాటకాంధ్రసామ్రాజ్యమును శ్రీకృష్ణ దేవరాయలు పరిపాలించుచుండెను త్వరలో కుహూయోగ

సంధికాలము ఆసన్నమైయున్న దని అపరోక్షజ్ఞానులు శ్రీకృష్ణదేవరాయలను హెచ్చరించిరి 8-1-1521 అనగా విక్రమనామ సంవత్సరపుష్యబహుళ అమావాస్య దినమున కుహూయోగము సంభవించు ననివారు పల్కిరి ఆదుష్టకాలములో రాజ్యాధినేతకు ప్రాణగండము సంభవించును శ్రీకృష్ణదేవరాయ లీ కుహూయోగపరిష్కారార్థము యేమిచేయవలయు ననిగురుజనులను ప్రశ్నించెను అందులకు వారు'రాజా! నీసర్వస్వమును దేవాంశసంభూతు డగుయొకమహాత్మున కర్పించి నీవు భృత్యుడవు కావలయును కుహూయోగకాల ముప్పుంతవరకు ఆమహనీయుని సింహాసనాధీశునిగ నుంచవలయును ఆదుష్టకాలము తొలగిపోయినయనంతరము నీవు మరల నీరాజ్యమును పరిగ్రహింపవచ్చు'ననిపలికిరి శ్రీకృష్ణదేవరాయలు శ్రీవ్యాసరాయస్వాముల దివ్యమహిమలను స్వయముగ దర్శించి ఆయనకే నాడో శిష్యుడయ్యెను

శ్రీకృష్ణదేవరాయలు తనను కుహూయోగమృత్యుగండమునుండి రక్షింపవలసినదిగ శ్రీవ్యాసరాయతీర్థులచరణముల నాశ్రయించెను అందులకు శ్రీవారు సమ్మతించిరి తత్క్షణమే శ్రీవ్యాసరాయతీర్థుని శ్రీవిజయనగరసామ్రాజ్యసింహాసనముపై అధిష్ఠింపజేసి శ్రీరాయలు తన సర్వస్వమును ధారపోసెను తాను భృత్యుడై శ్రీవ్యాసరాయతీర్థుని సేవింప నారంభించెను

కుహూయోగసమయ మాసన్నమయ్యెను ఆసమయ మున శ్రీవ్యాసరాయతీర్ధస్వామి సింహాసనాధీశుడై కొలువు దీరియుండెను అప్పుడు సభామధ్యములో భూమినుండి ఒక యగ్నిజ్వాల బయల్వెడలి సింహాసనము నధిష్టించియున్న శ్రీవ్యాసరాయతీర్థులను కబళించుటకు బయలుదేరెను అప్పుడు శ్రీవ్యాసరాయస్వామి తనపై కప్పుకొనియున్న కాషాయవస్త్ర మును దీసి ఆకాలాగ్నిపై వైచెను వెంటనే ఆయగ్ని శాంతించి అంతర్ధాన మాయెను కుహూయోగ సంధి కాలమున ఆదుర్నిమిత్తమును తాను స్వీకరించి శ్రీవ్యాసరాయయతీంద్రులు శ్రీకృష్ణదేవరాయలను కాపాడెను. తదనంతరము కర్నాట కాంధ్రసామ్రాజ్యమును వైష్ణవ యతీంద్రునకు సేవకునిగ శ్రీకృష్ణదేవరాయలు పరిపాలించెను తదనంతరము గురుదేవుని ఆజ్ఞానుసారముగ రాయలు తిరుపతిమహాక్షేత్రమును దర్శించి స్వామిసమక్షమున తన దేవేరులతో సహా విగ్రహములను నిర్మించి దాసానుదాసునిగ తిరుపతిక్షేత్రఆలయప్రాంగణములో నిలిపెను నేటికిని ఆవిగ్రహములను మనము తిరుపతిక్షేత్ర మందు దర్శింపవచ్చును శ్రీవ్యాసరాయతీర్ధులు శ్రీవేంకటేశా ర్పణముగ విజయనగరసామ్రాజ్యమును స్వీకరించి స్వామిప్రతి నిధిగమాత్రమే సింహాసనము నధిష్టించెను కావున శ్రీకృష్ణ దేవరాయలు శ్రీవేంకటేశ్వరునిదాసుడైనశ్రీవ్యాసరాయనికి దాసుడై ధన్యుడయ్యెను ఈవిచిత్ర సంఘటనను ఎందఱో

చరిత్రకారులు పరిశీలించి ధృవీకరించిరి విక్రమసంవత్సర ఫాల్గుణశుక్లఏకాదశిదినమున శ్రీకృష్ణదేవరాయలు మదనపల్లి తాలూకాలో నున్న వ్యాసముద్ర మను గ్రామమును శ్రీవ్యాస తీర్థునకు గోపాలకృష్ణస్వామినామముతో సమర్పించి నట్లుగ శాసనములు కలవు

శ్రీవ్యాసరాయలవారు పన్నెండు సంవత్సరములు శ్రీవేంకటేశ్వరస్వామిదివ్యసన్నిధిలో నివసించుచు శ్రీవారి నారాధించెను ఆకాలములోనే ఆయన శ్రీనివాసునినిత్యారాధనలను క్రమబద్ధ మొనరించెను తీర్థయాత్రాకాలములో ఆయన తాను సందర్శించిన ప్రతిప్రదేశములోను శ్రీఆంజనేయస్వామి విగ్రహములను బ్రతిష్ఠించెను దక్షిణభారతదేశములోనే వివిధ ప్రదేశములలో శ్రీవ్యాసరాయలవారు షుమారు ఏదువందల ముప్పదినాల్గు(734)ఆంజనేయస్వామివిగ్రహములను బ్రతిష్ఠించి నారని చరిత్ర ధ్రువీకరించుచున్నది శ్రీవ్యాసరాయలవారు రాజగురు వైనకారణమున రాజ్యపరిపాలనలో శ్రీకృష్ణదేవరా యలకు న్యాయబద్ధము లైనసలహాల నొసంగెడివా రనిచరిత్ర గలదు వైష్ణవమఠపీఠాధిపతి యైనను శ్రీవ్యాసరాయస్వామి తుదివరకు విజయనగరసామ్రాజ్యమునకు ధర్మసంరక్షకునిగ నిలచి ప్రజలను రక్షించిరి తన తొంబదిరెండవసంవత్సరములో శ్రీవ్యాసరాయలవారు విజయనగరములో గల హంపీవద్ద పవిత్ర తుంగభద్రానదీతీరములో పాంచభౌతికకాయమును బరిత్యజించి

దివ్యదేహధారియై వైకుంఠమును జేరెను తనజీవితకాలములో ఈమహాత్ముడు ద్వైతమతసిద్ధాంత ప్రతిపాదకము లైన యనేక గ్రంథములను రచించి శ్రీమధ్వాచార్యులు బ్రతిపాదించినద్వైత వాదమే సత్యమని, ఆయాచార్యుడు జూపినమార్గమే భగవంతుని జేరుటకు రాజమార్గ మని నిరూపించెను

శ్రీవ్యాసరాయలవారి ప్రోత్సాహమువలన ఎందఱో కన్నడ కవులు భగవంతుని దివ్యగుణములను కీర్తనలుగ రచించి బహుళ ప్రచార మొనరించిరి పుట్టుకతోనే కవీశ్వరునిగ మారెన శ్రీ వ్యాసరాయలవారు, శ్రీహరిపైన, శ్రీవాయువుపైన యనేక గీతములను, భజనలను కన్నడభాషలో రచించి మధురాతిమధురముగ గాన మొనరించెను శ్రీహరికీర్తనలు రచింపజేసి శ్రీహరి భక్తిప్రచార మొనరించుటకు శ్రీపురందరదాసు, శ్రీకనకదాసు, శ్రీవడిరాజస్వామి మున్నగుహరిదాసులను గలసికొని వ్యాస రాయలవారు వారిని భగవద్గుణకీర్తనమున బ్రోత్సహించి శ్రీ దాసకోటను స్థాపించెను శ్రీవ్యాసరాయలవారు తమ జీవితాంతము శ్రీమూలరామమూర్తిని భక్తితో నారాధించిరి ఎంతగా స్వామిని గొలిచినను శ్రీవ్యాసరాయలవారికి శ్రీరామారాధనాతృష్ణ దీరలేదు స్వామి నారాధించుటకు కోటానుకోట్లజన్మ లైనను స్వల్ప మని తాను శ్రీమూలరామమూర్తిని దనివిదీర ఆరాధించుటకు దివినుండి భువికి మఱల దిగివత్తునని తన యవసానకాలములో బ్రవచించి శ్రీవ్యాసరాయలవారు దివ్యదేహధారియై పరంధామమునకు వెడలిపోయెను

ఆశంఖుకర్ణుడే శ్రీమూలరామారాధనాకాంక్షతో పదు నైదువందలతొంబదియెనిమిదవ (1598) సంవత్సరములో మఱల దివినుండి భువికి దిగివచ్చి శ్రీరాఘవేంద్రస్వామిగ బ్రసిద్ధిగాంచి నేటికిని శ్రీమంత్రాలయాంతర్గత బృందావనములో సజీవులై విరాజిల్లుచు తన్నాశ్రయించినభక్తుల సర్వాభీష్టములను తీర్చు చున్నారు. ప్రతియుగములోను శ్రీశంఖుకర్ణుడు భవరోగపీడిత మానవాళి నుద్ధరించుటకై దివినుండి భువికి దిగివచ్చుచునే యున్నాడు. కృతయుగములో ప్రహ్లాదునిగ, త్రేతాయుగ ములో విభీషణునిగ, ద్వాపరయుగములో బాహ్లీకునిగ, కలి యుగములో శ్రీవ్యాసరాయునిగ, శ్రీరాఘవేంద్రస్వామిగ శ్రీశంఖుకర్ణు డవతరించి శ్రీహరిభక్త్యారాధనలను బ్రచార మొన రించి నేటికిని సజీవముగ శ్రీమంత్రాలయాంతర్గత బృందావన ములో విరాజిల్లి యున్నాడు. తనయవతారము లన్నిటిలో సముపార్జించిన యనిష్ట బుణ్యారాసులను ఆశ్రితభక్తులకు బ్రసా దించుచు తాపత్రయములనుండి వారిని రక్షించుచు వారికి నివృత్తిమార్గమును జూపుచుండెను. నేను ఏడువందల (700) సంవత్సరములు బృందావనములో వేంచేసియుండి ఆశ్రితభక్తు లను రక్షించి వారియార్తిని బాపెద నని శ్రీరాఘవేంద్ర స్వామియే స్వయముగ బల్కిరి.

శ్రీరాఘవేంద్రస్వామి సజీవముగ శ్రీమంత్రాలయాంతర్గత బృందావనమును బ్రవేశించి నేటికి షుమారుగ మూడువందల

(300) సంవత్సరములు గడచెను మఱి నాల్గువందల (400) సంవత్సరములవఱకు స్వామి బృందావనములో విరాజిల్లుచు ఆశ్రితభక్తులను రక్షించెదరు కావున ప్రతిమానవుడు విధిగ శ్రీమంత్రాలయక్షేత్రమును దర్శించి తమతమశక్త్యానుసారముగ శ్రీరాఘవేంద్రస్వామి నారాధించి ఆయన కరుణకు పాత్రులు కావలెను

# శ్రీ రాఘవేంద్ర గురు సంభవము

పదునైదవశతాబ్దారంభమున దక్షిణభారతదేశములో విజయనగరసామ్రాజ్యము పరిఢవిల్లెను. శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్రకర్ణాటకరాజ్యములకు చక్రవర్తియై ధర్మపరిపాలన మొనరించుటయేగాక, కవిత్వము, సంగీతము, శిల్పము, చిత్రలేఖనము, నాట్యము, మొదలగులలితకళలను ప్రోత్సహించి పండితులను, విద్వాంసులను, కవివరేణ్యులను, శిల్పాచార్యులను ఘనముగ సన్మానించి పోషించెను. విజయనగర చక్రవర్తుల యుగము స్వర్ణయుగ మని విదేశీయులసహితము వేనోళ్ళ కీర్తించిరి. శ్రీకృష్ణదేవరాయలవారి ఆస్థానములో శ్రీకృష్ణభట్టారకుడను సద్బ్రాహ్మణుడు ఆస్థానవైణిక విద్వాంసునిగ నుండెను. ఈయన పరమవైష్ణవుడు, తత్త్వశాస్త్రవిశారదుడు, వేదవేదాంగవిదుడు, కర్ణాటకసంగీతవిద్వాంసుడు, వీణావాదనమున అద్వితీయుడు. శ్రీకృష్ణభట్టారకుడు శ్రీకృష్ణదేవరాయలకు గురువై వీణావాదనమున స్వయముగ శిక్షణమొసంగెడివారట. శ్రీకృష్ణభట్టారకుని కుమారుడైన శ్రీకనకాచలభట్టుకూడ మహాపండితుడు, వేదవేదాంగవిద్వాంసుడు, సంగీతవిశారదుడు, వీణావాదనకోవిదుడు. తనతండ్రియనంతరము శ్రీకనకాచలభట్టుకూడ విజయనగరరాజాస్థానములో ఆస్థానవిద్వాంసు డయ్యెను.

శ్రీకనకాచలభట్టు రాజాశ్రయములో నెట్టిలోటు లేనివాడై సుఖముగ జీవించెను. కాని సంతానము లేమిచే ఆయన

చింతాక్రాంతుడై సత్పుత్రునికొఱ కెన్నియో వ్రతముల నాచరించి తీర్థయాత్రల నొనరించెను శ్రీవ్యాసరాయలచే విజయనగరములో ప్రతిష్ఠింపబడిన ఆంజనేయస్వామి నారాధించి ఆ భక్తాగ్రేసరుని కృపకు బాత్రుడై వయసుమళ్ళిన తరుణములో సత్పుత్రుని బడసెను శ్రీఆంజనేయానుగ్రహమున జన్మించిన యాశిశువునకు తిమ్మన్నభట్టు అనినామకరణ మొనరించి అల్లారుముద్దుగ పెంచనారంభించెను శ్రీకనకాచలభట్టు తన కుమారునకు ద్వైతసిద్ధాంతమును బాగుగ బోధించి మహావిద్వాంసునిగ నొనరించెను తిమ్మన్నభట్టు తండ్రిచెంతనే కర్ణాటకసంగీతమును వీణావాదనము నభ్యసించి తండ్రిని మించినతనయుడయ్యెను కాలక్రమమున ఆయన శీలవతి, సౌందర్యవతి, సద్గుణవతి యైనగోపమ్మ యనెడుకన్యను వివాహమాడి గృహస్థాశ్రమమును స్వీకరించెను గోపమ్మ శ్రీహరి పరమభక్తురాలు, కుమాశీల, మహాపతివ్రత ఆదంపతులకు క్రమముగ నిద్దరు సంతానము కల్గిరి ప్రథమసంతానము కుమార్తె, ఆమె నామధేయము వెంకమాంబ ద్వితీయసంతానము కుమారుడు కుమారునకు గురురాజు అనినామకరణ మొనరించి ఆదంపతులు సుఖముగ జీవింపనారంభించిరి రాజాశ్రయములో సుఖజీవన మొనరించుచున్న తిమ్మన్నభట్టారకునకు దుర్దినములు దాపురించెను ఆకాలములో శ్రీకృష్ణదేవరాయలవారి జామాత యైన శ్రీఅళియరామరాయ లు రా పరిపాలనాభారము వహించుచుండిరి విజయనగరసామ్రాజ్యమును పతన మొనరింపవలె నని

[illegible]రులు కుట్రపన్ని తమలోగల పరస్పరవిరోధము లను విస్మరించి యొకటియై అసంఖ్యాకసైన్యములతో "రక్షసి తంగడి" యనుగ్రామములమధ్య క్రీ శ 1 సం॥లో రామ రాయలసైన్యములను ముట్టడించి ఘోరముగ నోడించిరి దీనికే తళ్లికోటయుద్ధ మని ప్రఖ్యాతనామము కలదు నాటితో విజయనగరసామ్రాజ్యవైభవ మంతరించెను మహమ్మదీ యులు ద్వేషముతో, కక్ష తో నెలలపర్యంతము భారతవర్షము నకు ధనాగార మైనవిజయనగరసామ్రాజ్యమును కొల్లగొట్టిరి జాతివిద్వేషముచే వారు విజయనగరసౌధములను, ఆలయము లను నేలమట్టమొనరించి అడ్డువచ్చినవారిని వధించుచు స్త్రీలను చెరబట్టి, బాలికలను సహితము చెఱచుచు రాత్రియనక, పగల నక ఘోరకలి నొనరించిరి విజయనగరపౌరు లీరాక్షసకాండను సహింపలేక ప్రాణముల నరచేత బట్టుకొని నగరములను వీడి పారిపోయిరి ఇట్లు తనరాజాశ్రయము విచ్ఛిన్నము కాగా తిమ్మన్నభట్టు తనభార్యను బిడ్డలను దోడ్కొని పూర్వీకులు రాజాశ్రయమున సముపార్జించిన ధనమును మోయగల్గినంత దీసికొని హిందూరాజ్యమైన తంజావూరు రాష్ట్రమునకు వలస వచ్చెను

తంజావూరురాష్ట్రములో కాంచీనగరమునకు చేరువలో నున్న భువనగిరి యనెడు కుగ్రామములో తిమ్మన్నభట్టు తన కుటుంబముతో నివసింపనారంభించెను కాని ఆగ్రామములో

సంపాదన కెట్టియవకాశము లేనందున తిమ్మన్నభట్టు తన కుటుంబపోషణార్థమై విజయనగరమునుండి గొనివచ్చిన తన పూర్వీకుల సంపదలను క్రమముగ వెచ్చింప నారంభించెను. ఇట్లు పదిసంవత్సరములు గడచిన యనంతరము యుక్తవయస్కురాలైన తనపుత్రికను మధురానగరవాసియైన శ్రీలక్ష్మీనృసింహాచార్యు డనువిద్వాంసున కిచ్చి ఘనముగ వివాహ మొనరించెను. ఈ వివాహమువలన తిమ్మన్నభట్టుచెంత గల ధన మంతయు వ్యయమయ్యెను. శ్రీవెంకమాంబ తనభర్త ననుసరించి మధురకు వెడలిపోగా గృహములో బాలకుడైనగురురాజు ఒంటరిగా మిగిలిపోయెను.

దినములు గడచుచున్నకొలది దారిద్ర్యము భట్టారకుని గృహము నావరించెను. కొందఱువిద్యార్థులకు సంగీతపాఠములు జెప్పుకొనుచు ఎంతయోకష్టముతో భట్టుజీవితమును సాగించుచుండెను. గురురాజు ఉపనయనసంస్కారమును బొంది విద్యార్థియై గురుకులమునకు వెడలిపోయెను. గురురాజు తరువాత ఆ దంపతులకు సంతానము లేనందున వారిగృహము సంతోషశూన్యమయ్యెను. ఆదంపతులు భాగవతోత్తముడైనపుత్రుని బడయవలె ననియెన్నియో వ్రతముల నాచరించిరి. కాని వారి పూజలు ఫలింపలేదు. ఈకలియుగములో ఆశ్రితులసకలాభీష్టములను తీర్చుటకు సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుడే ఏడుకొండలపై శ్రీవేంకటేశ్వరునిగ వేంచేసియున్నా డని(అందఱకు)

సర్వులకు విదితమే. సత్పుత్రుని బడయుటకు ఆశ్రీనివాసుని సేవింపవలె ననిసంకల్పించి తిమ్మన్నభట్టారకుడు ధర్మపత్నితో గూడి తిరుపతిని జేరికొనిరి. ఆదంపతులు జితేంద్రియు లై భగవద్భక్తు డైనపుత్రునికొఱకు ఒకసంవత్సరకాలము శ్రీవేంకటేశ్వర స్వామి ననన్యభక్తితో నారాధించిరి.

ఒకదినమున బ్రహ్మముహూర్తమున తిమ్మన్నభట్టారకునకు స్వప్నమందు శ్రీశ్రీనివాసుడు సాక్షాత్కరించెను. ఆజగన్నాథుని దివ్యమంగళవిగ్రహమును వర్ణించు టెవరితరము? చతుర్ముఖు డైనబ్రహ్మ యైనను, పంచముఖములు గల్గిన పరమేశ్వరు డైనను, సహస్రముఖములు గల్గిన అనంతు డైనను స్వామిదివ్యరూపమును వర్ణింపజాలరు. శ్రీ శ్రీవేంకటేశ్వరుని వక్షఃస్థలముపై శ్రీదేవి భూదేవి విరాజిల్లుచుండిరి. స్వామి శిరముపై తులసిని ధరించియుండెను. ఆయన పాదాగ్రమునుండి పవిత్రగంగాభవాని ప్రవహించుచుండెను. నాభినుండి ఉద్భవించినకమలమున జగద్విధాత యగుబ్రహ్మ విరాజమానుడై యుండెను. సూర్యచంద్రులే ఆయన నేత్రములు. ధ్వజముపై గరుత్మంతు డుండెను. అఖండతపోతేజముచే ప్రభువు ప్రకాశించుచుండెను. నాసాపుటములందు శ్రీవాయుదేవుడు విరాజిల్లి యుండెను. సకలపుణ్యనదులాయనశిరోజము లైనవి, దేవతాగణము లాయనరోమము లైరి, అనంతకోటిసూర్యులను మించి ప్రకాశించుచున్న ఆయన తేజము భక్తులకు శరచ్చంద్రునివెన్నెల

వలె చల్లగ నుండెను కలితలక్ష్మీశుడు, సర్వజగన్నివేశుడు విమలరవికోటి సంకాశుడు నగు వేంకటేశ్వరునిగాంచి తిమ్మన్న భట్టారకుడు పులకితగాత్రు డయ్యెను స్వామిదివ్యపాదములు బ్రహ్మకడిగినపాదములు, స్వామినకుమున గజ్జెందియలు అలంకరింపబడి యుండెను లక్ష్మీపతి పీతాంబరధారి యై ఒకహస్తముచే తనపాదములను జూపుచు, మరియొకహస్తముచే నభయము నొసంగుచు, రెండుహస్తముల శంఖుచక్రములను ధరించి సరసన అలివేలుమంగమ్మ అలరారుచుండ దివ్యరత్న మకుటధారి యై వక్ష స్థలముపై తిరుమణి శోభింపగ మకర కుండలములు కర్ణముల నలంకరింపబడి ప్రకాశించుచుండ ఆలక్ష్మీశుడు, సర్వజగన్నివేశుడు, విమలరవికోటిసంకాశుడు తిమ్మనార్యునకు దివ్యసందర్శన మొసంగెను ఆహా! ఆభాగవతోత్తముని జన్మమె జన్మము జీవనమే జీవనము, అదృష్టమే అదృష్టము కోటానుకోట్ల పూర్వజన్మల సముపార్జితాఖండ పుణ్యవిశేషముచే తిమ్మన్నభట్టారకునకు శ్రీనివాసుడు తన దివ్యదర్శన మొసంగెను

స్వామిసచ్చిదానందవిగ్రహదర్శనముచే తిమ్మన్నభట్టారకుడు అశ్రుపూర్ణ నయను డై ముకుళితహస్తములతో "మాధవా! గోవిందా! మధుసూదనా! అచుతా! వామనా! ప్రద్యుమ్నా! వాసుదేవా! త్రివిక్రమా! పద్మనాభా! జనార్దనా! హృషీకేశా! నారసింహా!

శ్రీనివాసా ! వేంకటాచలపతీ ! పాహి - పాహి" యని యనేకవిధముల స్తుతించెను. తిమ్మన్నభట్టారకు డొనరించిన స్తోత్రమున కత్యంతప్రసన్ను డై వేంకటాచలపతి మధుర వాత్సల్యభరితవచనములతో నిట్లనుగ్రహించెను. "బ్రాహ్మణో త్తమా నీభక్తిసేవారాధనల కత్యంతము ప్రసన్నుడ నైతిని. నీమనోభీష్టము పరిపూర్ణ మగుగాక. నాపార్షదుడే నీగృహ ములో భవరోగపీడితమానవసమాజోద్ధరణమున కవతరింప గలడు. అతడు సకలవేదవేదాంగపారంగతుడై, సకలశాస్త్ర విశారదుడై సకలధర్మకోవిదుడై నాయనన్యభక్తుడై నీపూర్వ కులను, రాజోపువంశమువారల నుద్ధరించుటయేగాక, సమస్త మానవసమాజమును భవసాగరమును దరింపజేయును. నా భక్తిని, నాశక్తిని జగమునం దంతట ప్రచారమొనరించి నా వలెనే భక్తులచే పూజింపబడును. తిమ్మన్నభట్టారకా! ఈభాగ వతోత్తముని పుత్రునిగ బడసిన నీకు భవబంధములు దొలగి పోవును. గోలోకప్రాప్తియగును. కావున నిశ్చింతుడ వై స్వస్థ లమునకు పొమ్ము" స్వామి యిట్లనుగ్రహించి అంతర్ధాన మయ్యెను. ఇంతలో తిమ్మన్నభట్టు నిద్ర మేల్కాంచి స్వప్న ములో నాజగన్నాథుడే తన్ననుగ్రహించె ననిగ్రహించి పరమా నందభరితుడై స్వప్నవృత్తాంత మంతయు తనయర్ధాంగి యగు గోపమ్మకు వివరింపగా ఆసాధ్వి ఆశ్రితజనమందారు డైన వేంక టేశ్వరస్వామి ననేకవిధముల స్తుతించెను.

ఆదంపతు లిర్వురు శ్రీనివాసు ననేకవిధముల పూజించి, అనేక సాష్టాంగదండప్రణామము లర్పించి భువనగిరికి మరలి వచ్చిరి జగన్నాథునియనుగ్రహానుసారముగ గోపమ్మగర్భమును ధరించి నవమాసములు నిండగనె శాలివాహనశకము 1518, మన్మథనామ సంవత్సరము ఫాల్గుణ శుద్ధ సప్తమి గురువారమున (1598 A D) ఒకదివ్యశిశువును బ్రసవించినది ఆబాలుని యవయవములనుండిబయల్వెడలిన తేజము ఆగృహము నంతటిని నింపివైచెను ఆముహూర్తమున గ్రహము లన్నియు బ్రసన్నముగ నుండెను సూర్యోదయకాలమున చల్లనిపిల్లగాలులు వీచుచుండగ దేవతలు కుసుమములను వర్షించుచున్నారా యనునటుల వర్షము ప్రారంభమయ్యెను ఆముహూర్తమున నదులు ప్రసన్నములైయుండెను సముద్రము శాంతముగ నుండెను శంఖకర్ణుడే పీడితమానవాళికి హరిభక్తి నొసంగుటకు, హరిసేవలను బ్రదర్శించుటకు మూలరాముని తనివిదీర ఆరాధించుటకు దివినుండి భువికి దిగివచ్చెను సూర్యకాంతితో ప్రకాశించుచున్న తనకుమారుని ముఖారవిందమును గాంచి తిమ్మన్నభట్టారకుడు పరమానందభరితుడై హరినామసంకీర్తన మొనరించుచు నృత్యమొనరించెను శ్రీవేంకటేశ్వరస్వామికరుణవలన గల్గిన తనపుత్రునకు తిమ్మన్నభట్టారకుడు వేంకటేశ్వరు (వేంకటనాథు) డని నామకరణమొనరించెను హరినామసంకీర్తన మొనరింపనిదే యాశిశువు కన్నెత్తి యైనను చూడడు శ్రీహరి దివ్యచరితమును వర్ణింపనిదే పాలుత్రాగడు రామచంద్ర

మూర్తిని సరసన యుంచనిదే నిదురబోడు. ఈభాగవతశిశువు కారణముగ తిమ్మన్నభట్టారకునిగృహము అహర్నిశములు శ్రీహరినామసంకీర్తనతో ప్రతిధ్వనింపసాగెను. ఆబాలుడు ఉదయాద్రిపై నుదయించుసూర్యునివలె దినదినప్రవర్ధమానుడై పెరుగ నారంభించెను.

ఇట్లుకొంతకాలము గతింపగా విద్యాభ్యాసమునకై గురుకులమునకు వెడలినగురురాజు విద్యాభ్యాసమును ముగించుకొని యౌవనవంతుడై గృహమునకు మఱలివచ్చెను. తిమ్మన్నభట్టు గురురాజునకు ఒకశీలవతితో వివాహమొనరించెను. తదనంతరము తిమ్మన్నభట్టు తనకనిష్ఠకుమారుడైన వేంకటేశ్వరుని జ్యేష్ఠపుత్రునిసంరక్షణలో నుంచి అర్ధాంగి యగుగోపమ్మతో గలసి భౌతికదేహమును విసర్జించి దివ్యవిమానారూఢుడై గోలోకమును జేరెను.

గురురాజు పిన్నవయసులోనే సంసారభారమును వహింపవలసివచ్చెను. గృహములో నెట్టిసంపద లేదు, గురురాజునకు సంపాదన కెట్టిమార్గమును గానరాలేదు. తనభార్య, తనతమ్మునితో ఆయనకుడు దారిద్ర్య మనుభవింపవలసివచ్చెను. తన ప్రియసోదరుని విద్యాభ్యాసార్థమై తనబావగారైన శ్రీలక్ష్మీనృసింహాచార్యులకడకు పంపెను. శ్రీలక్ష్మీనృసింహాచార్యులు బ్రహ్మతేజముతో ప్రకాశించుచున్న వేంకటేశ్వరుని గాంచి పరమానందభరితుడై వానిని దోడ్కొని మధురకు వెడలిపోయెను.

# విద్యాభ్యాసము

తిమ్మణ్ణభట్టారకుడే శ్రీవేంకటేశునకు ఉపనయన మొనరించి కన్నడభాషలో ప్రాథమికవిద్యను గఱపెను వేంకటేశునికైదవసంవత్సరమువయస్సులోనే భట్టారకుడు గోలోకమునకు నెడలెను లక్ష్మీనృసింహాచార్యులు బాలవేంకటేశుని వెంటనిడుకొని మధురకు జేరెను తనచిన్నారిసోదరుని గాంచి వెంకమాంబ యెంతయో సంతోషించి వేంకటేశుని తనపుత్రుల కన్న మిన్నగ ప్రేమతో పోషింపనారంభించెను లక్ష్మీనృసింహాచారులే స్వయముగ వేంకటేశునకు గురువై సంస్కృత భాషలో జ్ఞానమొసంగెను ఆబాలుడు మహామేధావి, ఏక సంథాగ్రహి కావున కొలదికాలములోనే వ్యాకరణము, కావ్యము, మిమాంస, తర్కము, అర్థశాస్త్రము మొదలగు శాస్త్రములలో విద్వాంసుడయ్యెను చిన్ననాటినుండి వేంకటేశుడు సాంసారికవిషయములందు శ్రద్ధవహింపక ఎల్లప్పుడు హరి నామస్మరణమునందే నిమగ్నుడై యుండెడివాడు ఈబాలునివైరాగ్యభావమును గాంచి లక్ష్మీనృసింహాచార్యులు, గోపమ్మ పరమాశ్చర్య చకితులైరి బాలుడు సామాన్యుడు కాడని ఆజన్మవైష్ణవుడు అసమాన భావసంపన్నుడని బావగారు గ్రహించి తాను నేర్చినవిద్య లన్నింటిని వెంకన్నకు (వేంకటేశునకు) నేర్పి తృప్తినొందక తనబావమరదికి మధ్వాచా సిద్ధాంతమైన ద్వైతమతములో, శ్రీన్యాయసుధలో ఉన్నత విద్యాభ్యాసమొనరింపవలెననిసంకల్పించెను

ఆకాలములోనే కుంభకోణ మనునగరమున సుధీంద్ర తీర్థు లనువైష్ణవయతివర్యులు పీఠాధిపతిగ నుండిరి ఈయతిరాజ వర్యుడు పరమవిష్ణుభక్తుడు ద్వైతసిద్ధాంతములో శ్రీమన్న్యాయ సుధయందు మధ్వాచార్యులవారి సమస్త గ్రంధములలోను మహావిద్వాంసుడు ఈభాగవతోత్తముడు శ్రీమదానందతీర్థుల వారికి వారసునిగ వైష్ణవపీఠము నధిష్ఠించెను లక్ష్మీనృసింహా చార్యులు వెంకన్నాచార్యుని యన్నయు తనకు బావమర దియు నైన శ్రీగురురాజాచార్యుని సంప్రదించి ఉన్నత విద్యా భ్యాసార్థమై శ్రీవెంకన్నాచార్యుని కుంభకోణములో నున్న సుధీంద్రతీర్థులచెంతకు తోడ్కొనివెళ్ళెను

విద్యార్థిగా తనచరణముల నాశ్రయించిన బాలకునిదివ్య తేజోమయమైనముఖారవిందమును గాంచి ఈబాలుడు కారణ జన్ముడని, శ్రీహరిభక్తి ప్రచారకుడు కాగల డని శ్రీమూలరాముని ఆరాధించి దివ్యలోకములకు వెడలగలవా డని శ్రీ సుధీంద్రతీర్థుల వారు గ్రహించిరి తనకు దెలసినవిద్య నంతటిని బాలునకు బోధించెద ననితీర్థులవారు లక్ష్మీనృసింహాచార్యునకు బాస జేసెను లక్ష్మీనృసింహాచార్యులు పరమానందభరితుడై బాలవెంకటేశుని ఆశ్రమమందు వీడి స్వామియనుజ్ఞ గైకొని మధురకు వెడలిపోయెను

నేటి విద్యాభ్యాసమునకు నాటి విద్యాభ్యాసమునకు నెంతయో భేదము గలదు ఆకాలములో విద్యనభ్య సించెడు

వారు సద్గురువు నాశ్రయించి ఆయన గృహములోనే నివసిం చుచు, గురువొసంగినదే ప్రసాదముగ భుజించుచు గురుసేవ నొనరించుచు విద్యనభ్యసించెడివారు కావున ఆశ్రమములో అనేకులగు బాలకులు విద్యార్థులై యుండిరి వారిలో పెక్కండ్రు సంపన్నవర్గములకు జెందినవారు, మిగిలినవారు మధ్యవర్గీయులు వారిలో వేంకటేశుడే అధికముగ కడుపేదవాడు, కాని భక్తి జ్ఞానవైరాగ్యములలో, విద్యాధనములలో మహాధనవంతుడు ఈబాలకునియసాధారణప్రజ్ఞకు సుధీంద్రతీర్థులవారు అత్యంత ముగ్ధులై వానిని తనముఖ్యశిష్యునిగ చేసికొని ఆదరింపనారం భించిరి తోటిబాలకు లందఱు ఆటపాటలందు కాలమును వ్యర్థపుచ్చుచున్నను మనవేంకటేశుడుమాత్రము సదా శ్రీహరి పాదారవిందమకరందపానమత్తుడై నెవరితో బలుకక ఎవరితో మాటాడక మౌనముగ నుండెడివాడు శ్రీవేంకటేశుని తత్త్వ మును అవగతమొనరించుకొనినవాడై శ్రీతీర్థులవారు విద్యా దానమున ఆబాలునిపై ప్రత్యేకశ్రద్ధచూపెడివారు కాని నాడు కూడ గొప్ప పేద యనెడు తారతమ్యములు కలవు కావున తోటివిద్యార్థులు పేదవాడైనవేంకటేశుని ద్వేషించి తమనుండి దూరముగ నుంచెడివారు ప్రతివిషయములోను వేంకటేశుని ఆదరింపక అవమానించెడివారు రాత్రిసమయములలోగూడ విద్యార్థులందఱు ఒకేప్రదేశములో పరుండగ వేంకటేశుడు మాత్రము వారినుండి దూరముగ కప్పులేని ఒకపాడుబడిన

మండపములో నొంటరిగ విశ్రమించెడివాడు. కాని వేంకటేశున కిది వరముగ మారిపోయెను. తోటిబాలకు లందఱు రాత్రి నిదురించుచుండగ వెంకటేశుడుమాత్రము మేల్కాని దీపపు ప్రమిద వెలుగులోనే, నాటి పాఠముల కానాడె వ్యాఖ్యానము రచించి పిమ్మట విశ్రమించెడివాడు. ఆపేదబాలకుడు పైన కప్పుకొనుటకు చినిగినఅంగవస్త్రమైనను లేక ఆరుబయటచలిలో విశ్రమించెడివాడు.

తోటివిద్యార్థు లందఱు వేంకటేశునిపై లేనిపోనియభాండములను కల్పించి గురుదేవునితో జెప్పెడివారు. వెంకటేశుని నైజము అవగతమొనరించుకొనిన తీర్థులవారు వారి కొండెము లను సరకుగొనక తనప్రియశిష్యుని యెంతగనో ఆదరించెడివారు. ఎన్నికష్టము లనుభవించుచున్నను శ్రీహరిపాదాశ్రితుడైన శ్రీ వెంకటేశుడు కష్టసుఖములందు, ద్వేషాభిమానములందు సమ భావము గల్గి శ్రీహరిపవిత్రనామములను జపించుచు తన విద్యా భ్యాసమును కొనసాగించెను. ఇట్లు కొంతకాలము గడచెను.

ఒకదినమున సుధేంద్రతీర్థులవారు శ్రీన్యాయసుధను పాఠ్యాంశముగ స్వీకరించి ప్రతిదినము బోధింపనారంభించిరి. ఈకఠిన మైన శాస్త్రమును బోధించుటకు స్వాములవారు ప్రత్యేకశ్రద్ధవహించిరి. ఇట్లు కొంతకాలము గతింపగ ఒకదిన మున స్వాములవారు న్యాయసుధలోని ఒకభాగమును బోధించుచు దానికి సరియైన వ్యాఖ్యానము స్ఫురింపక మఱు

దినమున చెప్పెద నని నాటి ప్రవచనమును విరమించిరి ఆ రాత్రియే శ్రీస్వాములవారు తనవిద్యా ర్థులను పరీక్షించుటకు ఆశ్రమములో తిరుగనారంభించిరి ఒ క్కవ్యాడు దీపమును బట్టుకొని స్వాములవారికి మార్గము జూపుచుండెను తీర్థులవారు విద్యార్థులందఱు విశ్రమించు ప్రదేశమున కేతెంచి చూడగా శ్రీ వేంకటేశుడుదప్ప అన్యవిద్యార్థు లందఱు గాఢనిద్రావశు లై యుండిరి అపుడు స్వాములవారు వేంకటేశునికొఱకై ఆశ్రమ ప్రాంగణములో అన్వేషింపనారంభించిరి ఆ ప్రదేశమునకు కొలదిదూరములో ఒకపాడుబడిన కప్పలేనిమంటపములో ఆరు బయట చలిలో నిద్రింపుచున్న వేంకటేశుని స్వాములవారు గాంచి ఆశ్చర్యచకితులైరి వేంకటేశునిశిరము చెంత నుండిన వ్రాతప్రతిని గాంచి దానిని గైకొని దీపపువెలుగులో స్వాముల వారు బరీక్షించిరి ఆపుస్తకములో కొన్నికొన్నిపుట చదువుచు ఆగ్రంథము తాను ప్రతిదినము బోధించెడి న్యాయసుధకు వ్యాఖ్యానమే యనితెలిసికొని చివరిపుటలో తాను ఏవిషయ మునకు వ్యాఖ్యాన మొనరింపలేక మఱుదినము జెప్పెద నని బల్కెనో ఆవిషయమునకు బంపూర్ణవ్యాఖ్యానము సర్వాంగ సుందరముగ వేంకటేశునిచే లిఖింపబడియుండెను ఆవ్యాఖ్యాన మును పరికించి స్వాములవారు పరమానందభరితులై కనుల నుండి ఆనందబాష్పముల స్రవింపజేసి అంతటిప్రతిభా సంపన్నుడు తనకు శిష్యుడైనాడని స్వాములవారు ఆనందబాష్ప

ములను వర్ణించుచు తనశిష్యునకు జరుగుచున్న అన్యాయమును గాంచి చింతాక్రాంతులైరి తత్ క్షణమే సుధీంద్ర ర్థులవారు తాను ధరించిన పట్టుశాలువను వేంకటేశునిపై గప్పి వేంకటేశునిచే రచింపబడిన ఆవ్యాఖ్యానగ్రంధమును తీసికొని ఆశ్రమములోనికి జనిరి

మఱునాటి ప్రాతఃకాలమున కు పారప్రవచనము నారంభించుటకు శిష్యులతో సహా ఆసీనులై వేంకటేశుని కొఱకై నిరీక్షింపసాగిరి

## శ్రీ ప రి మ ళా చా ర్యు లు

గతరాత్రి చాలసేపు స్వాములవారు బోధించిన న్యాయసుధలోని విషయమునకు వ్యాఖ్యానము రచించి వేంకటేశుడు ఆల ముగ నిదురించెను బాలార్కుని అరుణకిరణములు సోకగ నే మేల్కాంచి వేంకటేశుడు తనపై కప్పబడియున్న దుశ్శాలువను గాంచి అది గురుదేవుల దనిగ్రహించి భయభీతు

డమ్యేను ఎవరో తనతోటివిద్యార్థులు తనను కించపఱచి ఆశ్రమమునుండి వెడలగొట్టుట కిట్టిపన్నాగము పన్నినారని భావించెను తానెంతో కష్టించి వ్రాసిన వ్యాఖ్యానగ్రంథ మును గానక అదిగూడ అల్లరివిద్యార్థులు సంగ్రహించి రని చింతించెను కాలకృత్యములను నిర్వర్తింపకయే వేంకటేశుడు గురుదేవుల శాలువను దీసికొని రయమున బోధనాగృహ మును జేరి దుఃఖించుచు స్వాములవారిపాదములచెంత మోకరిల్లి "గురుదేవా! నే నెట్టిదోషము నెఱుగను తమశాలువను నేను సంగ్రహింపలేదు ఎవరో గిట్టని తోటివిద్యార్థులు తమ శాలువను దెచ్చి నాపై గప్పి నన్నపరాధిగ నొనరించుటకు బ్రయత్నించిరి స్వామీ! నేను నిరపరాధిని ఈమోసము నొనరించిన వ్యక్తియే నాహస్తలిఖిత గ్రంథమునుగూడ సంగ్రహించెనని" బల్కెను

ఇట్లు విన్నపము లొనరించి దుఃఖితుడై తనయెదుట వోసిలియొగ్గి నిలువబడియున్న ప్రియశిష్యుని గాంచి సుధీంద్ర తీర్థులు ప్రసన్నవదనముతో, "వత్సా! నీవు నిరపరాధి వని నాకు దెలియును ఆదుశ్శాలువ నిట నుంచి నీప్రాతఃకాలవిధు లను నిర్వర్తించుకొని మఱలిరమ్ము నీగ్రంథము నెవ్వరును తస్కరించలేదు అది నాచెంతనేయున్న" దనిబల్కెను గురు దేవుని యనుగ్రహవాక్కుల నాలకించి వేంకటేశుడు దుఃఖ మును వీడి పరమానందభరితుడై వెడలి క్షణములో కాల

కృత్యములను నిర్వర్తించుకొని బోధనాగృహమునకు మఱలి వచ్చెను. గురుదేవుడు తాను గడచినదినమున వ్యాఖ్యానమొనరింపలేక వదలిపెట్టిన న్యాయసుధలోని విషయమునకే వ్యాఖ్యానమును బోధింపనారంభించిరి. వేంకటేశుడు రచించిన గ్రంథమును జదువుచు ఆవ్యాఖ్యానమును సాంగోపాంగముగ విద్యార్థులకు బోధించి ఈమహావ్యాఖ్యానమును రచించిన ఆదర్శవిద్యార్థి ని దర్శింపు డని వేంకటేశుని జూపిరి. విద్యార్థులారా! సర్వజ్ఞునివలె వేంకటేశుడు న్యాయసుధకు చేసిన సమగ్రవ్యాఖ్యానము పుష్పమునకుబరిమళ మబ్బినట్లుండెను. ఈ వ్యాఖ్యాన మత్యంతమధురాతిమధురము,పరమసత్యము. న్యాయసుధకు పరిపూర్ణముగ వ్యాఖ్యానము రచింపవలె నని నాయీ ప్రియశిష్యుని ఆజ్ఞాపించుచున్నాను. వీని యీగ్రంథమునకు 'పరిమళ'మని నామకరణమొనరించుచున్నాను. వేంకటేశునకు పరిమళాచార్యు డనుబిరుదు నొసంగుచున్నా నని సుధీంద్రతీర్థులు ఆనందబాష్పపూరితనయనములతో విద్యార్థి సభామధ్యమున బ్రకటించిరి. ఇట్లు బల్కి తాను ధరించుపట్టుశాలువను గప్పి పరిమళాచార్యులవారిని పరమానందముతో ఘనముగ సన్మానించెను.

తోటి విద్యార్థులు వేంకటేశుడు సామాన్యుడుగా దని తెలిసికొని తా మొనరించిన అపరాధములను క్షమింపు మని మిత్రుని పాదములపై బడిరి. దూషణ భూషణతిరస్కారములను

సమముగ భావించు పరమభాగవతాగ్రగణ్యుడైన శ్రీవేంకటేశుడు మనస్ఫూర్తిగ విద్యార్థులను క్షమించి ఆదరించెను

సుధీంద్రతీర్థులవారు తనకు దెలిసినసకలవిద్యలను అత్యంత శ్రద్ధతో వేంకటేశునకు బోధించి ద్వైతసిద్ధాంతములో అప్రమానప్రజ్ఞావంతునిగ తీర్చిదిద్దెను

శ్రీపరిమళాచార్యులు యౌవనులై తనవిద్యాభ్యాసమును ముగించుకొని గురుదేవుని యాశీర్వాదములను పొంది తోటి విద్యార్థులనుండి యనేక బహుమతులను బొంది తనయగ్రజుడైన గురురాజాచార్యుని చెంతకు భువనగిరికి చేరెను గురురాజాచార్యులు మహదానందభరితులై తనసోదరునకు స్వాగతము బల్కెను వేంకటేశుడు వెంకన్నాచార్యునిగ తనసోదరునిచెంత వీణావాదనము నభ్యసించి కొలదికాలములోనే మహావిద్వాంసుడయ్యెను యౌవనుడైన తనసోదరునకు శీలవతి సౌందర్యవతి, గుణవతి, సౌభాగ్యవతి యైన సరస్వతీదేవి యను కన్యతో గురు   ్యలు వివాహమొనరించెను

1616వ సంవత్సరములో (శాలివాహన శకము 1537 ఆనందనామ సంవత్సరము) వేంకటేశుని వివాహము సరస్వతీదేవితో అత్యంతవైభవముగ జరిగెను ఇట్లు వెంకన్నాచార్యులు బ్రహ్మచర్యాశ్రమము విసర్జించి గృహస్థాశ్రమమును స్వీకరించి కొంతకాలము సద్గుణవతి యైనభార్యతో గలసి హరిసేవలొనరించుచు రామసంకీర్తన మొనరించుచు సుఖించెను

# శ్రీ అగ్ని సూక్తము

వెంకన్నాచార్యులు కేవలము అగ్రజునియాజ్ఞాపరిపాల నార్థమై గృహస్థాశ్రమమును స్వీకరించి అన్నగారివద్దనె నివసించుచుండెను. వెంకన్నాచార్యులు సకలభూతములం దెట్టి ద్వేషము లేనివాడు. స్నేహము, దయ సమముగ గల్గిన మహాత్ముడు. నేను నాది యనెడి యహంకారము లేనివాడు, సుఖదుఃఖములం దేకభావము గల్గివర్తించువాడు, సహనశీలి, సదా సంతృప్తియుక్తుడు. శ్రీహరిచరణారాధన మనెడుమహాయోగ సమన్వితుడు. మనస్సునె జయించినమహామనీషి, దృఢచిత్తుడు. సర్వము శ్రీరామార్పణముగా భావించు పరమభాగవతోత్తముడు. ఎవనివలన భూతములు భయము నొందవో, ఎవడు లోకమునకు భీతినొందడో, ఎవడు సంతోషము క్రోధము భయము, మనోవ్యాకులత్వము మొదలగుదౌర్బల్యములను కల్గియుండడో, ఆతడే శ్రీవెంకన్నాచార్యులు. ఈపరమభాగవతోత్తమునకు కోరికలేలేవు. ఈయన బాహ్యాభ్యంతరపరిశుద్ధుడు, సకల కార్యసమర్థుడు, దుఃఖమునె యెఱుగని ధీశాలి, సర్వధర్మములను శ్రీరామార్పణముగ బరిత్యజించి శ్రీసీతారామపదసరోజముల నాశ్రయించిన చరితార్థుడు. శత్రువునందు, మిత్రునియందు, మానావమానములందు, శీతోష్ణసుఖదుఃఖములందు తటస్థుడై చలింపనిమహామేరువు. దేనియందును ఆశలేనివాడు. నిందాస్తుతులను సమముగ గఱపెడివాడు. లభించినదానినె మహా

సౌభాగ్యముగ నెంచి తృప్తినొందువాడు సాంసారికవిషయము లందు విరాగి ధనము నపేక్షింపనిమహాజ్ఞాని, సదా తృణము వలె వినీతుడై మెలగువాడు, తరువువలె సహిష్ణుతగల్గినవాడు, మానసీయులు కానివారల నైనను ఆదరింపగల సద్బ్రాహ్మణుడు, సదా శ్రీహరినామసంకీర్తనపానమత్తుడు ఏ ప్రదేశము లలో శ్రీహరిభక్తులుసమావిష్టులై శ్రీరామనామసంకీర్తన మొన రింతురో ఆప్రదేశమందె సకలజగన్నాథుడు, సర్వాత్ముడు, సచ్చిదానందవిగ్రహుడునైన శ్రీహరి సకలపరివారముతో విరాజిల్లును

ఇట్టి దివ్యగుణ సంపన్నుడైన శ్రీవెంకన్నాచార్యులు కుటుంబసంరక్షణభారము నంతటిని తనసోదరునిభుజస్కంధము లపై నుంచి సతతము శ్రీహరికైంకర్యమగ్నుడయ్యెను శ్రీగురు రాజుకూడ సోదరు నేమనజాలక కుటుంబభారము నంతయు తానే వహించి కష్టములపాలగుచుండెను ఈవిషయమును తెలిసికొనిన శ్రీవెంకన్నాచార్యులు తనకుటుంబభారమును తానే వహించెద నని అగ్రజు నొప్పించి వేరుగ ఈభవసాగర ములో తనజీవితనౌకాసారథ్యము వహించెను వారికుటుంబ మెన్నియోయిడుముల ననుభవింపవలసివచ్చెను కాలక్రమమున శ్రీసరస్వతీదేవి గర్భము దాల్చి ఒకకుమారుని ప్రసవించెను సాంసారికవిషయములందు నిర్లిప్తుడైన శ్రీవెంకన్నాచార్యులు తనశిశువునకు క్షీరములనుకూడ సమకూర్చలేకపోయెను సువర్ణ మైనను అగ్నితప్తముకానిదె సమ్మెటప్రేటుల నొందనిదె తన

కాంతులను వెదజల్లు చేదు కావున శ్రీ వెంకన్నాచార్యులు పరమభాగవతోత్తము లైనను సాంసారికకష్టము లాయనను దప్పవేను వారి గ్రామమునకు చేరువలో గల ఒక జమీందారు గృహములో మహాయజ్ఞ మొనరింపవలె నని నిరతము సమారాధనల నొనరింపవలె నని బుత్విక్కులు సంకల్పించిరి ఆజమీందారుకూడ అందులకు నంగీకరించి తనజమీందారీలో గల సకల గ్రామములలో యజ్ఞసమారాధనావిషయమై చాటింపు వేయించెను

దినములపర్యంతము వస్తుల నుండలేక పసిబాలుని ఆక్రందనల నాలకింపలేక శ్రీసరస్వతీదేవి యజ్ఞసమారాధనకు బయలుదేరి కొంతకాల మైనను జమీందారుగృహమం దుండి పసిబాలుని రక్షించుకొనవలయు నని పతిదేవు నర్థించెను సుఖదుఃఖములం దెట్టిభేదభావమును లేని శ్రీ వెంకన్నాచార్యులు యజ్ఞశాలకు దారాపుత్రుల గొనికొని బయలుదేరెను ఆ సంపన్నుని గృహములో నిరంతరము హోమము, పూజారాధనలు జరుగుచుండెను ఆ శ్రీమంతుని పురోహితుడు యజ్ఞకార్యములను నిర్వర్తించుచుండెను ఆయజ్ఞశాలలో ఒకప్రక్కగా భార్యాపుత్రులతో ఆసీను లై యున్నవాడు, ఆజానుబాహుడు, బలిష్ఠు డైన శ్రీ వెంకన్నాచార్యునిగాంచి పురోహితుడు "ఓయీ, బ్రాహ్మణుడా ! ఎందులకు కాలమును వ్యర్థముచేయుచున్నావు నీవు యజ్ఞకార్యములను నిర్వర్తించుటకుగాక కేవలము భోజనముకొఱకే వచ్చితివా? లెమ్ము శీఘ్రముగ రమ్ము

ఈచందనకాష్ఠమును గైకొని గంధమును దీయుమని తిరస్కార ముగ బల్కెను పురోహితుని పరుషవాక్యములను ఆలకించినను గృహస్థు శ్రీవెంకన్నాచార్యుని సామాన్య బ్రాహ్మణునిగ భావించి వారింపరేదు శ్రీవెంకన్నాచార్యులుమాత్రము కోపింపక ప్రశాంతచిత్తముతో చందనమును దీయు కార్యమందు సంసిద్ధమయ్యెను భర్త మనోగత భావములను గ్రహింపగల సాధ్వీలలామ శ్రీసరస్వతీదేవికూడ పరుషవాక్యముల నాలకించి మిన్నకుండెను

భాగవతాపచారమును దేవతలు సహింతురా? భక్తుడు సహించుగాక! సకలజగములకు సాక్షులైనపంచభూతములు భాగవతాపరాధమును మన్నింపవు శ్రీహరి పరమభక్తునకు జరిగిన యవమానమును జూచి భూసురులకు ప్రత్యక్షదైవము సకలసాక్షి యైనశ్రీయగ్నిభట్టారకుడు మహాక్రోధసమన్వితుడై ఆకాశమునంటి ప్రజ్వరిల్ల నారంభించెను ఈ మహాత్పరిణామమునకు ఋత్విక్కులతోపాటు ఆహూతులైన సకలజనులు భయసంభ్రమములచే కంపించిపోయిరి ఈమహోత్పాతమును గాంచి శ్రీవెంకన్నాచార్యులు సర్వమును గ్రహించినవారై శ్రీ అగ్నిదేవుని శాంతింపజేయుటకు తనలోతాను అగ్నిసూక్తమును పఠించెను భక్తాగ్రేసరుని ప్రార్థనల నాలకించి అనిలుడు తన విశ్వరూపమును విసర్జించి సూక్ష్మాకారుడై భాగవతాపరాధులను మన్నింపజాలక శిక్షించుటకు శ్రీవెంకన్నాచార్యులు దీయు

చున్న చందనమున బ్రవేశించెను  అగ్ని శాంతింపగనె యిది కేవలము కాకతాళీయ మనిభావించి ఋత్విక్కులు యజమాని యథార్థమును గ్రహింపలేనివారై మిన్నకుండిరి  సాయంసమయమువరకు శ్రీవెంకన్నాచార్యులు తనకొసంగిన చందనకాష్ఠము నంతయు అరగదీసి చందనముగ మార్చివేసెను  కాని ఆచందనములో అణువణువందు శ్రీఅగ్నిదేవుడు ప్రవేశించి యుండెను

భానుడు ప్రపంచమును అంధకారమున ముంచివేసి అస్తమింపగనె పురోహితుడు శ్రీవెంకన్నాచార్యులచే దీయబడిన చందనమును మంత్రాక్షతలను తాను ధరించి తోటిఋత్విక్కుల కొసంగి యజమానికి సమర్పించెను  వారందఱు చందనమును ధరింపగనే ఒడలంతయు అగ్నిమయమై భగ్గున మండనారంభించెను  భాగవతాపచారమును గాంచి మిన్నకుండిన యజమాని, పురోహితులు అందఱు అగ్నిదేవుని యాగ్రహామునకు గుఱియైరి  ఈవైపరీత్యమునకు యజమాని అత్యంత దుఃఖితుడై అగ్నిబాధను భరింపలేకచందనమును బంచిన ముఖ్య పురోహితుని నిందింప నారంభించెను  అగ్నిక్రోధపీడితులై విలపించుచున్న ఈయభాగ్యులను గాంచి యజ్ఞమంటపమునందు సమావేశమైనసకలజనుల హాహాకారముల నొనరింపనారంభించిరి  శ్రీహరిధ్యానమగ్నుడైన శ్రీవెంకన్నాచార్యుడు మాత్రము బాహ్యప్రపంచమును మరచి ఆత్మసాక్షాత్కారమున నుండెను  మంటలకు తాళలేక విలపించు పురోహితులు తాము

ప్రాత కాలమున ఒక ఆజానుబాహు డైనబ్రాహ్మణోత్తముని నిందించితిమని జ్ఞప్తికి దెచ్చుకొని తా మొనరించినభాగవతాప చారమున కత్యంతపశ్చాత్తపు లై జరిగిన దంతయు కోటివారికి విన్నవించి ఈక్లేశముల కామహానుభావుని తిరస్కరించుటయే కారణమని గ్రహించిరి యజమానితో సహా బ్రాహ్మణు లందఱు ధా మగ్ను లై యున్న శ్రీ వెంకన్నాచార్యుని పాదముల నా ంచిరి తన పాదములను దాకిన అశ్రు ధారలకు శ్రీవెంకన్నాచార్యులు బాహ్యస్మృతిని బొంది జరిగిన దంతయు తటిలో గ్రహించి అగ్ని దేవుని శాంతింపజేయుటకు శ్రీహరిని, అగ్ని దేవుని, శ్రీవరుణదేవుని ప్రార్థించెను ఆచా ర్యులు వరుణసూక్తమును సమాప్త మొనరింపగనే అగ్ని దేవుడు చందనమును వీడి అగ్నిగుండమున ప్రవేశించెను బ్రాహ్మ ణులు యజమానితో పాటు బాధావిముక్తు లై శీతలత్వమును బొంది పరమానందభరితు లై శ్రీ వెంకన్నాచార్యునిపాదములపై బడి "భక్త శిఖామణీ! కరుణింపు" మని ప్రార్థించిరి యజమాని తా నొనరించిన భాగవతాపచారమున కత్యంత దు ఖితు డై శ్రీ ఆచార్యులవారి ననేకవిధముల క్షమాపణల నర్థించి యెన్నియో బహుమానములతో, ధనములతో సత్కరించెను కోపమే యెఱుగని శ్రీవెంకన్నాచార్యులు వారి నందఱని క్షమించి ఆదరించెను యజ్ఞముసంపూర్ణమగువఱకు యజమాని శ్రీ వెంక న్నాచార్యుని, శ్రీసరస్వతీదేవిని, వారికుమారుని అపర దేవతలుగ భావించి గౌరవించెను

యజ్ఞము పరిసమాప్తి కాగా పూర్ణాహుతిదినమున వెంకన్నాచార్యులు యజమానిచే ననేకసత్కారముల బొంది ఆగ్రామమును విడి స్వస్థలమును జేరెను ఎంతటివారైనను భగవద్భక్తులను హింసించిన భగవంతుడేకాదు, తుదకు దేవతలుకూడ ఆగ్రహించెద రనుటకు శ్రీవెంకన్నాచార్యుని చరిత్రములో సంభవించిన ఈయద్భుత సంఘటనమే భావితరముల వారికి తార్కాణము

## శ్రీ మహాభాష్యాచార్యులు

భగవంతుని దివ్యచరణారవిందముల నాశ్రయించిన భక్తులకు సుఖదుఃఖములు సమానములు అగ్నితప్తము జేసి సమ్మెటపోటులు బడనిదే సువర్ణముకాంతి బహిర్గతముకాదు, అట్లే కష్టములలోనే మహాపురుషులు తమ మహాత్మ్యములను ప్రకటించెదరు శ్రీవెంకన్నాచార్యులు జమీందారుచే అనేక విధముల సత్కరింపబడి సతీపుత్రసమేతముగ స్వస్థలము జేరిరి నిష్కామభక్తుడు కావున శ్రీఆచార్యులు యథావిధిగ ప్రాపంచిక

విషయములందు నిర్లిప్తులై అహర్నిశములు శ్రీహరికైంకర్య మున నిమగ్నులయ్యెను. దారిద్ర్యము ఆచార్యునిగృహము నావరించెను. జితేంద్రియులైన యీదంపతులు మాత్రము ఆకలిదప్పులను సహితము లెక్కింపక వారములపర్యంతము శ్రీకృష్ణధ్యానములోనె కాలముగడుపుచుండిరి. కాని వారి కుమారుడు ఈదారిద్ర్యమును తాళలేక పరితపింప సాగెను. కుమారునియాక్రందనముల నాలకించి శ్రీవెంకన్నాచార్యులు చింతామగ్నులై ఉదరపోషణార్థము ఏకార్యము నైనను ఒనరింప సంసిద్ధులయ్యెను. కాని ఆగ్రామములో సంపాదన కెట్టియవకాశములు లేకపోయెను. తన భార్యాబిడ్డ లెట్టి క్లేశములు లేక జీవింపవలె నన్న శ్రీసుధీంద్రతీర్థులయాశ్రమము సరియైనప్రదేశ మనినిర్ణయించుకొని శ్రీవెంకన్నాచార్యులు దారాపుత్రసహితముగ గురుదేవులయాశ్రమమును చేరెను. తనప్రియశిష్యుని గాంచి శ్రీతీర్థులవారు పరమానందభరితులై శ్రీవెంకన్నాచార్యుని శ్రీమతి సరస్వతీదేవిని ఆదరముగ ఆహ్వానించి చిరంజీవిని ఆశీర్వదించెను, ఈ మఠములోనె కుటుంబసహితముగ నివసింపవలసినదిగను శ్రీవెంకన్నాచార్యు నాదేశించిరి.

గురుదేవు నాజ్ఞానుసారముగ శ్రీవెంకన్నాచార్యులు ఆశ్రమావరణములో ఒకపర్ణశాలను నిర్మించుకొని నివృత్తి మార్గసాధనయందు సంలగ్నులై శ్రీహరి నారాధించుచు

పాఠశాల నిర్వహణలో గురుదేవులకు తోడుగ నివసింపసాగెను కొన్నిదినములపిమ్మట శ్రీసుధీంద్రతీర్థులవారు తీర్థయాత్రలకు బయలుదేరిరి శ్రీస్వాములవారితో శ్రీవెంకన్నాచార్యులు, మరపరివారముకూడ బయలుదేరెను ఆకాలములో పీఠాధిపతులు ప్రయాణముచేయుచు నేగ్రామమం దైనను నగరమం దైనను మజిలీచేసిన ఆప్రాంతమున గల విద్వాంసులు పీఠాధిపతులను శాస్త్రార్థ మై ఆహ్వానించెడివారు ఓడినవారు విజయము పొందినవారికి శిష్యు లయ్యెడివారు శ్రీసుధీంద్ర తీర్థులవారు తన పరివారముతో తీర్థయాత్రలను సల్పుచు 'మన్నారుగుడి' యనునగరములో మజిలీచేసిరి ఆనగరమున వ్యాకరణములో అసమానప్రతిభావంతు డగు అద్వైతసిద్ధాంత విద్వాంసుడు కలడు ఆమహాపండితుడు శ్రీసుధీంద్రతీర్థులవారిని మహాభాష్యముపై శాస్త్రార్థమున కాహ్వానించెను శ్రీస్వాముల వారు అందుల కంగీకరించిరి

ఆనగరములోని యొక దేవాలయ ప్రాంగణమున ఈమహాపండితులశాస్త్రచర్చకు సమావేశము ఏర్పాటుచేయ బడెను వేలకొలదిగ శ్రోతలు సమావేశమునకు చేరిరి వేదికపై ఒకపార్శ్వమున శ్రీసుధీంద్రతీర్థులవారు తమపరివారముతో నలంకరించిరి వారి కభిముఖముగ నద్వైత ...డు పండితసముదాయముతో ఆసీనుడయ్యెను మహాభాష్యముపై శాస్త్రచర్చ ఆరంభమయ్యెను ఒకరివాదములను మఱియొకరు

తీక్ష్ణముగ ఖండించుచు తమవాదమే యథార్థ మని ప్రతిపాదింప నారంభించిరి ప్రప్రథమముగ శ్రీ వెంకన్నాచార్యులు తన గురుదేవునిపక్షమున వాదమును ప్రారంభించెను శ్రీఆచార్యులు తన వాదములను ఎంతో సహేతుకముగ ప్రతిపాదించి యెదుటి వారివాదములను ఆహూతులైనపండితుల సమ్మతితో ఖండించి కొన్నిగడియలలోనే ప్రతివాది యైన అద్వైతమహాపండితుని నేర్పుతో నోడించెను ఆవైయ్యాకరణి మహాభాష్యమందు ద్వైతసిద్ధాంతమే యథార్థ మని ఆమహాసభలో నంగీకరించి శ్రీసుధీంద్రతీర్థులవారికి శిష్యునిగ మారిపోయెను ఆసభలో సమావేశ మైనమహాపండితులు, ప్రజలు శ్రీవెంకన్నాచార్యుని విద్వత్తును శాస్త్రిచర్చాపటిమను వేనోళ్ళ కొనియాడిరి తన ప్రియశిష్యునకు గలిగిన ఘనాయఖండవిజయమునకు స్వాముల వారు పరమానందభరితులై శ్రీవెంకన్నాచార్యుని హృదయ పూర్వకముగ ఆశీర్వదించుచు 'మహాభాష్యాచార్య యను బిరుదు నొసంగి ఘనముగ సన్మానించెను ఈసంఘటనతో శ్రీవెంకన్నాచార్యుని ప్రతిభ ఆర్యావర్తమంతయు వ్యాపించెను పండితు లందఱు ఈమహావిద్వాంసుని విద్యాపటిమను ఘనముగ ప్రశంసించిరి

శ్రీసుధీంద్రతీర్థులు మచ్నారుగుడిలో తమవిజయపతాక మెగురవేసి సపరివారముగ తీర్థయాత్రల నొనరించుచు తంజావూరురాజ్యమును జేరిరి తంజావూరునగరములో నివసించు

చున్న యజ్ఞనారాయణదీక్షితు డను అద్వైతమహాపండితుడు "తత్త్వమసి"యనుసిద్ధాంతమును ద్వైతసిద్ధాంతపరముగ నిరూపింపవలసిన దని శ్రీస్వాములవారిని శాస్త్రార్థమున కాహ్వానించెను ఈపండితసమావేశమును తంజావూరు నగరాధీశుల సమక్షములో ఏర్పాటయ్యెను ఈ శాస్త్రిచర్చలోకూడ శ్రీవెంకన్నాచార్యులు పాల్గొని అయ్యద్వైతమత్తేభమును సింహకిశోరమువలె ఎదుర్కొనెను. అద్వైతమహాపండితుడు సామాన్యుడు కాడు అతడు శాస్త్రిచర్చలో పరాజయ మెఱుంగని సరస్వతీప్రసన్నుడు కాని శ్రీవెంకన్నాచార్యులు ద్వైతసిద్ధాంతములను ప్రతిపాదించి ఆవలిపక్షమువారిసిద్ధాంతములను పండితరంజకముగ ఖండించుటలో మేటి కొన్ని దినములు శాస్త్రిచర్చ జరిగినయనంతరము తుదకు 'తత్త్వమసి యనుసూత్రమునకు ద్వైతసిద్ధాంతప్రతిపాదక మైన అర్థమే యథార్థ మని అద్వైతమహాపండితు తన పరాజయము నంగీకరించెను నాటినుండి శ్రీమహాభాష్యాచార్యులు శ్రీసుధీంద్రతీర్థులవారి యాశ్రమమునకు వెలలేనిరత్న మయ్యెను శ్రీవెంకన్నాచార్యు లెందఱో పండితుల నోడించి ఆర్యాపథములో ద్వైతసిద్ధాంతవిజయధ్వజము నెగురవేసెను ఆచార్యుని విజయపరంపరలచే ఆశ్రమమునకు ఎన్నియో బహుమతులు ఆస్తులు సమకూరినవి తానెంతో గౌరవమును, ధనమును పొందినను శ్రీవెంకన్నాచార్యుడు గర్వముచెందక తనసర్వస్వమును ఆశ్రమమున కర్పించి విరాగి యై సతతము శ్రీహరి

ఆరాధనా సేవలందు సంలగ్న డై తామరాకుపై నీటిబొట్టు వలె తనజీవితమును గడుపుచుండెను శ్రీమతి సరస్వతీదేవి తన భర్త చేయు ఆరాధనకు సకలపరికరములను సిద్ధమొనరించుచు హరినామసంకీర్తనము నొనరించుచు పతిసేవయందు నిమగ్నురాలై యుండెను ఈదంపతుల కుమారుడుకూడ ఆజన్మవైష్ణవుడై తండ్రివలె నివృత్తిమార్గమునె అనుసరించుచుండెను

## శ్రీ విద్యాలక్ష్మి

దారాపుత్రాదులతో శ్రీ వెంకన్నాచార్యులు సుధీంద్రతీర్థులవారి యాశ్రమములో నివసించుచుండెను ఆశ్రమములోనే శ్రీ వెంకన్నాచార్యులు తనకుమారునకు ఉపనయనమహోత్సవమును శ్రీ తీర్థులవారి యాశీర్వాదములతో అత్యంతవైభవముగ నెరవేర్చెను

ఆకాలములో శ్రీ మూలరామమూర్తులు సుధీంద్రతీర్థుల యాశ్రమములో కొలువుదీరియుండెను ఆశ్రమాధిపతి నిత్యము శ్రీ మూలరామమూర్తి నారాధించుట ఆశ్రమములో పరమ ధర్మమయ్యెను కావున సుధీంద్రతీర్థులు క్రమముదప్పక నిత్యము

శ్రీ మూల రామమూర్తి నారాధించెడివారు దేని కైనను భంగము వాటిల్ల వచ్చునుగాని శ్రీ మూలరామమూర్తి యారాధనకు భంగము వాటిల్లరాదు

అనాదికాలమునుండి ఆశ్రమములో శ్రీ మూలారామారాధన మవిచ్ఛిన్నముగ జరుగుచుండెను శ్రీ వెంకన్నాచార్యులు శ్రీ మూలరాముని నిత్యము దర్శించుచు తదారాధనలో తన గురుదేవు లైన శ్రీ సుధీంద్రతీర్థులకు సహాయ మొనరించుచు సాధ్వీ మైనభార్యా మణి సాహచర్యముతో పూర్ణిమాచంద్రుని వలె దినదినాభివృద్ధి గాంచుచు, పరమభక్తునిగ వెలుగొందు చున్న తనకుమారుని గాంచుచు కొంతకాలము సుఖముల నను భవించెను దినములు గడచి, సంవత్సరములు గతించెను శ్రీ వెంకన్నాచార్యులవారి గృహస్థాశ్రమము సుధీంద్రతీర్థుల వారి యాశ్రయములో అత్యంతసౌఖ్యముగ జరిగిపోవుచుండెను కాలానుగుణముగ శ్రీ సుధీంద్రతీర్థులవారు వయోవృద్ధు లైరి పరిణామముచెందుటయె యీపాంచభౌతిక దేహముయొక్క ధర్మముగదా !జీవుడుప్రారబ్ధానుసారముగమాయకులోనై కర్మానుభవముకొఱకు దేహమును బొంది తల్లిగర్భమునందు ప్రవేశించును తదనంతరము బాల్యమును యౌవనమును బొంది వృద్ధుడై తుదకు జర్జరదేహమును త్యజించి మఱల జన్మనుబొందును ఈ జననమరణ చక్రములో జీవు లందఱు అనాదికాలమునుండి పరిభ్రమించుచుండిరి ప్రారబ్ధానుసారముగనె దేహధారికి మంచి

విషయములలో, చెడ్డవిషయములలో రాగద్వేషము లుద్భ వించును ఈరాగద్వేషము లంకురింపకుండగ నేదేహధారియైనను నివారింపలేడు ఈ యిష్టాయిష్టము లనెడి రాగములే విష్ణు మాయాశక్తులు అశాశ్వతము లైన ప్రాపంచికవిషయములపై అంకురించెడి రాగమును నిరోధించుటకు జీవునకు బరమాత్మ స్వాతంత్ర్యము నొసంగెను దివ్యలోకములనుండి పతితులై విష్ణు మాయచే ఆవరింపబడి రాగద్వేషములతో జననమరణములతో జరావ్యాధులతో అరిషడ్వర్గ ములందు జిక్కి బరితపించు జీవులను కేవలము అసంగత్వము, హరియందనన్యభక్తి, శ్రీకృష్ణనామ సంకీర్తనము, సత్పురుషులసేవ అనునవిమాత్రమే ముక్తిని బ్రసాదించి పరంధామమును జేర్పగలవు ఎంతటివారల కైనను సద్గురువుయొక్క యనుగ్రహము లభింపనిదే విష్ణుమాయ నధిగ మించుట అసంభవము

వయోవృద్ధు లైన శ్రీ సుధీంద్రతీర్థులు అస్వస్థులైరి వారికి శ్రీమూలరామారాధన మత్యంత కఠిన మయ్యెను ఏది యేమైనను శ్రీరామచంద్రమూర్తి నిత్యారాధనలకు భంగము వాటిల్లరాదు కావున శ్రీ సుధీంద్రతీర్థులు ఆశ్రమాధిప మును మఱియొక భాగవతోత్తమునకు నొసంగవలె నని సంకల్పించి ఆ పదవికి అర్హుడు శ్రీ వెంకన్నాచార్యుడే యని నిర్ణయించెను

ఒక శుభదినమున శ్రీ తీర్థులవారు శ్రీ వెంకన్నాచార్యుని బిలిపించి ఆశ్రమాధిపత్యమును వహింపవలసినదిగ కోరెను

శ్రీ వెంకన్నాచార్యులు సాక్షాత్తుగ శంఖుకర్ణుడే యైనను మానవ దేహసాహచర్యమువలన విస్మృతి నొంది తన్ను దాను దెలిసి కొనలేక విష్ణుమాయాశక్తికి లోనై ముకుళితహస్తములతో తనగురుదేవులయెదుట నిలుచుండి యిట్లుపల్కెను "గురుదేవా! మీా రేల న న్నిట్లాజ్ఞాపించుచున్నారు ? నే నింకను నాదారా పుత్రుల ప్రేమయందు బద్ధుడనై యున్నాను నావంటియల్పుడు ఈయత్యున్నత పదవికి తగునా? నేను సుశీలవతి యైననాభార్యను, పిన్నవయస్కుడైనపుత్రుని వీడి సన్యసింపలేను కావున యీా శిష్యుని క్షమింపవలసినదిగ ప్రార్థించుచున్నాను "

శ్రీ వెంకన్నాచార్యునివంటి పరమభాగవతోత్తముడే మాయకు లోనగుట గాంచి శ్రీ సుధీంద్రతీర్థులు పరమాశ్చర్య చకితులై తనయంతరంగములోనే విష్ణుమాయ ననేకవిధముల స్తుతించిరి ఆసమయములోనే బ్రాహ్మాశ్రమములో శ్రీ తీర్థుల వారికి బంధువైన ఒక సజ్జనుడు ఆశ్రమవాసిగ నుండెను శ్రీ వెంకన్నాచార్యులు ఆశ్రమాధిపత్యమును నిరాకరింపగా శ్రీ తీర్థులవారు దానిని యీాసజ్జనున కొసంగిరి ఆయనకు సన్న్యాశాశ్రమము నొసంగి శ్రీయాదవేంద్రతీర్థు లని నామకరణ మొనరించి శ్రీసుధీంద్రతీర్థులు తనబాధ్యతల నన్నింటినీ అప్పగించెను ఇట్లు కొంతకాలము గతింపగా శ్రీ సుధీంద్రతీర్థులు పరిపూర్ణారోగ్యవంతులైరి అపుడు శ్రీతీర్థులు శ్రీ యాదవేంద్రతీర్థుని దేశ సంచారము చేసి హరిభక్తిని ప్రచారము చేయవలసినదిగా ఆదే

శించిరి గురుదేవుని యాజ్ఞానుసారముగ శ్రీయాదవేంద్రతీర్థులు తీర్థయాత్రలకు బయలుదేరెను ఇట్లు ఒక సంవత్సరము గతింపగా సుధీంద్రతీర్థులు వార్ధక్యమువలన మరల అస్వస్థులైరి తనకు కాల మాసన్న మగుచున్న దని ఆయతీంద్రులు గ్రహించెను శ్రీయాదవేంద్రతీర్థులకొఱకై పెక్కండ్రు శిష్యు లు బయలుదేరిరి, కాని ఆయతీశ్వరు డెక్కడుండెనో యెవ్వ కిని తెలియ లేదు శ్రీమూలరామా రాధన మవిచ్ఛిన్నముగ కొనసాగ వలెను కావున పీఠమును శ్రీవెంకన్నాచార్యున కొసంగవలె నని శ్రీసుధీంద్రతీర్థులు మఱియొకసారి సంకల్పించి తనప్రియ శిష్యుని రావించి యిట్లు పల్కెను "వత్సా! నాదరికి రమ్ము, వార్ధక్యముచే అస్వస్థుడనైననేను శ్రీమూలరామారాధన మొనరింపలేకున్నాను ఎట్టి పరిస్థితులలోను శ్రీరామారాధన మానరాదు శ్రీయాదవేంద్రతీర్థు లెచ్చటనున్నారో తెలియ కున్నది ఆయన మరలివచ్చునంతవరకు ఈ భౌతికకాయము నిలచునో లేదో! కుమారా! దారాపుత్రులపై ఈప్రాపంచిక సుఖములపై మమకారమును వీడుము నీవు కారణజన్ముడవు ఆజన్మవైష్ణవుడవు నీపూర్వజన్మ వృత్తాంతములను జ్ఞప్తికి దెచ్చుకొనుము ధన మార్జించుచు కుటుంబమును పోషించు న తకాలమే కుటుంబసభ్యులు దేహధారుని ఆదరింపగలరు వార్ధక్య మావరింపగా కుటుంబసభ్యులే ఆ జీవుని చులకన చేయగలరు దేహము శిథిలమైనను వ్యాధు లావరించినను జీవునియాశాపాశము వీడదు మానవుడు బాల్యావస్థ నంతయు

క్రీడలతో, విద్యాభ్యాసముతో గడపి యౌవనకాలములో తరుణియందాసక్తుడై కుటుంబముందలి మోహముతో బానిస వలె జీవితమును గడుపుచుండును వృద్ధావస్థలో చింతా మగ్నుడై తరించుమార్గము గానక పరితపించును జీవుడు సచ్చిదానందవిగ్రహుడైన భగవంతుని ఒకయంశ తాను స్వతంత్రుడనని భగవంతునిదాసుడనుగానని సంకల్ప ముదయింపగనే జీవున కీభౌతిక దేహము లభించును ఆతడు జనన మరణచక్రమున బడి అనంతకాలము మాతృగర్భనరకము ననుభవించుచు బరితపించును వత్సా! నీవంటి మహాత్మునకు మోహము తగునా! శ్రీవిద్యాలక్ష్మియనుగ్రహము లేనిదే ఈసంసారసాగరమును దాటుట అసంభవము సర్వధర్మములను బరిత్యజించి శ్రీకృష్ణభగవానుని దివ్యపాదారవిందముల నాశ్రయించినవారినే ఆమె కరుణించును కావున భార్యా పుత్రాదిమోహములను వీడి భగవతిని ప్రార్థింపుము నీకు భగవంతునకు నడుమ అవరోధముగ మాయ యున్నది భగవంతుని కరుణవలన అది తొలగిపోవును అపుడు మేఘము తొలగి దివ్యప్రభలతో ప్రకాశించు ప్రచండార్కదర్శనమువలె అనంతకోటిసూర్యప్రకాశ సమన్వితుడు సచ్చిదానందవిగ్రహుడు నగు కృష్ణపరమాత్మ యొక్క దర్శనము నీకు లభించును అహర్నిశము లు భగవంతునారాధించుటకు నీవు సన్యసింపక తప్పదు వేంకటేశా! బ్రహ్మమొదలు కీటకపర్యంతము గల ఈజగము లన్నియు అశాశ్వతములు కేవలము భగవదారాధన

భగద్భక్తి, భగవన్నామ సంకీర్తనలే సత్యములు, అక్షరములు నని తెలిసికొనుము సర్వము నశ్వరమని, భగవదారాధనయే నిత్య మని ప్రబోధించువారే గురువు, తల్లి, తండ్రి, బంధువు అని గ్రహింపుము నాయనా! ఈశ్వాసలను విశ్వసింపకుము, ఎప్పు డవి ఆగిపోగలవో యెవరికి తెలియును ? కావున సత మవగతమైనంతనే సర్వమును బరిత్యజించి భగవంతు నాశ్ర యించుట అత్యుత్తమధర్మము అఖండసుఖప్రదాత యైన భగవంతునిసేవలు మరచి జీవులు పరులకు బానిస లై జీవిత మంతయు వ్యర్థపఱచుచున్నారు ఆహా! ఏమిదుఃఖము దారాపుత్రు లననేల ? సర్వజగమును తృణమువలె విసర్జించి సర్వోత్తముడు, చిదానందమయుడు, శుద్ధుడు, సచ్చిదానంద విగ్రహుడు నైన శ్రీకృష్ణపరమాత్మ యొక్క చరణముల నాశ్రయింపుము నీవు ద్వైతసిద్ధాంతమును ప్రచారము చేయుటకు శ్రీమూలరాముని సేవించుటకు, పీడితమానవుల నుద్ధరించుటకు, శ్రీహరివాయువులభక్తిని ప్రచారముచేయుటకు అవనిపై నవతరించిన శ్రీహరిపార్షదశ్రేష్ఠుడవు నాయనా! నీవు మహాపండితుడవు, అమ్మను ప్రార్థించి ఆమెయనుగ్రహ మునకు పాత్రుడ వై జీవుని ఆవరించియున్న మోహావరణము లను అసంగఖడ్గముచే ఖండించి భగవద్దర్శనమును బొంది చరితార్థుడవుగమ్ము, లెమ్ము, భయమును వీడుము

తనగురుదేవులు బల్కిన అమృతవాక్కుల నాలకించి

సత్యము నెఱిగినవారై మనస్సును అంతర్ముఖ మొనరించుకొని శ్రీవెంకన్నాచార్యుడు శ్రీవిద్యాలక్ష్మి యగువిష్ణు మాయ నిటుల స్తుతింప నారంభించెరు

శ్లో॥ త్వం దేవి జగతాం మాతా విష్ణుమాయా సనాతనీ।
కృష్ణప్రాణాధిదేవి చ కృష్ణప్రాణాధికా శుభా॥ 1

కృష్ణప్రేమమయీ శక్తిః కృష్ణసౌభాగ్యరూపిణీ।
కృష్ణభక్తిప్రదే రాధే నమస్తే మఙ్గలప్రదే॥ 2

అద్య మే సఫలం జన్మ జీవనం సార్థకం మమ।
పూజితాసి మయా సా చ యా శ్రీకృష్ణేన పూజితా॥ 3

కృష్ణవక్షసి యా రాధా సర్వసౌభాగ్య సంయుతా।
రాసే రాసేశ్వరీరూపా బృన్దా బృన్దావనే వనే॥ 4

వైకుణ్ఠే చ మహాలక్ష్మీర్వాణీ నారాయణోరసి।
క్షీరోదే సిన్ధుకన్యా చ మర్త్యే లక్ష్మీర్హరిప్రియా॥ 5

సర్వస్వర్గే స్వర్గలక్ష్మీర్దేవదుఃఖవినాశినీ।
సనాతనీ విష్ణుమాయా దుర్గా శంకరవక్షసి॥ 6

సావిత్రీ వేదమాతా చ కలయా బ్రహ్మవక్షసి॥
కలయా ధర్మపత్నీ త్వం నరనారాయణప్రసూః॥ 7

కలయా తులసీ త్వం చ గఙ్గా భువనపావనీ।
కృష్ణ భక్తిం కృష్ణదాస్యం దేహి మే కృపపూజితే॥ 8

తా॥ జననీ! రాధా! నీవు జగజ్జననివి, సనాతని వైన విష్ణుమాయవు, శ్రీకృష్ణుని ప్రాణములకే అధిష్ఠాత్రివి, ఆయనకు నీవు ప్రాణములకంటె అధిక వు, శుభస్వరూపిణివి (1) నీవు కృష్ణ ప్రేమమయీశక్తివి, శ్రీకృష్ణ సౌభాగ్య స్వరూపిణివి శ్రీకృష్ణభక్తిని ప్రసాదించు శ్రీరాధా! నీకు నమస్కారము (2) నేడు నాజన్మ సఫల మైనది నాజీవనము సుజీవన మైనది శ్రీకృష్ణునిచే పూజింపబడిన రాధను నేటికి పూజింపగల్గితిని (3) శ్రీకృష్ణుని వక్షస్థలమున విరాజిల్లు సర్వసౌభాగ్యశాలినివి న రాధవు నైననీవే రాసమణ్డలములో రాసేశ్వరివి, బృన్దావనములో బృందాదేవివి (4) వైకుంఠ ములో మహాలక్ష్మివి, శ్రీమన్నారాయణుని హృదయములో వాణివి, క్షీరసాగరములో సింధుక వు, మర్త్యలోకములో శ్రీహరికి ప్రియతమ వైనలక్ష్మివి (5) స్వర్గములో దేవతల దుఃఖములను నశింపజేయగల స్వర్గలక్ష్మివి శంకరుని వక్ష స్థలములో విరాజిల్లు సనాతనవిష్ణుమాయారూపిణివగు దుర్గవు (6) మాతా! నీవే నీకళాద్వారమున వేదమాత యగు సావిత్రి వై బ్రహ్మదేవుని వక్షస్థలములో విరాజిల్లి యున్నావు భగవతీ! నీవే నీకళాద్వారమున ధర్మదేవునిపత్నివై నర నారాయణ ఋషులకు జననివైతివి (7) మాతా! నీవే నీకళాద్వారమున తులసివైతివి, భువనములను పవిత్ర మొనరింప గల గంగాభవానివైతివి జగజ్జననీ! శ్రీకృష్ణునిచే పూజింప

బడినపరాదేవతా! నాకు శ్రీకృష్ణునియెడల అనన్యభక్తిని ఆయన దాస్యసౌభాగ్యమును ప్రసాదింపుము (8)

శ్రీవెంకన్నాచార్యునకు దివ్యరత్నసింహాసనము నధిష్ఠించి యున్న జగజ్జననియు, శ్రీ విద్యాలక్ష్మియు నగు రాధాదేవి దర్శన సౌభాగ్యము కల్గెను సచ్చిదానంద రూపిణి యైన అమ్మ పుత్రప్రేమతో తన దక్షిణ హస్తమును వెంకన్నాచార్యుని శిరముపై నుంచి, 'వత్సా! నీయనన్యభక్తికి నేను సంతుష్టురాలనైతిని నీవు మా కత్యంతాప్తుడవైనపార్షదప్రవరుడవు శంఖుకర్ణా! నిన్నావహించిన మాయ నాయనుగ్రహముచే తొలగిపోగలదు మేఘములు తొలగిపోయిన పిమ్మట దర్శన మొసంగు ప్రచండసూర్యునివలె నిన్నావరించిన నా మాయ దొలగి నీకు పరబ్రహ్మము, పరమాత్మయు, సచ్చిదానంద విగ్రహుడు, భగవంతుడు నైనశ్రీకృష్ణుని దివ్యదర్శనము లభించుగాక! కుమారా! నీకు పరమోత్కృష్టమైన జ్ఞానము నుపదేశించెద నవధరింపు''మని పలికెను శ్రీరాధాదేవి వెంకన్నాచార్యునకిట్లు దివ్యజ్ఞానోపదేశము చేయనారంభించెను

శ్లో॥ కృష్ణే భక్తిః కృష్ణదాస్యం వరేషు చ వరం వరమ్ ।
శ్రేష్ఠా పఞ్చవిధా ముక్తేర్హరిభక్తిర్గరీయసీ ॥ 1

బ్రహ్మత్వాదపి వేదత్వాదిన్ద్రత్వాదమరాదపి ।
అమృతాత్ సిద్ధిలాభాచ్చ హరిదాస్యం సుదుర్లభమ్॥ 2

అనేకజన్మతపసా సమ్యాప్య భారతే ద్విజ ।
హరిభక్తిం యది లభేత్ తస్య జన్మ సుదుర్లభమ్॥ 3

సఫలం జీవనం తస్య కుర్వతః కర్మణా క్షయమ్ ।
పితౄణాం చ సహస్రాణాం స్వస్య మాతుశ్చ నిశ్చితమ్॥ 4

మాతామహానాం పుంసాం చ శతానాం సోదరస్య చ ।
బాన్ధవస్యాపి పత్న్యాశ్చ గురూణాం శిష్యభృత్యయోః॥ 5

ఆబ్రహ్మస్తంబపర్యన్తం సర్వం మాయామయం జగత్ ।
భజ సత్యం బ్రహ్మ మామేశం త్రిగుణాత్పరమ్॥ 6

కాయేన మనసా వాచా పరం భక్త్యా దివానిశమ్ ।
భజ సత్యం పరబ్రహ్మ రాధేశం త్రిగుణాత్పరమ్ ॥ 7

తా॥ కుమారా! శ్రీకృష్ణుని యెడలభక్తి, ఆయన దాస్యసౌభాగ్యము సకలవరములలో ఉత్తమవరములు ఎందువలెననగా శ్రీహరియెడల అనన్య భక్తి సాలోక్యము సార్ష్టి, సామీప్యము, సారూప్యము, ఏకత్వము అను ముక్తుల కంటెను అత్యంతశ్రేష్ఠము, మహాత్వపూర్ణము (1) శ్రీహరి దాస్యసౌభాగ్యము బ్రహ్మత్వము, దేవత్వము, ఇంద్రత్వము, అమరత్వము, అమృతత్వము, సకలసిద్ధిలాభముకంటె పరమ దుర్లభము తనయనేకజన్మల తప ఫలముగ ఈభారత వర్షములో జన్మించి శ్రీహరిభక్తిని పొందినవాని జన్మమే పరమ దుర్లభజన్మమనియు, ఇక వానికి పునర్జన్మము లేదనియు తెలిసి

కొనుము తన సకలకర్మలను శ్రీహరిభక్తిద్వారమున క్షయ మొనరించుకొనగల్గిన ఆ పరమభాగవతోత్తముడు, వాని తల్లులు, మాతామహులు, పూర్వజులు, సహోదరులు, బంధవులు, పత్ని, గురుజనులు, శిష్యులు, భృత్యులు మొదలగు వారందరి జీవనములు తప్పక సఫలము కాగలవు (5) బ్రహ్మ మొదలు కీటకమువరకు గల సకలజగములు మాయామయములు అశాశ్వతములు కావున పరబ్రహ్మము, సత్యస్వరూపుడు, త్రిగుణాతీతుడు, నాహృదయేశ్వరుడు నైన శ్రీకృష్ణునే భజింపుము (6) అనన్యభక్తితో అహర్నిశములు నీమనో వాక్కాయ కర్మలచే సత్యస్వరూపుడు, పరబ్రహ్మము, పరమాత్మ, త్రిగుణాతీతుడు, రాధేశ్వరుడు నైన శ్రీకృష్ణభగవానునే భజింపుము (7)

ఇట్లు దివ జ్ఞానమును ప్రసాదించి జ్ఞాన లక్ష్మియగు శ్రీ విద్యాలక్ష్మియునగు శ్రీరాధాదేవి అంతర్హితురాలయ్యెను

శ్రీ విద్యాలక్ష్మి యొక్క అనుగ్రహమునకు బాత్రుడై శ్రీవెంకన్నాచార్యుడు దివ్యతత్త్వజ్ఞానోపదేష్టయై భయమును మోహమును, భ్రాంతిని వదలినవాడై నేత్రము నున్మీలన మొనరించి తన్మాతృతతో గాంచుచున్న గురుదేవుని గాంచి నేను సన్యాసాశ్రమస్వీకారమునకు సంసిద్ధుడ నని తనయంగీకార మును చెప్పెను ఆసమయమున శ్రీవెంకన్నాచార్యుడు అరుణా భానునివలె ప్రకాశింప నారంభించెను

శ్రీ వెంకన్నాచార్యుడు ఆచార్యుని అనుజ్ఞగైకొని గృహమునకు వెడలిపోయెను పూజామందిరమును ప్రవేశించి జన్మజన్మముల నుండి తన ఆరాధ్యదైవమైనశ్రీకృష్ణుని ఆరాధింపనారంభించెను ఆమహాభక్తుడు భక్తి పారవశ్యములో నుండగా జగదానంద కారకుడు, సచ్చిదానందవిగ్రహుడు, గోవిందుడు నైనశ్రీకృష్ణపరమాత్మ తనదివ్యదర్శనమును ప్రసాదించెను తదనంతరము జగన్నాథు డగుశ్రీరామచంద్రునిగా గోచరించెను తరువాత భగవాను డైదురూపములుగ సాక్షాత్కరించెను- 1 శ్రీకృష్ణపరమాత్మ 2 శ్రీరామచంద్ర ప్రభువు 3 శ్రీహయగ్రీవస్వామియైనమహావిష్ణువు 4 శ్రీలక్ష్మీ నృసింహస్వామి 5 శ్రీకృష్ణద్వైపాయన వ్యాసభగవానులు వారు పరమభాగవతోత్తము డైన శ్రీ వెంకన్నాచార్యు నను గ్రహించి జీవితలక్ష్యమును, తత్కర్తవ్యమును ప్రబోధించి అంతర్హితులైరి ఇంతలో సూర్యభగవాను డుదయించి అంధకారమును పారద్రోలెను శ్రీ వెంకన్నాచార్యులు తననిత్య కార్యక్రమమును ముగించుకొని శాస్త్రానుసారముగ సన్న్యాసము స్వీకరించుటకొఱకై తనభార్యయొక్క అంగీకారము నర్థించెను అందుల కాపతివ్రత 'నాథా! ఎల్లప్పుడు మీయాజ్ఞను పరిపాలించుటయే నేనెఱుగుదును ఎన్నడును నాయభిప్రాయము లను మీసమక్షమున బహిర్గత మొనరింపలేదు మీరు నాప్రాణముల నడిగినను సమర్పింపగలను కానీ మీ వియోగము

నెట్లు భరింపగల”నని విలపింప నారంభించెను శ్రీవెంకన్నా చార్యులు తనభార్యకు తత్త్వజ్ఞానోపదేశము చేసి క్షుద్రమైన ఆమె హృదయదౌర్బ ముసు నశింపజేసెను అపు డాసాధ్వి తనభర్త సన్యసించుట ^కరించి తనత్యాగశీలతను సర్వజగత్తు నకు చాటెను శ్రీవెంకన్నాచార్యుని యాదేశానుసారముగ ఆయన యగ్రజు డగుగురురాజాచార్యులు ఆశ్రమమున కేతెంచి ఆసాధ్విని, కుమారుని వెంటనిడుకొని స్వస్థలము జేరెను సరస్వతీదేవి, లక్ష్మీనారాయణుడు బాష్పపూరితనయనములతో తమ కారాధ్యు డైన శ్రీవెంకన్నాచార్యుని దర్శించుచు ఆయనను వీడలేక వీడలేక వెడలిపోయిరి

## సన్యాసాశ్రమ స్వీకారము

ఈవిషయ మంతయు తంజావూరు రాజాస్థానమునకు దెలిసెన శ్రీసుధీంద్రతీర్థులు తన పీఠమును మహాభాష్యా చార్యులు పరమశాచార్యులు నైన శ్రీవెంకన్నాచార్యులకు నొసంగుచున్నా రని తెలిసికొని తంజావూరుప్రభు వత్యంతానంద భరితు డై తనరాణులతో సకలపరివారముతో ఆమహోత్సవ

మును గాంచుట కేతెంచెను. శ్రీసుధీంద్రతీర్థు లధిష్ఠించిన పీఠమునే సర్వజ్ఞ పీఠమందురు. ఈ మహోత్సవమునకు దుర్మతినామసంవత్సరఫాల్గుణ శుద్ధవిదియ (1621 AD) శుభ ముహూర్తముగా నిర్ణయింపబడినది. అపుడు శ్రీవెంకన్నా చార్యుడు ఇరువదిమూడు వత్సరములవాడు.

ఆమహోత్సవమునకు సుదూరప్రాంతములనుండి అనేక భక్తులు, రాజ్యాధినేతలు అసంఖ్యాకముగ నరుదెంచిరి. ఆశ్రమ మంతయు అలంకరింపబడెను, అత్యున్నతముగ సభావేదికను ఆయత్తపఱచిరి. ఆదినమున శ్రీవెంకన్నాచార్యులు గురుదేవు ననుజ్ఞ గైకొని ఆత్మశ్రాద్ధము నొనరించెను. సన్న్యాసాశ్రమ స్వీకారమునకు చేయవలసినవిధుల నొనరించి కాషాయాంబర ధారి యై సభామధ్యమున ఉన్నతాసనాసీను డై యున్న తన గురుదేవుని చరణములపై వ్రాలెను. ఆసభలో రాజులు, జ్ఞానులు, ఋషులు, యోగులు, భక్తులు, ప్రజలు, ఆసీను లై మహోత్సవమును తిలకింపనారంభించిరి. తన చరణముల నాశ్రయించిన శ్రీవెంకన్నాచార్యుని లేవనెత్తి ఆలింగన మొనరించుకొని అర్ధాసన మొసంగి శ్రీసుధీంద్రతీర్థులుమూలరామ విగ్రహమును, సాలగ్రామాదులను తనశిష్యుని శిరముపై నుంచి కనకాభిషేకము జలాభిషేకము మొదలగు శుభకార్యముల సంపన్న మొనరించెను. మంగళవాద్యములు మ్రోగుచుండగ ఆమహాజనసభామధ్యమున తనశిష్యునిశిరముపై దక్షిణహస్తము

నుంచి చెవిలో దివ్యమంత్రము నుపదేశించెను. గురువులు శ్రీరాఘవేంద్రతీర్థు లనినామ మొసంగి సర్వజ్ఞపీఠాధిపతిగా నభిషేకించిరి. ఆహూతులు సాశ్రునయనములతో పులకితగాత్రులై జయజయధ్వానముల నొనరించుచు పరమానందభరితులై గద్గదస్వరములతో శ్రీహరినామసంకీర్తన మొనరించిరి. మహాత్ములందఱు శ్రీరాఘవేంద్రతీర్థా! విజయీభవ, విజయీభవ! యనిబల్కిరి.

భువనగిరిలో నున్న సరస్వతీదేవి తనభర్త సన్న్యాసాశ్రమమును స్వీకరించినా డనెడువార్త నాలకింపగనే వియోగదుఃఖమును భరింపలేక భర్తదర్శనము లేనిదే తన జీవితము వ్యర్థమనిభావించి ఆత్మార్పణము చేసికొనెను. శ్రీరాఘవేంద్ర తీర్థులు సర్వజ్ఞపీఠమున కధిపతి యై అనన్యభక్తితో అహర్నిశములు శ్రీకృష్ణనామసంకీర్తన మొనరించుచు శ్రీమూలరామ సాలగ్రామాద్యాశ్రమదైవములను యథావిధిగ దాస్యభావముతో ప్రతినిత్యము ఆరాధింపనారంభించెను. తన శిష్యుడు తన కర్తవ్యమును యథావిధిగ నిర్వర్తించుట గాంచి శ్రీసుధీంద్ర తీర్థులు పరమానందభరితులై నిశ్చింతగ శ్రీహరినామోచ్చారణ మొనరించుచు రుధిరోద్గారి సంవత్సర ఫాల్గుణబహుళ విదియ (1624 AD) శుభదినమున పాంచభౌతికదేహమును వీడి పరంధామమునకు వెడలిరి.

ఒకదినమున శ్రీరాఘవేంద్రతీర్థులు శ్రీమూలరామో

పాసనలో నుండగా ఆయన సమక్షమున విషణ్ణవదనముతో ఒకభూతము గోచరించెను తన వియోగమును భరింపలేక ఆత్మార్పణమొనరించిన తనభార్య అపరిమితదుఃఖముతో భూత మైనదని గ్రహించి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ఆమెకు ముక్తిని ప్రసాదింపవలసినదిగ శ్రీహరిని, రాముని, శ్రీవాయు దేవుని న ంచెను శ్రీహరిఖ్యాజాక్షతలును దీసికొని ఆయా కారము పై జల్లగ అది భూతయోనిని వీడి దివ్యరూపమును దాల్చి శ్రీహరినామసంకీర్తన మొనరించుచు దివ్యపరంధామము నకు వెడలిపోయెను

తీర్థయాత్రలు సల్పుచున్న శ్రీయాదవేంద్రతీర్థులవారికి శ్రీ వెంకన్నాచార్యులు సర్వజ్ఞపీఠము నధిష్ఠించి శ్రీరాఘవేంద్ర తీర్థులయ్యె ననువార్త దెలిసికొని పరమానందభరితుడయ్యెను తనగురుదేవులు పరంధామమునకఱిగి రని దెలిసికొని చింతా క్రాంతుడయ్యెను, ఆక్షణముననె తీ యాత్రలు ముగించుకొని ఆశ్రమమునకు ప్రయాణమయ్యెను శ్రీయాదవేంద్రతీర్థులు కుంభకోణమును జేరినా రని దెలిసికొని శ్రీరాఘవేంద్రతీర్థులు వాదచారులై ఆశ్రమవాసులతోగూడి కుంభకోణమున కఱిగి శ్రీయాదవేంద్రతీర్థులకు స్వాగతముబల్కి సాష్టాంగదండప్రణామ ముల నర్పించెను తనపాదముల నంటిన భాగవతోత్తముని లేవనెత్తి ఆలింగనమొనరించుకొని శ్రీయాదవేంద్రతీర్థులు పర మానందభరితులైరి శ్రీయాదవేంద్రతీర్థులవారిని అఖండ

స్వాగతసత్కారములతో తోడ్కొని శ్రీరాఘవేంద్రస్వామి ఆశ్రమమును జేరిరి ఆశ్రమములో శ్రీ యాదవేంద్రతీర్థునకు ఉన్న తాపన మొసంగి శ్రీరాఘవేంద్రతీర్థు లిట్లుబల్కిరి "మహా భాగా నీవు నాకు ఆశ్రమజ్యేష్ఠుడవు మనగురుదేవులు ప్రప్రథమమున మీకే సన్న్యాసాశ్రమమును ప్రసాదించిరి మీరు తీర్థయాత్రలకు వెడలినతరువాత గురుదేవులు వార్ధక్యకారణముచే అస్వస్థులై శ్రీమూలరామారాధన మొనరింపలేకపోయిరి శ్రీమూలరామారాధన మవిచ్ఛిన్నముగ కొనసాగవలె ననివారు సంకల్పించి నాకాబాధ్యత నప్పగించిరి యతీంద్రా! నాకు పీఠాధిపతిపదవియం దెట్టియాకాంక్షయును లేదు నిజముగ ఈపీఠము శ్రీమూలరామారాధనము మీసొంతములే మహానుభావా! ఈమఠాశ్రమకర్తవ్యములను తాము స్వీకరించి నాకు అఖండహరినామసంకీర్తన మొనరించుకొనెడు అవకాశమును ప్రసాదింపుడు"

యాదవేంద్రతీర్థులు రాఘవేంద్రతీర్థులనిష్కామత్వమును గాంచి ఆశ్చర్యచకితులై ఆయనగొప్పతనమును, నిస్వార్థభావమును, శ్రీహరిభక్తిని వేనోళ్ళపొగడిరి ఆయన ఆనందబాష్పపూర్ణనయనులై సభామధ్యమున నిట్లుబల్కెను రాఘవేంద్రతీర్థా నీజన్మము సఫలమైనది హరిభక్తిదక్క అన్యములు కాంక్షింపనినీవు జీవన్ముక్తుడవు నీకు ఆశ్రమ శ్రేష్ఠుడనై సమాశ్రమునునే నేను నిశ్చయముగ ఈభవసాగర

మును తరింపగలను. తమ్ముడా! నీవు మహాత్ముడవు. హరి భక్తులలో శ్రేష్ఠుడవు. సత్యమార్గానుగామివి, నిస్వార్థపరుడవు, గురుదేవులకు ప్రియశిష్యుడవు. వాస్తవముగ నీవే సర్వజ్ఞ పీఠమునకు అధిపతివి తగినవాడ వనిభావించి గురుదేవులా కర్తవ్యము నీ కొసంగినారు, నాకు పరమానందమైనది. ఆశ్రమసోదరా! మూలరాముని తనివిదీర ఆరాధించి శేషజీవిత మంతయు హరినామప్రచార మొనరించుచు పాదచారినై యీభారతవర్ష మునందు చరించెదను.

మరునాడు శ్రీరాఘవేంద్రతీర్థులు మూలరామారాధనకు సకలమును సంసిద్ధ మొనరించెను. యాదవేంద్రతీర్థులు మూల రాముని, సాలగ్రామాద్యాశ్రమ దేవతలను తనివిదీర ఆరాధించి మరల తీర్థయాత్రలకై బయలుదేరెను. యాదవేంద్రతీర్థులు తమ శేషజీవిత మంతయు హరినామప్రచార మొనరించుచు మధురామలై యనెడుగ్రామములో శ్రీకృష్ణనామము నుచ్చ రించుచు పాంచభౌతిక దేహమును వీడి పరంధామమునకు వెడలిపోయిరి. నేటికిని ఆగ్రామములో శ్రీవారిబృందావన మును మనము దర్శింపగలము.



# భక్తుని పాట – భగవంతుని ఆట

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి సన్న్యాసాశ్రమమును స్వీకరించి బ్రహ్మకరార్చితు డైన శ్రీమూలరాము నారాధించుచు ఆశ్రమాధిపతు లై విరాజిల్లుచుండిరి ప్రతిదినము మధ్యాహ్న సమయమున శ్రీస్వామి ఆశ్రమములో నున్నమూలరామ మూర్తులను ఆరాధించెడివారు ఆదివ్యమూర్తులలో నీ మూర్తులు ప్రధానములైనవి 1 బ్రహ్మచే ఆరాధింపబడిన శ్రీమూలరామమూర్తులు 2 సర్వజ్ఞులచే ఆరాధింపబడిన దశావతార పీఠదిగ్విజయ శ్రీరామచంద్రుడు 3 శ్రీకృష్ణ ద్వైపాయన వేదవ్యాసమహర్షి శ్రీఆనందతీర్థస్వామి కనుగ్ర హించినవా సముష్టి 4 నీలాదేవి యారాధించిన వైకుంఠ వాసుదేవుడు 5 బలమురి శంఖము అనగా దక్షిణావర్త శంఖము 6 శ్రీజయతీర్థస్వామి ఆరాధించిన శ్రీజయరామ మూర్తి 7 శ్రీకృష్ణపరమాత్మస్వరూప మైనసాలగ్రామము 8 శ్రీవ్యాసరాయతీర్థకరార్చిత శ్రీవేణుగోపాలస్వామి

ఒక్కొక్కమూర్తి నారాధించుచున్నపుడు శ్రీజగన్నాథు డారూపమున సాక్షాత్కరించి స్వామిసేవలను గ్రహించెడివాడు శ్రీకృష్ణపరమాత్మ యనిన శ్రీరాఘవేంద్రతీర్థస్వామికి అనన్య భక్తి భగవంతునిపై శ్రీవారు అసంఖ్యాకముగ కీర్తనలను రచించి వీణావాదన మొనరించుచు మధురాతిమధురముగ గానముచేసెడివారట శ్రీవారు రచించిన కీర్తనలు నేడు లభ్యముగా లేవు ఒక ర్తనను మీముందుంచుచున్నాను

భైరవి రాగము — త్రిపుట తాళము

ఇందు ఎనగె గోవిందా నిన్న పాదార
    విందవ తోరో ముకుందనే || పల్లవి ||

మందరోద్ధారనే నందగోపనకంద
    ఇందిరారమణ గోవిందా గోకులానంద ||అనుపల్లవి||

నొందన య్యా భవబంధనదోళుసిలుకి
ముందే దారిగాణదే కుందిదే జగదొళు ।
కందనానెందెన్న కుందుగళె ణిసదె ।
తందేనీకాయో కందర్పజనకనే ॥ (1వ పాదము)

మాడతనది బలు హేడిజీవననాగి ।
ధృఢభక్తియమాడలిల్లవో హరియే ।
నోడలిల్లవో నిన్న పాడలిల్లవోమహిమే ।
గాడిగార కృష్ణ బేడికొంబెనో స్వామి ॥ (2వ పాదము)

ధారుణియొళు భూభార జీవననాగి ।
మేరె దప్పినడెదు సేరిద కుజనర ।
యారూకాయువరిల్ల సేరిదే నినగయ్యా ।
ధీరవేణు గోపాలా పారుగాణిసోస్వామీ । (3వపాదము)

గోవిందా! ఈక్షణమందే నీపాదరవిందమును నాకు
జూపుము ముకుందా! (పల్లవి)

మందరపర్వతము నెత్తినవా ! నందగోపకునికుమా రుడా ! శ్రీమహాలక్ష్మీరమణుడా ! గోవిందుడా ! గోకులా నందుడా ! (అనుపల్లవి)

భవబంధనముల జిక్కి బాధపడుచున్నాను ముందు దారిగానక యీజగములో కృశించిపోవుచున్నాను

మన్మధునితండ్రీ ! నేను నీకుమారుడనే, జనకా ! నే నొనరించినయపరాధములను లెక్కింపక నన్ను కాపాడుము (1)

శ్రీహరీ! నేను మూఢుడను అర్ధైముతో జీవించుచు నీయెడల దృఢ మగుభక్తిని ఒనరింపలేకపోవుచున్నాను దేవా ! నేను నీదర్శనముచేసియెఱుగను నీమహిమలను పాడి యెఱుగను పార్థసారధీ ! కృష్ణా ! నిన్ను నేను వేడుకొను చున్నాను (2)

ఈభూమికి భారమై నేను జీవించుచున్నాను దుర్మార్గు లతో స్నేహమొనరించుచు హద్దులు లేక ప్రవర్తించుచున్నాను నన్ను కాపాడువా రెవ్వరును లేరు ధీరవేణుగోపాలా ! నే నొనరించిన యపరాధము లన్నియు నీకు విదితమే స్వామీ! వేగమే నన్ను కాపాడుము (3)

ఇట్లు శ్రీకృష్ణుని స్తుతించుచు దివ్యస్వరములతో వీణను పలికించుచు శ్రీస్వామివారు తన్మయులయ్యేదరు అపుడు గజ్జలందియలు ఘల్లుఘల్లు మనిపించుచు శ్రీబాలగోపాల కృష్ణుడు ప్రత్యక్షమై నృత్యమొనరించెడివాడు

# క్షామ నివారణము

కుంభకోణము తంజావూరు రాజ్యములో నుండెను ఆరాజ్యమునకు విజయరాఘువుడు ప్రభువు అనావృష్టిచే రాజ్యములో కరవు తాండవింప నారంభించెను ప్రజల యెడల ప్రేమ కల్గిన ఆరాజు అన్నసత్రముల నేర్పరచి అన్నార్తుల నాదరింపనారంభించెను లక్షలకొలదిగ ప్రజలు ఆహారము కొఱకై అన్నసత్రములచెంత గుమికూడ సాగిరి ధాన్యాగారము లన్నియు క్రమక్రమముగ తరిగిపోయెను ఇక ఒక్క రోజునకుమాత్రమే గ్రాసము కలదు, తదనంతరము రాజ పరివారముకూడ పస్తులుండవలసివచ్చును ఈ విపత్సమయ ములో రక్షించువా రెవ్వ రనివిజయరాఘువుడు పెద్దలతో సమాలోచన మొనరించెను ఘటనాఘటనసమర్థు డైన శ్రీరాఘవేంద్రతీర్థస్వామియే రక్షకు డని తెలిసికొని విజయ రాఘువుడు కుంభకోణమునకు జని శ్రీవారిపాదారవిందముల నాశ్రయించెను ఆశ్రితజనవత్సలు డైన శ్రీవారు ప్రజలయెడల రాజునకు గల ఆదరాభిమానముల కెంతయో సంతసించెను శ్రీస్వామి తంజావూరున కరుదెంచి ధాన్యాగారము పై శ్రీబీజము నుంచి శ్రీధాన్యలక్ష్మిని స్తుతించెను ఆధాన్యాగారము అక్షయమయ్యెను అన్నార్తు లందఱికి ఆహారము చెను

వర్షములు కురియుటకు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి సుదర్శనహోమ మొనరించుటకు సంకల్పించిరి హోమము

ప్రారంభమయ్యెను రా జగువిజయరాఘవుడు అన్ని యేర్పాట్లు చేసి కానుకగ ఒక యమూల్యరత్నహారమును శ్రీస్వామివారి కర్పించెను కాంతాలోకనకముల యెడల పీతరాగు డైన శ్రీరాఘ వేంద్రతీర్థస్వామి అందఱు చూచుచుండగ ఆరత్నహారమును యజ్ఞేశ్వరార్పణముగ యజ్ఞకుండమున బడవైచెను అమూల్య మైనయారత్నహారము అగ్నిపాలగుట గాంచి రాజు, ప్రజలు, ఆశ్చర్యచకితు లై మనస్సులో శ్రీవారిని శకింపనారంభించిరి అది గమనించి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి మరునాడు యజ్ఞ కుండముఁనుండి అందఱు చూచుచుండగనే రాజు సమర్పించిన రత్నహారమును దీసెను అది తన దివ్యప్రభలను దిశదిశల ప్రస రింపజేయుచుండెను అగ్నిపూతమైన ఆదివ్యహారమును శ్రీవారు శ్రీమూలరామచంద్రున కలంకరించిరి అది గాంచి విజయ రాఘవుడు శ్రీవారిదివ్యమహిమలయెడల పూర్ణవిశ్వాసము కల్గినవాడై తా నొనరించినశంకకు పశ్చాత్తప్తహృదయు డై శ్రీరాఘవేంద్రతీర్థస్వామి దివ్యచరణారవిందములను స్తుతించెను

సుదర్శనహోమపూర్ణాహుతి సమయమున ఆకాశ మంతయు జలధరములతో నిండెను తంజావూరురాజ్యములో వర్షమారంభమయ్యెను క్షామముతొలగెను రాజు ప్రజలు శ్రీవారియనుగ్రహవిశేషముచే క్షామవిపత్తునుండి ముక్తులై రక్షింపబడిరి

# సిరంగి దేశాయి

శ్రీ రాఘవేంద్రతీర్థస్వామి వేదధర్మములను ప్రచార మొనరించుచు నాస్తికులను పరాజయ మొనరించుచు దేశ మంతయు భగవద్భక్తిని ప్రచార మొనరించుచుండెను ధార్వాడ ప్రాంతములో సిరంగి యనుగ్రామము కలదు ఆగ్రామములో దేశాయి యనుమహాపండితుడు కలడు అతడు నాస్తికుడు దైవమునందు, వేదములందు విశ్వాసము లేనివాడు అతడు వేదము లసత్యము లని, మంత్రములు, ఆరాధనలు, పూజలు ఉదరపోషణార్థ మై అగ్రకులములవారు సృష్టించి అమాయ కులను మోసముచేయుచున్నా రని ప్రచార మొనరింపసాగెను మహాత్ము లొనరించు అద్భుతము లగులీలలను గారడివానివి లని అవహేళన మొనరించుచుండెను వాని దుష్ప్రచారమునకు కొందఱు మూర్ఖులు బాసటగా నిలచి సజ్జను లగుధార్మికులను అవమానింపగోడంగిరి

దేశాయి తన్నెదిరించువా రందఱిని వేదమంత్రశక్తితో రోకలిబండను చిగురింపచేసినచో నేను వేదమంత్రములను, భగవంతుని విశ్వసించెదనని, అట్లొనరింపలేనివారు నాస్తికులు కావలయు ననిసవాలు చేయుచుండెను తన గృహప్రాంగణ ములో ఒకరోకలిబండను పాతెను ఎందఱో ఆస్తికులు రోకలి బండను చిగురింపజేయుటకు ప్రయత్నించి విఫలులైరి ఆస్తిక సమాజమున కీవిషయము అవమానకరమయ్యెను ఈపని

చేయగల సమర్థు డెవ్వ రనిచర్చించుకొని వారు శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి నాశ్రయించిరి వేదమంత్రముల యొక్క మహిమను ప్రకటించి ప్రజలయందు దైవముపై విశ్వాసమును పెంచవలయు నని దేశాయిని ఉద్ధరించుటకు శ్రీవారు సంకల్పించెను

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి భక్తజనులు వెంటరాగా సిరంగిలో దేశాయి యేర్పాటుచేసిన రోకలికడ కేతెంచిరి దివ్యవేదమంత్రముల నుచ్చరించుచు తన కమండలములోని మంత్రజలములను రోకలిపై చల్లగా అది ఆక్షణమందే చిగురించెను ఈయద్భుతమును గాంచి ప్రజ లందఱు శ్రీవారి మహిమలను అనేకవిధముల ప్రస్తుతించిరి నాస్తికు డైన దేశాయి తనయధర్మప్రవర్తనమునకు పశ్చాత్తప్తహృదయు డై శ్రీవారి చరణారవిందముల నాశ్రయించెను దేశాయి యనుచరు లైననాస్తికు లందఱు ఆస్తికులుగ మారిపోయిరి. శ్రీవారు దేశాయిని తనశిష్యునిగ అనుగ్రహించిరి

# శ్రీ వారి తీర్థయాత్రలు

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తన మఠపరివారముతో గూడి కుంభకోణము నుండి బయలుదేరి భారతదేశములో గలపవిత్ర తీర్థములను దర్శించి హిమాలయములనుండి కన్యాకుమారి వఱకు గల పుణ్యానదీజలములలో స్నాన మాచరించిరి వా రేప్రదేశమున విడిది చేసినను అచట సభ నేర్పరచి ప్రజలకు ద్వైతసిద్ధాంతమును ప్రబోధించుచుండిరి శ్రీవారిపాండిత్య మమోఘము, తత్త్వనిరూపణ మత్యంత మనోహరము వారిసభలకు వేలకొలదిగ భక్తులేతెంచి ద్వైతసిద్ధాంతము యొక్క యుత్కృష్టతను శ్రీవారియుపన్యాసముల ద్వారమున దెలిసికొని పరమానందభరితులయ్యెడివారు శ్రీవారియమృత వచనముల నాలకించినవారు ఏ సిద్ధాంతమువారైనను ద్వైతసిద్ధాంతమును మన పూర్వకముగ యథార్థ మని యంగీకరించెడివారు

శ్రీరాఘవేంద్రస్వామి ఆశ్రమములో నున్నను, తీర్థ యాత్రలయం దున్నను విధిగా సన్న్యాసాశ్రమ ధర్మముల నన్నింటినీ ఆచరించెడివారు ప్రతిదినము కొంతకాలమును తపమునకు మఱికొంతకాలము సన్న్యాసాశ్రమవిధులకు, కాల కృత్యాదులకు, మిగిలినకాలము నంతటిని ద్వైతసిద్ధాంత గ్రంథములరచనలో శ్రీవారు గడిపెడివారు. శ్రీవారు ఏబది యేడుసంవత్సరములు సర్వజ్ఞపీఠాధిపతిగా విరాజిల్లిరి. వా

రాకాలములో అసంఖ్యాకముగ ద్వైతసిద్ధాంతప్రబోధకము లైనగ్రంథములను నిర్మించిరి వానిలో కొన్నిగ్రంథములు మాత్రమే నేడు లభ్యమగుచున్నవి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తమయాధ్యాత్మికశక్తితో ఆశీర్వాదబలముతో తన్నుం చినవారిహృదయములను జయించెడివారు శ్రీవారిని దర్శించి నంతమాత్రముననె ప్రజలాయనకు భక్తులయ్యెడివారు, పరమ శాంతిని పొంది బ్రహ్మానంద మొందెడివారు

ఎందరో శాసకులు జాగీరులను, ధనవంతులు ధనకనక వస్తువాహనములను శ్రీవారి కర్పించిరి కాని ఆవిరాగి వాని నన్నింటిని స్వీకరింపక మఠమునకు సంక్రమింపజేసిరి ఒకమారు శ్రీస్వామివారు తీర్థయాత్రాసమయమున భిల్లపురి యను గ్రామములో విడిదిచేసిరి ఆగ్రామములోనే నివసించుచున్న భైరవభట్టు, వీరభద్రభట్టు అనునిర్వు రుద్దండపండితులు స్వామిని శాస్త్రార్థమై ఆహ్వానించిరి ఓడినవారు విజయులకు తమసర్వస్వము నర్పించి శిష్యులు కావలయు ననిషరతు విధించిరి శ్రీరాఘవేంద్రస్వామి చిరునవ్వుతో వారికోరిక నంగీకరించి శాస్త్రచర్చార్థమై వారేర్పరచినసభను ప్రవేశించిరి ఆసభలో సుదూరగ్రామములనుండి అసంఖ్యాకముగ జనులు వచ్చిరి వారిలో పండితులు, ధనాఢ్యులు, రాజ్యాధికారులు కూడ కలరు పీఠాధిపతి యైనపిదప శ్రీవారికి యెదురైన మొదటిశాస్త్రార్థచర్చ యిది ఆయిర్వురు పండితు లుద్దండులు

వారిని జయించుటయెవరికైనను అత్యంతకష్టమే ఇరుపక్షముల వారికి అనేక దినములపర్యంతము వాగ్వివాదము జరిగెను ఎవరికివారు సిద్ధాంతములను అత్యంతస్పష్టముగ ప్రతిపాదించిరి ఎట్టకేలకు ఆయిర్వురు పండితులు ద్వైతసిద్ధాంతమే సరియైనదని అంగీకరించి తమ జాగీరులను, ధనమును శ్రీవారి కర్పించి శిష్యులైరి నాటినుండి భిల్లపురిజాగీరు సర్వజ్ఞ పీఠమునకు జెందెను శ్రీరాఘవేంద్రస్వామి దివ్యత్వము దేశమంతట ప్రచార మగుటకు ఈవిజయము దోహదమొనర్చినది

భిల్లపురినుండి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తనపరివార ముతో అరుణాచలము, మధుర, వేణాచలము, శ్రీరంగము మొదలగు పుణ్యక్షేత్రములను దర్శించుచు కన్యాకుమారిని చేరెను ఆపవిత్ర ప్రదేశములో స్వామి కొంతకాలము కఠోరతప మాచరించిరి

కన్యాకుమారినుండి పశ్చిమసముద్రతీరమార్గమున పయ నించుచు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి శ్రీమధ్వాచార్యుల జన్మస్థల మైన ఉడిపిక్షేత్రమును జేరిరి ఆదివ్యక్షేత్రములో స్వామి ఒకసంవత్సరము నివసించి శ్రీకృష్ణుని నవవిధభక్తిలద్వారమున ఆరాధించిరి ప్రతిదినము శ్రీవారు ఉదయముననె మధ్వ సరోవరములో స్నానమాచరించి శ్రీకృష్ణుని దర్శించి హరినామ సంకీర్తన మొనరించి అనంతేశ్వరాలయమున కేతెంచెడివారు శ్రీమధ్వాచార్యులవారు ప్రతిదినము అనంతేశ్వరాలయములోనే

తమ ప్రసంగములను నిర్వహించెడివారు. ఆజగద్గురువు ప్రవచ
నములను నిర్వహించిన ప్రదేశమున కెదురుగా నున్నప్రదేశము
లోనే శ్రీరాఘవేంద్రతీర్థస్వామి మధ్వసిద్ధాంతమును ప్రవచించెడి
వారు. ఆసభ కొన్నిగంటలకాలము కొనసాగెడిది. అసంఖ్యా
కముగ ప్రజలాసభకు విచ్చేసి శ్రీవారి యుపన్యాసామృతము
నాస్వాదించెడివారు.

శ్రీస్వామి ఉడిపిక్షేత్రములో నివసించినపుడు అచ్చోట
నొక యాశ్రమమును నిర్వహించిరి. శ్రీమధ్వాచార్యులు
నిర్మించిన అష్టమఠములపీఠాధీశ్వరులు శ్రీరాఘవేంద్రస్వామిని
పరమభాగవతోత్తమునిగ గుర్తించి గౌరవించిరి. వారు
శ్రీస్వామి నిజమైనసన్యాసి యని, శ్రీవాదిరాజస్వామి తదనంతర
మంతటివాడు లేడనియు, జపతపాదులలో అద్వితీయుడనియు,
సతతముభగవదారాధనారక్తుడనియు, దివ్యపురుషుడనియు
సాధ్వికజన్ముడనియు, దివ్యశక్తిసమన్వితుడనియు, ద్వైతసిద్ధాంత
ప్రచారకులలో అగ్రగణ్యుడనియు వేనోళ్ళ కీర్తించిరి. శ్రీవారు
తమగ్రంథములలో ద్వైతసిద్ధాంతమే అత్యుత్తమ మని ప్రతిపా
దించిరి. వారిగ్రంథములను పఠించినంతమాత్రముననె దేహ
ధారులు ద్వైతసిద్ధాంతానుయాయు లయెదరు.

శ్రీరాఘవేంద్రతీర్థస్వామికి ప్రతిదినము శ్రీమధ్వాచార్య
నిర్మితములైన అష్టమఠములలో ఆయన మంత్రముతో నేటికిని
వందనస ణ మాచరించుచుందురు. శ్రీవారిమంత్రోచ్చా

రికము ద్వైతసిద్ధాంతానుయాయులకు పరమకర్తవ్యమయ్యెను ప్రతినిత్యము వారు శ్రీవారి నీశ్లోకముతో ప్రార్థించుచుందురు

శ్లో॥ పూజ్యాయ రాఘవేన్ద్రాయ సత్యధర్మరతాయ చ ।
భజతాం కల్పవృక్షాయ నమతాం కామధేనవే ॥

తా॥ పూజింపదగినవాడును, సత్యధర్మములయందాసక్తి గలవాడును, భక్తితో సేవించువారికి కల్పవృక్షము వంటి వాడును, ప్రపత్తితో నమస్కరించువారికి కామధేనువువంటి వాడును నగు శ్రీరాఘవేంద్రస్వామికి నమస్కారము

పై శ్లోకమును పఠించునాచారము శ్రీమఠ్వాశ్రమములలో నేటికిని విధిగా పాటింపబడుచున్నది తన దివ్యశక్తిచే సర్వుల హృదయములను జయించినవాడు శ్రీరాఘవేంద్రయతీంద్రుడు

శ్రీవారు ఉడిపిక్షేత్రమునుండి బయలుదేరి మైసూరు రాజ్యమును ప్రవేశించిరి ఆరాజ్యములో గలపుణ్యక్షేత్రముల నన్నింటిని దర్శించుచు, పవిత్రతీర్థస్నాన మాచరించుచు శ్రీవారు శ్రీహరిహరేశ్వరుడు విరాజిల్లియున్న హరిహరక్షేత్రమును జేరిరి తన మనోవాక్కాయకర్మలచే శ్రీరాఘవేంద్రతీర్థస్వామి శ్రీహరిహరేశ్వరు నారాధించి శ్రీజయతీర్థస్వాముల వారిబృందావనప్రదేశమును జేరిరి ఈస్వాములే శ్రీటీకాచార్యు నిగ ప్రసిద్ధిగాంచిన పరమభాగవతోత్తముడు వీరిబృందావనము మళఖేడ (మాన్యకటకము) యనుగ్రామములో నున్నది ఈ

గ్రామము గుల్బర్గానగరమునకు చేరువలో నున్నది ఆపవిత్ర ప్రదేశములో శ్రీతీర్థులవారు కొన్నిదినము లాగి అనుభాష్యము నకు భాష్యమును రచించిరి దక్షిణాపథములో తీర్థయాత్రను ముగించుకొని శ్రీవారు ఉత్తరదేశయాత్రను ప్రారంభించిరి మొదట కాశీవిశ్వేశ్వరుని దర్శించి గయాప్రయాగతీర్థసందర్శన మొనరించి శ్రీవారు నేరుగా బదరికాశ్రమమునకు జేరిరి ఆ పవిత్రక్షేత్రములో శ్రీరాఘవేంద్రతీర్థస్వామి శ్రీమధ్వాచార్యుని, శ్రీవేదవ్యాసుని సాక్షాత్తుగా దర్శించిరి ఈ మహాపురుషు లిర్వురు శ్రీస్వామికి తమదివ్యదర్శనమును ప్రసాదించి ఆయన పూజలనొంది అనేకవరముల నొసంగి ఆశీర్వదించి అదృశ్యులైరి

తదనంతరము శ్రీవారు బదరికాశ్రమమునుండి దక్షిణ దిక్కుగా ప్రయాణము చేసి అయోధ్యను చేరి అచ్చోటనుండి బృందావనమును జేరిరి శ్రీకృష్ణభగవానుడు దివ్యలీల లొనరించిన బృందావనములో శ్రీవారు దివ్యమాధుర్యాను భూతి నొందిరి బృందావనమునుండి కొల్హాపూరునకే తెంచి శ్రీమహాలక్ష్మి నారాధించి పండరిపురమును జేరిరి పండరి పురములో పాండురంగవిఠలుని, శ్రీరుక్మాయిని దర్శించి సర్వమును విస్మరించి పరమానందభరితులై శ్రీస్వామి యఖండ భక్త్యావేశముతో నృత్యమొనరించిరి

పండరిపురమునుండి తిరుపతిక్షేత్రమునకు బయలుదేరి దారిలో ఆదోని యనుగ్రామములో విడిదిచేసిరి

ఆప్రదేశమును గాంచగనె శ్రీరాఘవేంద్రస్వామి ఒక దివ్యానుభూతిని పొందెను ఆయన సర్వజ్ఞుడు కావున ఆప్రదేశ మత్యంతపవిత్ర మనిగ్రహించి తీర్థయాత్రానంతరము మఱల యాప్రదేశమునకు రావలయు నని నిర్ణయించుకొనిరి

# మో క్ష ప్ర దా త

శ్రీరాఘవేంద్రస్వామికి వెంకన్న యను పరిచారకుడు కలడు అతడు శ్రీవారికి మడితో పూజాసామగ్రిని సమకూర్చు చుండెడివాడు సదా వెంటనుండి గురుదేవుని సేవించు చుండెడివాడు అతడు స్వామి కనన్యభక్తుడు వానిపై శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తన పూర్ణ కృపను జూపెను శ్రీవారికృపవలన వెంకన్నయొక్క సంచితాగామిప్రారబ్ధకర్మ ములు నశించెను శ్రీరాఘవేంద్రస్వామి తీర్థయాత్రల నొన రించుచు చిత్రదుర్గప్రాంతమునకు చేరెను

శిష్యునికర్మనిర్మూలన మైన దనిగ్రహించి రాఘవేంద్ర తీర్థస్వామి వరమును కోరవలసినదిగా పలికిరి అందు

లగు వెంకన్న జననమరణచక్రములనుండి విముక్తిని, పరంధామ ప్రాప్తిని కోరుకొనెను అపుడు శ్రీవారు ఒక అగ్నికుండము నిర్మింపవలసినదిగా శిష్యులను ఆజ్ఞాపించిరి వెంకన్నకు స్వామి మోక్షము నొసంగబోవుచున్నా రని తెలిసికొని యీవిచిత్ర మును గాంచుటకు చిత్రదుర్గవాసు లందఱు సమావేశమైరి ప్రజలందఱి సమక్షమున అగ్నికుండము ప్రజ్వలింపచేయబడెను శ్రీవారు వెంకన్నను ఆశీర్వదించి అగ్నిప్రవేశ మొనరింపవలసి నదిగా ఆజ్ఞాపించిరి ఆ యనన్యభక్తుడు కించిన్మాత్ర మైనను చలింపక భయము నొందక గురుదేవునకు, అగ్నిగుండమునకు ప్రదక్షిణ మొనరించి ప్రజలందఱుచూచుచుండగ అగ్ని ప్రవేశముచేసెను పాంచభౌతికశరీరము నశించి వానికి దివ్యదేహము సంప్రాప్తించెను దివ్యలోకములనుండి విమాన మరుదెంచగా వెంకన్న దాని నధిరోహించి శ్రీభగవన్నామ సంకీర్తన మొనరించుచు పరంధామమునకు వెడలిపోయెను ఈయద్భుతమును గాంచి ప్రజ లందఱు శ్రీవారి ననేకవిధముల స్తుతించిరి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ధర్మార్థకామమోక్ష ప్రదాత యనియందఱు విశ్వసించిరి

ప్రకటిసి తోరిరె ముకుతియ బేడిద ।
భకుతన యోగ్యతె నిఖిలజనరిగె రాఘవేంద్ర ॥

శ్రీరాఘవేంద్రా ! సకలజనులసమక్షములో యోగ్యు డైనభక్తునకు మోక్షము నొసంగితివి ప్రహ్లాదునకు సహ్లాదు

డనుసోదరుడు కలడు అతడు శ్రీజగన్నాధదాసునిగ జన్మించెను ఆయన శ్రీరాఘవేంద్రతీర్థస్వామికి భక్తుడయ్యెను ఆమహాను భావుడు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి లీలలను కన్నడభాషలో అనేకవిధముల ప్రస్తుతించెను వెంకన్నకు మోక్షమిచ్చిన సంఘటనను ఆయన యిట్లువర్ణించెను



# జ ల ని ర్మా ణ ము

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తీర్థయాత్రల నొనరించుచు మహారాష్ట్ర ప్రాంతములోని పండరిపురమును చేరి శ్రీపాండురంగని దర్శించిరి భగవంతు ననేకవిధముల స్తుతించి ఆరాధించి ఆప్రదేశమునుండి ఉత్తరదిశగా బయలుదేరిరి మార్గములో ఒక యెడారిప్రాంతము కలదు అది గ్రీష్మఋతువు సూర్యుడు చండప్రచండుడై ప్రకాశించుచుండెను కొన్ని యోజనముల పర్యంతము వృక్షములుకాని, జలాశయములుకాని లేవు శ్రీవారిశిష్యులు తమవెంట తెచ్చిన జలములుకూడ పరిసమాప్త మయ్యెను శ్రీరాఘవేంద్రతీర్థస్వామిపరిచారకులలో పరమ భక్తు డగు నొకహరిజనుడు కలడు అతడు గర్భవతిగ నున్న

తనభార్యచే తీర్థయాత్రలను చేయింపవలె ననెడియాకాంక్షతో ఆమెను వెంటనిడుకొని వచ్చెను పూర్ణగర్భవతి యగు నామెకు ఆయెడారిలో ప్రసవసమయ మాసన్నమయె ను దరిదాపులలో నీడకాని, జలములుకాని లేవు నొప్పులు పడుచున్న ఆమెకు మరణము తథ్య మని యందఱు తలపోయు చుండిరి ఆమెభర్త కల్పవృక్షస్వరూపు డగు శ్రీరాఘవేంద్ర స్వామిని తనభార్యను రక్షింపవలసినదిగా ప్రార్థించెను

వెంటనే శ్రీవారు తనదండముతో భూమిపై చక్రా కారముగ రేఖను నిర్మించి మధ్యలో దండముతో మోదిరి ఆక్షణమందే పాతాళగంగ ఆవిర్భవించి ఒక జలాశయముగ మారెను ఎట్టి యాధారము లేకయే ఆకాశమందు తన కాషాయవస్త్రమును నిలిపి ఆస్త్రీకి నీడను కల్పించిరి గురుదేవుని యనుగ్రహావిశేషముచే సుఖప్రసవముకాగా ఆమె చక్కనికుమారుని కనెను



# పతితోద్ధారము

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తంజావూరునుండి మఱియొక మారు తీర్థయాత్రలకు బయలుదేరెను అనేకపుణ్యక్షేత్రములను దర్శించుచు తామ్రపర్ణీనదీతీరమున నున్న 'కల్లడకురిచి' యను గ్రామమున కేతెంచిరి అగ్రామములో ఒక బ్రాహ్మణుడు కలడు ఆ బ్రాహ్మణు డొనరించిన పాపములకు గ్రామవాసు లాతనిని పతితునిగ నిర్ణయించి బహిష్కరించిరి

దుర్విధివిశేషముచే పాప మొనరించి సంఘబహిష్కృతు డైన ఆతడు పశ్చాత్తాపమును బొందెను తా నొనరించిన పాపములనుండి విముక్తి పొందవలె ననిసంకల్పించుకొనెను పతితపావను డైన శ్రీరాఘవేంద్రతీర్థస్వామి సపరివారముగ తనగ్రామమున కేతెంచె నని దెలియగనె ఆ బ్రాహ్మణుడు పరుగుపరుగున పోయి శ్రీవారికి సాష్టాంగదండప్రణామముల నాచరించెను ఆసభలో దా నొనరించిన దుష్కృత్యములను విన్నవించుకొనెను పశ్చాత్తాపముతో విషణ్ణవదనుడై తనను రక్షింపవలసినదిగా శ్రీవారిని శరణు వేడెను నదీజలములలో స్నాన మాచరించి శుద్ధుడవై పూజాసమయమునకు రావలసినదిగ ఆపతితబ్రాహ్మణుని శ్రీవా రాదేశించిరి ఆత డట్లే మరునాడు పూజాసమయమున కరుదెంచెను

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి వానిపై శంఖతోయములను జల్లి మంత్రాక్షతల నొసంగిరి తనపంక్తిలో భోజన మొసంగి

ఆపతితుని పావనునిగ నొనరించిరి ఆబ్రాహ్మణుని పాపము లన్నియు నశింపగా ఆతడు స్వామియనుగ్రహ విశేషముచే ఉద్ధరింపబడెను ఈసంఘటనమును గాంచి ఆగ్రామవాసులు, కు శ్రీవారిశిష్యులు పలువిధముల భావింప నారంభించిరి అపరోక్షజ్ఞాను లైన శ్రీరాఘవేంద్రతీర్థస్వామి వారిమనోభావ ములను గ్రహించిరి

మరునాడు శ్రీవారు ఒకస్వచ్ఛ మగు తెల్లనివస్త్రమును దెప్పించి దానిని జీడిమామిడిరసములో నుంచిరి ఆవస్త్రము కారునలుపుగా మారెను అందరు చూచుచుండగా శ్రీస్వామి దానిపై శంఖోదకమును జల్లగా అది మలిన శుద్ధమై తెల్లగ మారిపోయెను ఈ లీలను గాంచి శం౦చినవా రందఱు పరమాశ్చర్యచకితు లైరి శ్రీవారు నిజముగ పతితపావను లని వారు ప్రస్తుతించిరి

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ఆప్రదేశములో సమావేశమై యున్న ప్రజలను గాంచి ఇట్లుపలికెను "ప్రజలారా ! ప్రతిమానవుడు తెలిసియో తెలికయో పాపముల నొనరించును మానవు లొనరించు ఈమహాపాతకములకు వారిని శిక్షింపవలె నన్న నో భగవంతుడు క్షణములో క్రొక్కప్రళయమును సృష్టించి నను వారిపాపములు నశింపవు కాని భగవంతుడు దయా మయుడు, పతితపావనుడు ఆయన శిలగా మారిన అహల్య నుద్ధరించెను పరమపాపాత్ము డగు అజామిళుని రక్షించెను

బ్రాహ్మణవంశములో జన్మించి చండాలస్త్రీమోహమున బడి అనేకదుష్కృత్యము లొనరించి తుదకు పశ్చాత్తప్తచిత్తుడై వేంకటగిరిని జేరినమాధవుని అనుగ్రహించెను కావున దేహధారులారా! పశ్చాత్తాపమువలన మానవుడు తా నొనరించిన పాపములలో అర్ధభాగమును నశింపజేసికొనగలడు మిగిలినపాపములో అర్ధభాగము ఇతరులకు జెప్పి తన దోషముల నంగీకరించినచో నశించును మిగిలినపాపము సత్పురుషుల కరుణవలన తొలగిపోవును అతడు పాపరహితుడగును పశ్చాత్తప్తహృదయుడై తా నొనరించిన దుష్కృత్యములను అందఱియెదుట అంగీకరించినవానిని దూషించినచో వాని పాపములు దూషించినవానిని ఆశ్రయించును కావున పరదూషణము పాపహేతు వనిగ్రహించి మెలగుట అత్యుత్తమము"

శ్రీవారు పల్కిన అమృతోపమానము లైన ఉపదేశముల నాలకించి అందఱు తా మొనరించిన దానికి పశ్చాత్తప్తులైరి తా మిక పరదూషణ మొనరింపక సన్మార్గమున చరించెద మని శ్రీరాఘవేంద్రతీర్థస్వామిసమక్షమున బాసచేసి చరితార్థులైరి

# మూకం కరోతి వాచాలం

శ్లో॥ శ్రీరాఘవేంద్రగురుం వన్దే బాలోఽపియదనుగ్రహాత్ ।
తరేన్నానామతగ్రహ-వ్యాప్తం సిద్ధాన్తసాగరమ్ ॥

తా॥ ఎవరికృపాప్రభావముచే బాలుడైనను అబోధ వ్యక్తియైనను నానావిధమతమతాంతరము లనెడు గ్రహాముల (తిమింగలముల)తో నిండియున్న సిద్ధాంతరూపసముద్రమును అవలీలగా తరింపగలడో, అట్టి శ్రీరాఘవేంద్రతీర్థస్వామికి నమస్కరించెదను

శ్లో॥ వన్దేతంశ్రీమద్గురురాఘవేంద్రాద్భుతచేష్టితమ్ ।
యస్య ప్రసాదాదజోఽపి తత్స్వరూపం నిరూపయేత్ ॥

తా॥ ఎవనికృపచే శాస్త్రజ్ఞానవిహీనుడైనమూర్ఖుడు కూడ ఆయనతత్వమును నిర్ణయింపగలడో, అయ ద్భుతకర్ముడై శ్రీరాఘవేంద్రతీర్థస్వామికి నమస్కరించెదను

శ్లో॥ తం శ్రీగురురాఘవేంద్రదేవం వన్దే జగద్గురుమ్ ।
యస్యానుకమ్పయా శ్వాప మహాబ్ధిం సంతరేత్ సుఖమ్॥

తా॥ ఎవనికృపచే క్షుద్రశ్వానము (కుక్క) కూడ అనాయాసముగ మహాసముద్రమును తరింపగలదో, అట్టి శ్రీరాఘవేంద్రతీర్థస్వామికి నేను నమస్కరించెదను

అనగా క్షుద్రదేహధారి యైనను శ్రీవారియనుగ్రహము నకు పాత్రు డైన మహాసాగరసదృశమైన యీసంసారము నవలీలగ తరింపగల డనిభావము

ఆదోనిచెంత కందనాతి యను ఒక కుగ్రామము కలదు ఆగ్రామములో వెంకన్న యను ఒక అనాథబాలకుడు తనమేన మామ నాశ్రయములో నివసించుచుండెను ఆమేనమామ వ్యవసాయదారుడు కావున వానిచెంత పశుసంపద కలదు అతడు వెంకన్నను పశువులకాపరిగా నియమించి అందులకు ప్రతిఫలముగ ఆహారము, వస్త్రములు, నివసించుటకు ప్రదేశము వానికి నిచ్చెను జన్మచే బ్రాహ్మణు డైనను వెంకన్న విద్యా భ్యాసమునకు నోచుకొనక పశువులకాపరిగా జీవించుచుండెను ప్రతిదినము ఉదయముననె పశువులను దోలుకొని తోటిపశువుల కాపరులతో గలసి అరణ్యమునకు జని సాయంసమయమువరకు పశువులను సంరక్షించి గ్రామమునకు తిరిగివచ్చుట వెంకన్న దినచర్యయయ్యెను పశువులకాపరులలో వెంకన్న యొక్కడే బ్రాహ్మణుడు తన కుపనయనసంస్కారము జరిగినను విద్య నభ్యసింపలేకపోయితి నని యీబాలకు డెంతయో చింతించి గురుకులమునకు బోవుటకు తనకు అనుజ్ఞ నీయవలసినదిగ మేనమామ నర్థించెను కాని యాస్వార్థపరుడు బాలకుని జిజ్ఞాసను గ్రహింపక అనేకవిధముల నిందించి పశువులకాపరిగనే శేషజీవితము గడుపు మని నిర్దేశించెను తన దౌర్భాగ్యమున

కనేకవిధముల దుఃఖించి మనస్సును రాయి చేసికొనియాబాలుడు తన విధులను నిర్వర్తింపదొడంగెను

ఒకదినమున వెంకన్న గోగణములను ఆహారమునకై అరణ్యములో ఎడచి తనతోటిగోపబాలకులతో గలసి అనేక క్రీడల నొనరించి, చల్దుల నారగించి అపరాహ్ణము కాగా ఒక విశాల మైన వటవృక్షచ్ఛాయలో మైమరచి నిదురించెను సూర్యుడు అస్తాచలమువైపు పయనించుచుండగ బాలునిపై గలవృక్షచ్ఛాయ తొలగిపోయెను ఆ వటవృక్షముయొక్క తొఱ్ఱలో నొకమహాసర్పము నివసించుచుండెను ఆసర్పరాజు తనబిలమును విడచి వెంకన్న చెంత కఱుదెంచి యతనికి భానుని కిరణములు సోకకుండ తనవిశాలఫణమును విప్పిపట్టెను తోటి గోపబాలకు లావిచిత్రమును గాంచి పరమాశ్చర్యచకితులై పరుగుపరుగున గ్రామమున కఱుదెంచి జరిగిన యద్భుతవిషయ మును గ్రామస్థులకు దెలియబఱచి వెంకన్న మేనమామ, తదితరగ్రామస్థు లందఱు అర మున కఱుదెంచి సర్పము వెంకన్న శరము చెంత ఫణమును యాడుట గాంచి అచ్చెరు వందిరి నాటినుండి మేనమామ, తదితరగ్రామస్థులు వెంకన్న సామాన్యుడు కాడని, మహోన్నతపదవి నొందగల డనిగ్రహించి ప్రేమించి, వానిని ఆదరింప నారంభించిరి

ఆదోనిలో శ్రీరాఘవేంద్రతీర్థస్వామి యనుయతీంద్రులు వేంచేసియున్నారని, ఆయనఘటనాఘటనసమర్థుడని, దివ్యశక్తి

సమన్వితుడని తెలిసికొని వెంకన్న శ్రీవారిదర్శనార్థమై పరుగు పరుగున ఆదోని చేరెను. ఆబాలకుడు స్వామివారివిడిదిని ప్రవేశించి శ్రీవారికి అనన్యభక్తిశ్రద్ధలతో సాష్టాంగదండ ప్రణామ మాచరించెను. శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తన పాద ముల నాశ్రయించిన బాలకుని లేవనెత్తి ముఖావలోకనమాత్రముననే యితడు ఉత్కృష్టభవిష్యత్తు గలబాలకు డనిభావించి 'నాయనా! నీమనోవాంఛితమును దెల్పు' మని పల్కెను. అందుల కాబాలకుడు 'పూజ్యగురుదేవా! నేను విద్యాగంధము లేనిపశులకాపరిని. తలిదండ్రులు లేని అనాథను. ఉపనయన సంస్కారమును పొందియు విద్యాభ్యాసమునకు నోచుకొనని అభాగ్యుడను. విద్యల నభ్యసింపవలయు ననుప్రగాఢాకాంక్ష నాకు కలదు. మహానుభావా! నాకు విద్యాభిక్ష నొసంగి నన్ననుగ్రహింపు' డని ప్రార్థించెను. బాలకుని వినయమునకు భక్తికి శ్రీవా రత్యంతప్రసన్నులై శ్రీకృష్ణార్పితమంత్రాక్షతలను వెంకన్నశిరముపై నుంచి 'వత్సా! నిన్నాశీర్వదించుచున్నాను. నాయనుగ్రహమున నీవు ఏకసంధాగ్రాహివై అవలీలగ విద్యల నభ్యసింపగలవు. నీ కేకష్టములు సంభవించినను నన్ను స్మరింపుము, సదా శ్రీకృష్ణభగవానుని స్మరింపు' మని అనుగ్రహించెను.

మహాత్ముని యనుగ్రహమునకు పాత్రుడై అత్యంత సంతుష్టుడై వెంకన్న తిరిగి స్వగ్రామమునకు వెడలెను.

ఆమఱునాడె శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తనపరివారముతో బయలుదేరి తిరుపతినగరమును జేరి పాదచారులై ఏడుకొండల నధిగమించి తిరుమలచేరి శ్రీనివాసునిదివ్య మంగళవిగ్రహమును కన్నులకరవుదీర దర్శించి పరమానంద భరితులైరి కొంతకాల మాపవిత్రప్రదేశములోనే నివసించి శ్రీవారు తనివిదీర శ్రీవేంకటేశ్వరు నారాధించిరి తిరుపతిలో ఒకయాశ్రమమును నిర్మించి శ్రీవారు కాళహస్తి, కంచి మొదలగుదివ్యక్షేత్రముల నన్నింటిని దర్శించిరి తదనంతరము కుంభకోణమునకు మరలివచ్చి కొన్ని సంవత్సరములు ఆశ్రమములోనె నివసించిరి వారు ఒకచోటనె చాలకాల ముండుటకు గలపరమార్థ మేమనగా శ్రీవారి వాయు తత్త్వనిరూపక మైన ద్వైతమహాగ్రంథనిర్మాణమే శ్రీవారు అసంఖ్యాకముగ దివ్యగ్రంథములను రచించిరి కాని నేడు మనకు నలుబదియెనిమిది(48)గ్రంథములు మాత్రమే ఉపలబ్ధము లైనవి కొన్నిమాత్రమే ముద్రితములుకాగా పెక్కుగ్రంథములు అముద్రితములుగ మిగిలిపోయినవి

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి రచించిన కొన్ని గ్రంథములు

1 నుండి 3 వరకు వేదత్రయవివృతి
4 మంత్రార్థమంజరి
5 నుండి 9 వరకు పురుషసూక్తాదిపంచసూక్తవ్యాఖ్యానములు
10 నుండి 19 వరకు దశోపనిషత్ఖండార్థము
20 గీతావివృతి

21 ప్రమేయదీపికా వ్యాఖ్యానము
22 గీతా తాత్పర్య టీకా వివరణము
23 తంత్ర దీపిక
24 న్యాయముక్తావళి
25 తత్త్వ మంజరి
26 తత్త్వ ప్రకాశికా భావ దీపిక
27 పరిమళ వ్యాఖ్య
28 నుండి 37 వరకు దశప్రకరణ టీకా వ్యాఖ్యానము
38 శ్రీరామ చరిత్ర మంజరి
39 శ్రీకృష్ణ చరిత్ర మంజరి
40 తాత్పర్యనిర్ణయ భావసంగ్రహము
41 వాదావళీ వ్యాఖ్యానము
42 చంద్రికా ప్రకాశము
43 తర్క తాండవ వ్యాఖ్యానము
44 అణు మధ్వ విజయ వ్యాఖ్యానము
45 భాట్ట సంగ్రహము
46 ప్రాతః సంకల్ప గద్యము
47 ప్రమేయ సంగ్రహము
48 ప్రమాణ పద్ధతి వ్యాఖ్య



# పశువుల కాపరి అమాత్యుడైన విధము

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి కొన్ని సంవత్సరములు కుంభకోణమునగల ఆశ్రమములోనుండి అనేకగ్రంథములను రచించిరి ఆకాలములోనే తంజావూరుప్రభు వైన రఘునాథరాయలు మరణించెను ఆయనపుత్రుడు పరిపాలనాదక్షుడు కాకపోవుటయే కాక అత్యంతబలహీనుడు నైయుండెను ఆకాలములో హిందువులకు, మహమ్మదీయులకు తరచు యుద్ధములు సంభవించుచుండెడివి అంతియేగాక ఉత్తరదేశ ప్రభువులుకూడ దిగ్విజయమును గాంక్షించి దక్షిణదేశముపై దండయాత్రలను జరుపుచుండెడివారు మహమ్మదీయులప్రాబల్యము అంతకంతకు అభివృద్ధిచెంది హిందూమతములు అత్యంతప్రమాదకునకు లోనైనవి కావున శ్రీరాఘవేంద్ర స్వామి కుంభకోణమును వీడి దూరముగ పోవలయు ననిసంకల్పించిరి వారి మనములో ఆదోని, దాని పరిసరప్రాంతములు ఆశ్రమమునకు అనువగు స్థలము లనిసంకల్పముకలిగెను

ఇది యిట్లుండగా విజయనగరసామ్రాజ్యపతనానంతరము బహమనీసుల్తాను లైదుగురు పరస్పరముకలహించుకొనెడివారు ఆప్రాంతములో ఆదోని, రాయచూరు, ముద్గల్ నగరములలోని కోట లత్యంతకీలకస్థానములు ఆమూడుకోటలు బీజాపూరు నవాబు రాజ్యపరిధిలో నుండెను మిగిలిన నల్గురు బహమనీ సుల్తాను లత్యంతకీలకప్రదేశము లైనయీకోటలను జయింపవలె

నవిబలప్రయోగములు చూపుచుండెడివారు ఈమూడుకోటలు అహ్మదునగరరాజ్యానకు చేరువలో నున్నవికావున ఆరాజు వానిని కబళింపవలె నవిప్రయత్నించుచుండెను

ఈ ప్రాంతమును రక్షించుటకు బిజాపూర్ నవాబు అసదుల్లాఖాన్ అను సైన్యాధిపతిని నియమించెను అసదుల్లా ఖాన్ బహుబలవంతుడు, రణవిద్యలోమిగులనేర్పరి, ఆప్రదేశము నకు వాస్తవముగ అసదుల్లాఖానే నవాబు బీజాపూర్నవాబు నామమాత్రప్రభువే యని గ్రహింపవలెను ఆసమయములో అహ్మదునగర సైన్యములు ఆప్రదేశమును ముట్టడించెను అసదుల్లాఖాన్ తనసైన్యములను రాజ్యరక్షణార్థమైసరిహద్దులకు బంపి తానే స్వయముగ బయలుదేరెను ఆయన గ్రామ గ్రామము దిరుగుచు యుద్ధనిర్వహణకు ధనమును, యువకులను సంగ్రహింప నారంభించెను ఆతడు ఏనుగుపై నెక్కి అశేష పరివారముతో ప్రభువువలె బయలుదేరి ప్రతిగ్రామమును, నగరమును దర్శింపనారంభించెను ఆయనకు స్వాగత మీయు టకు నజరానాలను సమర్పించుటకు ప్రతిగ్రామములోని జను లొకచోట సమావేశ మయ్యెడివారు యువకులు తమంతట తామే సైన్యములో జేరుటకు తమసంసిద్ధతను వెల్లడించెడివారు

అసదుల్లాఖాన్ ఆదోనినుండిబయలుదేరికతువాళిగ్రామము గుండా పయనించుచుండగ ఆగ్రామ ప్రజలందరు స్వాగతమిచ్చు టకై సమావేశమైరి ఆసమయమునందు సరిహద్దునందు గల

యుద్ధశిబిరమునుండి ఒకరౌతు అసదుల్లాఖాన్ కడకు వచ్చి సలాముచేసి సీలువేసియున్న ఒకపత్రమును సమర్పించెను గజము నధిరోహించియున్న ఖాను అది యొకముఖ్యమైన యుద్ధవార్త యనిగ్రహించి దాని నందుకొని తనకు స్వాగతము బల్కుటకై సమావేశమైన ప్రజలను జూచెను వారిలో నిలువ బడియున్న, ఆజానుబాహువైన ఒకయువకుడు అసదుల్లాఖాన్ దృష్టి నాకర్షించెను ఆయువకునిలో ప్రకాశించుచున్న అద్భుత తేజమును గాంచి ఖాను పరమాశ్చర్యచకితుడయ్యెను ఆయున కుని తనవద్ద కాహ్వానించి తనసరసన కూర్చుండబెట్టుకొనెను ఆయువకుడే శ్రీరాఘవేంద్రతీర్థస్వామిచే ఆదోనిలో ఆశీర్వ దింపబడిన పశులకాపరి యైనబ్రాహ్మణుడు అసదుల్లాఖాన్ తనహస్తములో నున్నపత్రమును ఆబ్రాహ్మణబాలునకిచ్చి చదువవలసినదిగా ఆజ్ఞాపించెను తనజీవితములోవిద్యాభ్యాసమే ఎఱుగని వెంకన్న శ్రీరాఘవేంద్రతీర్థస్వామి యాశీర్వచనము పై అఖండవిశ్వాసము గల్గినవాడై మనస్సులో గురుదేవునిదివ్య నామమును జపించి రక్షింపు మనిప్రార్థించిఆపత్రమునువిప్పెను ఆసమయమున వెంకన్నకు సకలవిద్యాజ్ఞానము క్షణములో స్ఫురింపగా పర్షియాభాషలో నున్న ఆయుత్తరమును జదివి అసదుల్లాకాన్‌కు వినిపించెను యుద్ధములో అఖండవిజయము కల్గినదని, అహమ్మద్‌నగరసైన్యములు పలాయనము చిత్తగిం చినవని, మఱియెట్టిసహాయ మవసరము లేదవి ఆలేఖా సారాంశము ర్తను విన్న అసదుల్లాఖాన్ అ ం

తానందము నొంది ఇదియంతయు ఈబాలుని దర్శనమువలన కల్గినయదృష్టమే యనిభావించెను వెంకన్నను తనతో తోడ్కొని ఆదోనిచేరి తనదర్బారులో ముఖ్యాధికారిగా నియమించెను వెంకన్న శ్రీరాఘవేంద్రతీర్థస్వామి యాశీర్వాద బలమువలన రాజకీయములలో చతురుడై అనతికాలములోనె అసదుల్లాఖాన్‌కు కుడిభుజమయ్యెను అసదుల్లాఖాన్ వెంకన్నను తనరాజ్యమున కమాత్యునిగా నియమించెను నాటినుండి వెంకన్న దివానువెంకన్నగా విఖ్యాతుడై రాజ్యములో గల అత్యున్నతపదవి నలంకరించి రా సుఖములను బడసెను మహాత్ముల నాశ్రయించినవారు పశులకాపరిమైన నేమి? నిశ్చయముగ అత్యున్నతులు అమాత్యులు కాగలరు





## శ్రీ వాదిరాజ తీర్థస్వామి

సాధువులు, భక్తులు, యతీశ్వరులు, ప్రజల నాకర్షించుటకు, వారిని తమశిష్యులుగ నొనర్చుకొనుటకు అద్భుతములను ప్రదర్శించుట పరిపాటియే వారుమహిమ లెన్నియో చిత్రవిచిత్రముగ ప్రదర్శించి దుఃఖితులదు ఖములను బాపెదరు ఆశ్రి

తులగు వారివాంఛితములను దీర్చెదరు మహాత్ముల మనుకొనెడి కొందఱు క్షుద్రవిద్యలను ప్రదర్శించి స్వార్థప్రయోజనములను సాధించుకొందురు కాని స న్మార్గావలంబులైన మహాత్ములు మాత్రము దేహధారుల నుద్ధరించి వారికి భగవంతునిభక్త్యారాధనలను ప్రబోధించుటకే మహత్తులను ప్రదర్శించెదరు ఇట్టి మహాత్ములు అసమాన తపోశక్తిసమన్వితులై, తపస్సు ద్వారమున అఖండమైనయనిష్టమైనపుణ్యమును సముపార్జించి ఆపుణ్యమును మానవుల తాపత్రయములను దొలగించుటకై నుపయోగించెదరు వీరు ప్రతిఫలముగ దేనినిగూడ అభిలషింపక కేవలము పారమార్థికమార్గముననె పురోగమించెదరు ఇట్టి నిస్వార్థభక్తులలో వరేణ్యుడైనవాడె నేటికిని మంత్రాలయము బృందావనములో విరాజిల్లియున్న శ్రీరాఘవేంద్రతీర్థయతీంద్రులు ఈమహాత్ముడు అఖండదైవశక్తిని సముపార్జించి తన్నాశ్రయించిన భక్తులతాపత్రయమును హరించుచున్నాడు ఆయన బృందావనమును ప్రవేశింపకమునుపు ప్రత్యక్షముగ ప్రజలవద్దకు దిరుగుచు వారియాపదలను బారద్రోలి వారినిభగవద్భక్తిమార్గానుగాములుగ నొనరించెను వర్తమానకాలములోకూడ శ్రీవారు మంత్రాలయాంతర్గత బృందావనములో విరాజిల్లుచు ప్రతినిత్యము తన్నాశ్రయించుచున్న అసంఖ్యాక భక్తులను రక్షించుచున్నారు భవిష్యత్కాలములో వారు ఎందఱి నుద్ధరించెదరో ఎవరికి తెలియును ?

ప్రపంచ చరిత్రలో సజీవముగ బృందావనమును ప్రవేశించి వందలకొలది సంవత్సరములపర్యంతము సజీవులై విరాజిల్లుచు భక్తుల ననుగ్రహించుచున్న మహాత్ములను వ్రేళ్ళపై లెక్కింపవచ్చును. వారిలో నిర్వు రత్యంతప్రసిద్ధులు. ఒకరు సోదెమతాధిపతు లైన శ్రీవాదిరాజతీర్థులు. ఉడిపిలో శ్రీమధ్వాచార్యనిర్మితము లైన అష్టమఠములలో నిదియొకటి. వీరి బృందావనము ధార్వార్ జిల్లాలో సిర్సితాలుకాలో సోందా యనుగ్రామమున కలదు.

శ్రీవాదిరాజతీర్థస్వామిసంస్కృతములోమహాపండితుడు. కన్నడకవి. ఈమహానుభావుడు సంస్కృతములో అనేకగ్రంథములను రచించి వేలకొలదిగ కన్నడగీతములను ప్రవచించెను.

శ్లో॥ ప్రథమో హనుమన్నామ ద్వితీయో భీమఏవ చ
పూర్ణప్రజ్ఞః తృతీయస్తు చతుర్థో వాదిరాజవై ॥

తా॥ మూలవాయు దేవుని ప్రథమావతారమే శ్రీరామచంద్రదివ్యపాదారవిందమకరందామృ తాస్వాదియైన శ్రీహనుమంతుడు. రెండవయవతారమే నాగాయుతబలసంపన్ను డైన భీమసేనుడు. మూడవ అవతారమే పూర్ణప్రజ్ఞుడు జగద్గురువు నగుశ్రీమధ్వాచార్యులు. నాల్గవయవతారమే నేటికిని బృందావనములో సజీవముగనున్న శ్రీవాదిరాజతీర్థస్వామి. ద్వాపర యుగములో రుక్మిణీదేవినుండి అభ్యర్థనాపత్రమును దోడ్కొని

క్షణములో కుండినపురమునుండి ద్వారకకు జేరిన బ్రాహ్మణ దైవమే శ్రీవాదిరాజస్వామి శ్రీవాదిరాజతీర్థస్వామి బృందా వనమును ప్రవేశించి యనేకసంవత్సరములు గతించెను నేటి వరకు ఆయన రెండుపర్యాయములు తనభక్తులకు ప్రత్యక్ష దర్శనము నొసంగెను శ్రీస్వామి బృందావనములో దా విరాజిల్లుచు వర్తమానకాలములోగూడ ఆశ్రితభక్తుల నను గ్రహించుచున్నారు శ్రీవాదిరాజతీర్థస్వామి శ్రీహయగ్రీవ దేవుని అనన్యభక్తితో ఆరాధించెను నిత్యము ప్రసాదము నొకపళ్ళెరములో నుంచి శ్రీవాదిరాజతీర్థస్వామి శ్రీహయ గ్రీవునకు అర్పించెడివారు శ్రీహయగ్రీవుడు హయరూపమున నరుదెంచి ఆప్రసాదమును స్వయముగ స్వీకరించి భక్తునకై భుక్తశేషమును మిగిల్చెడివాడు ఆ ప్రసాదమునుమాత్రమే ఆరగించి శ్రీవాదిరాజతీర్థస్వామి జీవనమును సాగించెడివారు కొందఱు దుర్మార్గులు శ్రీస్వామివారిని సంహరించుటకు ప్రసాదములో కాలకూటవిషమును కలిపిరి ప్రసాదములో విషము మిళితమై యున్నదనిదెలియక శ్రీతీర్థులు ఆప్రసాదమునే స్వామి కర్పించెను శ్రీహయగ్రీవస్వామి హయరూపమున నరుదెంచి ఆప్రసాదమును స్వీకరింపక నేలపై బడవైచి భంగ మొనరించెను భక్తు నెదుట సాక్షాత్కరించి జరిగినవిషయము దెలిపి దుష్టులను శిక్షించెను శ్రీవాదిరాజతీర్థస్వామి ననుగ్ర హించి అంతర్హితుడయ్యెను శ్రీహయగ్రీవదేవుని సాక్షాత్క

రింపజేసికొన్న శ్రీవాదిరాజతీర్థస్వామి భావికల్పములో వాయు దేవునిగ ఆవిర్భవింపగల డని అపరోక్షజ్ఞానులు నొక్కి-వక్కాణించుచున్నారు

రెండవమహాత్ముడే శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ఈమహా పురుషుడు నేటికిని మంత్రాలయాంతర్గతబృందావనములో విరాజిల్లుచు తన్నాశ్రయించిన భక్తులతాపత్రయములను బాపు చున్నారు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి శ్రీకృష్ణభగవానున కనన్య భక్తులు, అఖండశ్రీమూలరామారాధకులు తనవివిధావ తారములలో సముపార్జించిన అఖండము, అనిష్టము నగు పుణ్యమును ఆశ్రితభక్తుల కొసంగి పుణ్యక్షయమొనరించుకొని పరంధామమునకు మఱలిపోవుటకే శ్రీవారు మంత్రాలయాం తర్గతబృందావనములో నేంచేసియున్నారు అవిచ్ఛిన్నముగ దానమొనరించిన ఆపరమభాగవతోత్తమునియనిష్టపుణ్యరాశి ఏడువందల సంవత్సరములకుగాని తరుగదు కావున శ్రీరాఘ వేంద్రతీర్థస్వామి బృందావనముననే యుండి పుణ్యదానము చేయుచు పుణ్యక్షయానంతరము దివ్యపరంధామమునకు వెడలి పోగలరు

# షెహజాదా పునర్జీవితుడగుట

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తమయాత్రామపరివారమును తోడ్కొని ఆశ్రమస్థాపనకు అనువైనప్రదేశమును వెదకుటకై కుంభకోణమునుండి బయలుదేరిరి. వారు హుబ్లీనగరమును జేరిరి. హుబ్లీప్రదేశమత్యంతసుందరము. ఫలవృక్షములతో, ఉద్యానవనములతో, పచ్చనిపంటపొలములతో, స్వచ్ఛజలాశయములతో నిండి భూతలస్వర్గమువలె నుండెను. ఆప్రదేశములోనే కృష్ణపుర మనుగ్రామము కలదు. ధార్వారుప్రాంతమంతయు సవణూరునవాబు పాలనలో నుండెను. కృష్ణపురములో నవాబు ఒకసుందరోద్యానవనమును నిర్మించి దానిలో వసంతమహాలును కట్టించెను. నవాబు వేసవికాలములో ఈవసంతమహాలులోనే కుటుంబసహితముగ నివసించును.

అది మండువేసవి. శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తనపరివారముతో పయనించుచు నవాబుయొక్క ఉద్యానవనమునకు అపరాహ్ణ వేళ అరుదెంచిరి. మఠపరివారము విడిదిచేయుటకనువైనప్రదేశమును వెదకుచు నవాబుయొక్క ఉద్యానవనమందులకు దగినదనిభావించి దానిలో ప్రవేశించెను. శ్రీరాఘవేంద్రస్వామి యెట్టిసంకోచమును లేక తన పరివారముతో ఉద్యానవనప్రవేశముచేయుచుండగ వనరక్షకు లడ్డగింపక ఆయనదివ్యరూపమును వీక్షించుచు నిలువబడిరి, ఆమహాత్ముని తేజోమయవిగ్రహమును గాంచి మహమ్మదీయసైనికు లత్యం

తాశ్చర్యచకితులైరి కాని యెందులకో వారిముఖము లన్నియు గ్లానిచెందియున్నవి వారందరు చింతాక్రాంతులై దీనులై గోచరించిరి

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ఒకవిశాలవటవృక్షచ్ఛాయలో ఆసీనులు కాగా పరివారము పూజకొఱకు ప్రసాదము కొఱకు నేర్పాటుగావింపసాగిరి ఆవసంతమహాలులో విడిదిచేసియున్న నవాబు ఆయనభార్య ఉద్యానవనములో నుండి వచ్చుచున్న శబ్దములను విని మహాలుపై భాగమునుండి వీక్షించిరి ఉద్యాన వనములోని వృక్షములను స్పృశింపక తమనితారాధనా కృత్యములలో సంలగ్నులైన వైష్ణవులను గాంచిరి వటవృక్ష చ్ఛాయలో ఆ సనుడై యున్న స్వామినిగాంచి ఆతడుసామాన్యుడు కాడని య ంద్రులని గ్రహించిరి ఆసమయమున వారు తమ ఏకైకపుత్రుడు మరణింపగా అపారదుఃఖసాగరములో నిమగ్నులై యుండిరి ఈమహాత్ము నాశ్రయించిన తమ పుత్రవియోగ దుఃఖము ఉపశమింపగల దని భావించి ఆ దంపతులు మహాలును వీడి ఉద్యానవనమున కేతెంచి శ్రీవారి కనేక సలాము లర్పించి దుఃఖింపనారంభించిరి అపారదుఃఖముతో విషణ్ణవదనులై తనసమక్షమున నిలువబడియున్న నవాబు దంపతులను గాంచి శ్రీవారు వారిని పుత్రపౌత్రాభివృద్ధి రస్తు యని ఆశీర్వదించి, వారిదుఃఖమునకు కారణ మడిగిరి స్వామి వారియాశీర్వచనము నాలకించి, వా రమితగ దుఃఖితులై

దు ఖాశ్రువులు కారుచుండగ నవాబు స్వామితో నిట్లువిన్న వించుకొనెను "అల్లాహ్ కే బందా ! నే నీరాజ్యమునకు ప్రభువును, నా కెందఱో బేగములు (రాణులు) కలరు కాని నాకు ఒక్కడే కుమారుడు కలడు అతడే షెహజాదా ఈసామ్రాజ్యమున కతడేఉత్తరాధికారి వేసవికాలమును చల్లని ప్రదేశ మైనయీవసంతమహాలులో ఆహ్లాదముగ గడుపవలె నని టశితోను రాజకుమారునితోను గలసి ఈమహా లున కఱుదెంచితిని మహాత్మా ! అల్లాకరుణ నాపైనుండి తొలగిపోయెను నిన్నటిదినమున ఉద్యానవనములో ఆటలాడు చున్న మాచిన్నారి షెహజాదా పాముకాటుకు గుఱియై విలవిల లాడుచు అసువులను బాసెను మాహ ముకూడ అతడు మరణించెననినిర్ణయించెను తదనంతరమీాయుద్యానవనములోనె వానినిసమాధిచేసితిమి మే మందఱము అపారదు ఖసముద్ర మున మునిగియున్నాము అల్లాప్రతినిధు లైనమీామాట (ఆశీర్వచనము) పొల్లుపోవునా ? యనిపల్కి రాజుయతని పరివారము దుఃఖింప నారంభించెరి

శ్రీ రాఘవేంద్ర తీర్థస్వామి నవాబు పల్కిన పల్కులు నాలకించి ఒకక్షణము మౌనము వహించి రాజా ! యే మైన నేమి మాశీర్వచనము వ్యర్థముకాదు సర్వేశ్వరేశ్వరుడు నిన్ను కరుణించెను మీాషెహజాదా మరణింపలేదు వాని శరీరమును తక్షణమే సమాధినుండి వెలుపలికి దీయు డని పల్కెను

శ్రీవారియమృతవచనముల నాలకింపగనే నవాబు బీగము, వారిపరివారము ఆప్రదేశమందు సమావేశమైయున్న సకల జనులు పరమాశ్చర్యచకితులైరి నవాబు దుఃఖమంతయు మటుమాయమయ్యెను అల్లాయే ఈయతీంద్రుని స్వరూపమున అఱుదెంచినాడనిభావించి నవాబు కొందఱిసేవకులసాహాయ్యముతో తనకుమారుని సమాధిని త్రవ్వి మృతదేహమును దెచ్చి శ్రీవారిచరణములచెంత నుంచెను ఆప్రదేశమున వారందఱు ఈమృతశరీరము మఱల సజీవమగుట సంభవమా యని చింతింప నారంభించిరి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ఆసనమునుండి లేచి కమండలములోని గంగాజలమును హస్తమునం దిడుకొని శ్రీకృష్ణ మహామంత్రపూతము లైనమంత్రాక్షతల నాజలములందు జేర్చి గరుడమంత్రమును పఠించుచు ఆదిశేషుని ధ్యానించినవాడై ఆమంత్రాక్షతలను షెహాజాదాశవముపై జల్లెను ఆహా! ఏమి ఆశ్చర్యము! మంత్రజలస్పర్శచే ఆమృతదేహము పునర్జీవనమును బొంది ఉచ్ఛ్వాస, నిశ్వాసల నొనరించుచు నిద్రమేల్కాంచినవానివలె కళ్ళుదెఱచి చూచెను ఈహఠాత్పరిణామమునకు ఆప్రదేశమున సమావిష్టులైయున్న సకల జనులు అమితాశ్చర్యముతో ఆనందమును బట్టలేక భగవద్భక్తునిమహిమలను వేనోళ్ళ కీర్తించిరి. నవాబు తాను రాజు నన్నవిషయము మఱచి ఆనందోత్సాహముతో నృత్యమొనరించెను రాజు, రాణి తదితరపరివార మంతయు ఆనేక

పర్యాయములు శ్రీవారికిసాష్టాంగదండప్రణామముల నర్పించిరి వారందఱు సజలనయనములతో 'మహాత్మా ! మీరే మాకు నిజమైనతండ్రి మాషెహజాదాకు ప్రాణదాన మొనఱించి నారాజ్యమును గాపాడిరి ఇందులకు మేము మీ కేమి ప్రత్యుపకారము జేయగలవారము అని యనేకవిధముల వేడుకొనిరి

నవాబు అనేకనజరానాలను, ధనమును, స్వామివారి కర్పించి స్వీకరింపవలసినదిగా ప్రార్థించిరి అంతటితో నాతడు తృప్తి చెందక వసంతమహాలును, ఉద్యానవనమును, కృష్ణపుర గ్రామమును ఇంకను తదితర గ్రామములను శ్రీవారి కర్పించు కొని తనయమితానందమును వ్యక్తపరచెను నాటినుండి నవాబు స్వామివారిశిష్యుడై ఆయనసేవల నొనరించి చరితార్థు డయ్యెను కొన్నిదినములు తనపరివారముతో శ్రీవారు వసంత మహాలునందే యుండి నవాబుసేవలను స్వీకరించి మఱల ప్రయాణమునకు సిద్ధమైరి నవాబు, ఆయన రాణులు, షెహజాదా, తదితరపురవాసు లందఱు సజలనయనములతో స్వామివారికి వీడ్కోలు నొసంగిరి

భగవంతునికన్న భగవద్భక్తుడే మహిమాన్వితుడు శ్రుతులకుగూడ అగోచరుడైనయాపరబ్రహ్మము సచ్చిదానంద విగ్రహుడై భక్తాధీనుడై యుండును కావుననే పరమ

భాగవతోత్తముడైన శ్రీరాఘవేంద్రతీర్థస్వామి సంకల్ప మాత్రముచేతనే మరణించిన షెహజాదా పునర్జీవితుడైనాడు. నేడు కృష్ణపురము తదితరగ్రామము లన్నియు శ్రీవారి ఆశ్రమాధీనములో లేవు. 1857 వ సం॥న ఆప్రాంతపునవాబు ఈగ్రామములను బ్రిటీషుఇండియావారికి సంక్రమింపజేసెను.



# ఆ శ్రి త జ న ర క్ష ణ ము

శ్రీరాఘవేంద్రతీర్థస్వామిదివ్యపాదారవిందముల నాశ్రయించినవారిచెంత మృత్యువైనను తలవంచక తప్పదు. కృష్ణపురమునుండి బయలుదేరి శ్రీవారు తమపరివారముతో పయనించుచు గదక్ తాలూకాలోని కిరీటగిరి యనుగ్రామమును జేరిరి, ఆ గ్రామములో నివసించియున్న గ్రామాధికారి వెంకటదేశాయి శ్రీవారిభక్తుడు, మహాధనవంతుడు. ఆగ్రామమునకేగాక ఆతాలూకాకుకూడ అతడు అధికారి. ఆతడు శ్రీవారికి స్వాగతము బల్కి పరివారముతోపాటు గురుదేవులకు తనగృహములోనే ఆతిథ్యము నొసంగెను. స్వామివారి యాగమనవార్తను గ్రామములకుకూడ దెలియబరచి ప్రజ

లందఱిని స్వామివారిని దర్శించుటకు, తనయాతిథ్యమును స్వీకరించుటకు నాహ్వానించెను మఱుసటిదినముననే ఆయుత్స వమును తిలకించుటకు అశేషముగ ప్రజలు వెంకటదేశాయి ముని గృహమును జేరిరి వెంకటదేశాయి స్వామివారిపూజా రాధనలకు సమస్తమును సిద్ధమొనరించి వచ్చిన జనులకు సమారాధన మొనరించుటకు సంభారములను సిద్ధము జేయు చుండెను అదిమామిడిపండ్లకాలము ఆగృహస్థు అసంఖ్యాక ముగ పండినమామిడిపండ్లను దెప్పించి వాటిరసమును దీయించి భోజనములో వడ్డించుటకు ఒకపెద్దగంగాళములో పోయించి గదియందుంచెను భార్యాభర్త లిద్దరు స్వామివారికి సేవల నొనరించుటలో సమారాధనమునకు సంబంధించిన ఏర్పాట్లలో ఉదయమునుండి లగ్నమైయుండిరి వారికి రెండుసంవత్సరముల వయస్సుగల్గిన కుమారుడు కలడు ఆబాలుడు అడుకొనుచు మామిడిపండ్లరసమును పోసియుంచిన గదిని ప్రవేశించు బా చాపల్యముచే గంగాళములో తొంగిచూచుచుండగా కాలుజా దానియందు బడి మరణించెను ఎవరిపనులలో వారు సంలగ్ను లైయున్నకారణమున ఈదారుణసంఘటనను నెవరుగుర్తింపలేక పోయిరి ఉదయమునుండి కుమారుని గానక తల్లి గృహ మంతయు వెదకి తుదకు తనభర్తకావిషయమును దెల్పెను ఆయనకూడ తనకు దెలియదనిపల్కి పత్నితోగూడి వెదక నారంభించెను తుదకువారు గదిలోనిగంగాళములో బడి

మరణించిన తనకుమారుని గాంచి కింకర్తవ్యతావిమూఢు లై అపారదుఃఖపారావారమున బడిరి

అంతదు ఖములోగూడ ఆమాతృమూర్తి ధైర్యముతో గదితలుపులను మూసి తనభర్తతో నిట్లు బల్కెను "నాథా! ఇప్పుడు మన మేమిచేయవలెను? ఎందఱో బ్రాహ్మణులు కుటుంబసహితముగ భుజించుటకు సిద్ధముగ నున్నారు గురుదేవులు పూజల నొనరించుచున్నారు ఇపు డీమరణ విషయము బహిర్గత మైనచో భుజింపక అందరు మఱలి పోయెదరు ఈ యపరాహ్నవేళలో స్వామి తమశిష్యులతో గూడ మనగృహమును వీడిపోవలసివచ్చును గతించిన తనయుడు తిరిగిరాడు మన మీవిషయమును వెల్లడింపక అందఱిభోజనములు పూర్తియగువరకు ఓపికపట్టవలెను తదనంతరమే మనపుత్రవియోగదుఃఖమును వెల్లడిచేయవచ్చును"

భార్య పల్కిన ధైర్యవచనముల నాలకించి భర్త ఆశ్చర్యచకితు డయ్యెను సజలనయనములతో భార్యను పొగడుచు, 'దేవీ! నాకు నీవు భార్యవుమాత్రమే కావు, నీవు నాగృహదేవతవు! మాటలలోను, చేతలలోను నేను నిన్నే అనుసరించెద' నని బల్కెను ఆక్షణముననే వారిర్వురు మామిడిరసమునుండి మృతబాలకుని దీసి బాగుగా కడిగి ఒక గుడ్డలోచుట్టి ఆగదిలోనే ఉంచి తలుపులను మూసివేసిరి సమారాధనము జరుపుటకు శ్రీవారియారాధనము నిర్వి

ఘ్నముగ నెఱవేర్చుటకు తనముఖ్యబంధువులను, గుమస్తాలను వినియోగించి వారు దూరముగ నుండిరి పూజ ఆరాధన ముగిసెను శ్రీవారు తీర్థప్రసాదముల నొసంగుసమయ మాసన్న మయ్యెను స్వామి గృహయజమాని కొఱకై అటునిటు భృత్యులను సాకించిరి స్వామివారియంతరంగమును దెలిసికొని ఉద్యోగి హస్తములను ముకుళించి స్వామీ! మాయజమాని యజమానురాలు ఒకముఖ్యమైనపనివలన గ్రామములోనికి బోయిరి వారు మఱలి వచ్చుటకు చాలకాల మగును, కావున దయతో తమరు ఆహూతులైన వారందఱకు తీర్థప్రసాదముల నొసంగుడు తదనంతరము సమారాధనముజరుగగలదు బహుశః మాయజమానులు సమారాధనానంతరమే మిమ్ము లను దర్శింపగలరనిబల్కెను

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి క్షణ మాలోచించిరి అంతర్జ్ఞునకు సర్వము విదితమైనది స్వామి యజమానిని, యజమానురాలిని తత్క్షణమే పిలిపింపవలసినదిగ ఆజ్ఞాపించెను విషయమును దెలిసికొని గత్యంతరములేక ఆ దంపతులు మఱల గృహమును ప్రవేశించి స్వామివారికి మౌనముగ ముకుళితహస్తములతో విషణ్ణవదనులై నిలువబడిరి సర్వము దెలిసిన స్వామి 'వెంకటదేశాయి! ఏల నీ విట్లు విచిత్రముగ ప్రవర్తించుచున్నావు! భగవంతునితీర్థప్రసాదములను వదలి నెందులకు దూరముగ నున్నావు? సత్యమును

వచింపు మని బల్కెను గురుదేవుని యాజ్ఞను శిరసావహించి ఆతడు 'మహాత్మా! నాకుమారుడు మామిడిపండ్లరసము గల గంగాళమునందు బడి మరణించినాడని విన్నవించి దుఃఖింప నారంభించెను అపుడు శ్రీవారు 'ఓహో! అదియా నీవు మానుండి దూరముగ నుండుటకు కారణము! నీకుమారుడు మరణింపలే దనిమే మనుచున్నాము వాడెక్కడ? వానిని తక్షణమే నాసమ్ముఖమునకు దోడ్కొనిరమ్మని ఆజ్ఞాపించెను

స్వామివారి అభయవచనము నాలకింపగనే బ్రాహ్మణ దంపతులు తమపుత్రుడు జీవించినట్లే భావించి తక్షణమే బాలకునిశవమును తెచ్చి శ్రీవారిపాదములచెంత నుంచిరి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ధన్వంతరీస్తోత్రమును పఠించి శ్రీకృష్ణ మహామంత్రజప మొనరించుచు తనకమండలములోని గంగా జలమును హస్తమునం దిడుకొని మృతశిశువుపై జల్లిరి తక్షణమే బాలకుడు పునర్జీవితుడై అటునిటు కదలుచు నడ యాడసాగెను ఈమహావిచిత్రమును గాంచిన సకలప్రజలు పరమాశ్చర్యచకితులై స్వామివారిదివ్యమహిమను వేనోళ్ళ కీర్తించిరి బ్రాహ్మణదంపతు లానందముతో మైమరచి నృత్యే మొనరించిరి మఱల తమబిడ్డకు పునర్జన్మ గల్గిన దనిభావించి యా దంపతులు తమకుమారుని శ్రీవారిచరణములచెంత నుంచి అనేకసాష్టాంగదండప్రణామము లర్పించిరి కృతజ్ఞతను జెప్పుట కైనను వారికి మాటలు పెగలలేదు, కేవలము నయనముల

నుండి ఆనందాశ్రువులను ప్రవహింపజేయుచు ముకుళితహస్త ములతో వినీతులై స్వామి నారాధించిరి శ్రీవారు తీర్థప్రసాద ము లందరికి నొసంగి పూజాకార్యక్రమమును ముగించిరి ఆహూతులైన ప్రజ లందరు సమారాధనలో పాల్గొని శ్రీరాఘ వేంద్రతీర్థస్వామి దివ్యమహిమలను బొగడుచు ఆయన కనేకసాష్టాంగదండప్రణామముల నర్పించి తమతమగ్రామములకు జనిరి స్వామివారు - దంపతుల గృహములో కొన్ని దినము లుండి తదనంతరము కిరీటగిరిగ్రామమునుండి బీజాపుర మునకు బయలుదేరిరి

— ० —

## అగ్నిదేవుడు కంఠాభరణమును దెచ్చియిచ్చుట

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తనపరివారముతో పయ నించుచు బీజాపురసామ్రాజ్యమును ప్రవేశించి ఒకగ్రామములో విడిదిచేసిరి బీజాపురనవాబుకు శ్రీరాఘవేంద్రస్వామిమహాత్మ్యము బాగుగా దెలియును ఆ మహాత్ముడు తనరాజ్యమున కేతెంచి

నని దెలిసికొని యెంతయో సంతోషించి స్వాగతముబల్కుటకు తనవజీరులను నజరానాలతో బంపెను శ్రీరాఘవేంద్రతీర్థ స్వామి సామాన్యుడైన సన్యాసి కాడని పీడితమానవుల నుద్ధరించుటకే జన్మించిన మహాత్ము డని దెలిసికొని నవాబు ఛత్ర చామరములను అనేకసువర్ణాభరణములను, జాతిరత్నములతో నిర్మింపబడిన కంఠాభరణమును నజరానాగా బంపెను స్వామి పాదుషా పంపిన నజరానాలను స్వీకరించి కంఠాభరణమును సీతమ్మకు బంపెద నని వచించి పాదుషా నాశీర్వదించిరి కంఠాభరణసమర్పణోత్సవమునకు వజీరులు హాజరుగా నుండవలసినదిగ స్వామివా రాదేశించిరి పూజాసమయములో శిష్యులు అగ్నిగుండము నేర్పరచిరి శ్రీవారు దివ్యమంత్రముల నుచ్ఛరించుచు సీతామాతకు జేర్చవలసినదిగా అగ్ని నాదేశించి కంఠాభరణమును హోమగుండమందు బడవైచిరి ఈవిచిత్రమును గాంచి వజీరులు స్వామివారు తమను, తమపాదుషాను అవమానించి రనిభావించి పాదుషాకు జరిగినదంతయు విన్నవించిరి బీజాపూరునవాబు ఈవిషయ మాలకింపగనే స్వామివారు తన్నవమానించె ననిభావించెను అతడు కుపితుడై స్వామివారు మహాత్ము డని దెలిసినందువలన ఏమియు జేయజాలక యుక్తితో స్వామి నవమానింపవలె ననిభావించెను. మఱుదినమే ఒక కుతంత్రమును వజీరునకు బోధించి నవాబు వానిని స్వామిచెంత కంపెను వజీరు స్వామివారివిడిదిని జేరి అనేకసలాములర్పించిన

వారై మహాత్మా! తాము అగ్నిద్వారమున సీతమ్మ కర్పించిన కంఠాభరణమును తెప్పించి మాదిరికొఱకు ఇప్పించవలసినదిగా మా ప్రభువు ప్రార్థించుచున్నారు వారి రాణులలో ఒకరికి యిట్టి కంఠాభరణమే కావలయునట వస్తువు చూపనిదే స్వర్ణకారుడు ఆకంఠాభరణమును తయారుజేయజాలడు కావున తమరు దయతో కంఠాభరణమును తెప్పించి యిచ్చిన స్వర్ణకారునకు మాదిరిగ జూపి మఱల మాకు సమర్పింపగల మనివిన్నవించు కొనెను

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి క్షణములో సర్వమును గ్రహించి చిరునవ్వుతో పూజాసమయమువఱకు వేచియుండుము, అగ్నిదేవునిద్వారమున కంఠాభరణమును దెప్పించి యిచ్చెద నని వజీరుతో బల్కిరి పూజ ప్రారంభమయ్యెను అగ్నికుండము ప్రజ్వలింపబడెను శ్రీవారు అగ్నిదేవమంత్రమును పఠించుచు తాను సీతమ్మ కర్పించిన కంఠాభరణమును తోడ్కొనిరావలసి నదిగ అగ్నిదేవుని ప్రార్థించెను తదనంతరము జ్వలించుచున్న అయ్యగ్నికుండములో తనహస్తము నుంచి కంఠాభరణమును దీసి వజీరున కొసంగెను స్వామి నవమానింపవలె నని యోచించిన వజీరునకు ఈవిచిత్రమహిమ పరమాశ్చర్యముగ గోచరించెను అతడు కంపించుచు స్వామివారి పాదములపై బడి అనేక వందనముల నర్పించి కంఠాభరణమును గైకొని రాజధానికి మఱలివచ్చి నవాబునకు జరిగినదంతయు విన్నవించెను నవాబు

తనమూర్ఖత్వమున కెంతయో చింతించి భయభ్రాంతుడై కంఠాభరణమును దోడ్కొని మఱల అనేకనజరానాలతో సపరివారముగ స్వామివారిచెంత కేతెంచి అనేకసలాముల నర్పించి తనయజ్ఞానమును మన్నింపవలసినదిగ ప్రార్థించెను పశ్చాత్తప్తహృదయు డైనననాబును సహజక్షమాశీలసంపన్ను లైనశ్రీస్వామివారు క్షమించి అత డర్పించిన నజరానాలను స్వీకరించెను

— ం —

## మంచాల

కృతయుగములో మహాదైత్యు డగుహిరణ్యకశిపుడు అఖండతపస్సు ద్వారమున స్రష్ట యైనబ్రహ్మదేవు నారాధించి అప్రతిహతము లైనవరములను బొంది అజేయుడై త్రిభువనములను జయించి భారతవర్షమున తనరాజధానిని స్థాపించెను నేటియాంధ్రప్రదేశమందు గల అహోబిలప్రాంతము హిరణ్యకశిపుని నివాసస్థానమైయుండవచ్చును అహోబిలపర్వతముపై శ్రీలక్ష్మీనృసింహదేవుని ఆలయము కలదు స్వామిఒక స్తంభము నుండి బయల్వెడలినట్లు నేటికిని దర్శనమొసంగుచున్నాడు

ఆ ప్రదేశమే హిరణ్యకశిపుని రాజాస్థానము ప్రహ్లాదుని వాక్యములు సత్యములని నిరూపించుటకు శ్రీహరి ఆక్షణమున బ్రహ్మాండములోని ప్రత్యణువునందు శ్రీనృసింహ రూపమున విరాజిల్లెను ఆయన రాజాస్థానముఖ్యభాగములో గలస్థంభమునుండి బయల్వెడలి హిరణ్యకశిపుని సంహారించి ప్రహ్లాదు ననుగ్రహించెను నేడా ప్రదేశ మంతయు అరణ్యప్రాంతముగనున్నది

హిరణ్యకశిపుని మరణానంతరము శ్రీలక్ష్మీనృసింహ భగవానుడు ఆదైత్యేశ్వరుని సింహాసనము నలంకరించి దానిని పరమపవిత్ర మొనరించి ప్రహ్లాదుని తనయొడిలో గూర్చుండ బెట్టుకొని రాజ్యాభిషేక మొనరించెను ప్రహ్లాదచక్రవర్తి విరాగియైనను భగవంతుని యాజ్ఞానుసారముగ సామ్రాజ్యమును స్వీకరించి బహుకాలము ధర్మమును దప్పక పరిపాలించెను ఆమహామనీషి అసంఖ్యాకముగ రాజసూయయాగములను, అశ్వమేధయజ్ఞములను నిర్వహించెను దక్షిణభారతదేశములో ప్రవహించుచున్న పవిత్రతుంగభద్రానదీతీరమున ప్రహ్లాద చక్రవర్తి సక [illegible] ను నిర్వహించెను నేడాప్రదేశ మునే మంత్రాలయ మనిభక్తజనులు కీర్తించుచున్నారు ప్రహ్లాదుడేప్రదేశములో ఆసీనుడై మహాపుణ్యప్రదము లైన యజ్ఞముల నొనరించెనో ఆప్రదేశమందే శ్రీరాఘవేంద్ర స్వామి దివ్యబృందావనములో విరాజిల్లుచు అనిష్టబుణ్యాములను తన్నాశ్రయించినభక్తులకు అవిచ్ఛిన్నముగ ప్రసాదించు

చున్నారు ఆప్రాంతమునే 'మంచాల' యందురు కృతయుగములో సకలవిభూతులకునిలయమైన ఆమహాపట్టణము నే ఒక గ్రామముగ నున్నది ఈగ్రామమందు మ్మ' యను గ్రామదేవత కలదు కృతయుగములో కూడ ఆశక్తి హిరణ్యకశిపునకు ఆరాధ్యదేవతయై విరాజిల్లెను ఆమె వారిగృహదేవత, ఆమెవిరాజిల్లియున్న పవిత్రప్రదేశము కావుననే ఆప్రాంతమును మంచాల యందురు నేటికిని మంత్రాలయము లో మఠముఖద్వారములో మంచాలమ్మమండపము కలదు క్రీ శ 1960 సం॥లో శ్రీసుయమీంద్రతీర్థస్వామి శ్రీరాఘవేంద్రతీర్థులబృందావనమునకు చేరువలో మంచాలమ్మకు చక్కని దేవాలయమును నిర్మించిరి మంత్రాలయప్రదేశ మాంతయు భక్తవరేణ్యుడైనశ్రీప్రహ్లాదరాజేంద్రునకు కర్మభూమి, యజ్ఞభూమి యయ్యెను నాటి ప్రహ్లాదుడే నేటి శ్రీ రాఘవేంద్రతీర్థస్వామి విశాలపర్వతములవలె తాను సముపార్జించిన తన యనిష్టబుణ్యములను దాన మొనరించుటకు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి బృందావనములో నేటికిని సజీవులై తన్నాశ్రయించిన భక్తులకు దర్శన మొసంగి వారిని భవబంధవిముక్తుల గావించు చున్నారు

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి దక్షిణమున పయనించుచున్న కాలములో ఆమంచాలప్రాంతము అసదుల్లాఖాన్ అనుమహమ్మదీయునిపరిపాలనలోనుండెను శ్రీస్వామివారి యనుగ్రహమునకు

బాల్యతుడైన వెంకన్న యను అనాథబ్రాహ్మణబాలకుడే స్వామి వారియాశీర్వాదబలముచే నాడు ఆ రాజ్యమునకు దివానుగ నియమింపబడియుండెను

శ్రీస్వామి బిజాపూరురాజ్యమునుండి బయలుదేరి ప్రయాణమొనరించుచు పరివారసహితముగ ఆదోనిని సమీపించిరి ఆదోనిప్రాంతమునకు దివానుగ నున్న వెంకన్నకు స్వామి వారి యాగమనవార్త తెలిసెను ఆభక్తుడు పరివారసహితుడై పాదచారిగ బయలుదేరి తనగురుదేవునకు రాజోచితముగ స్వాగతమును బల్కెను శ్రీస్వామియొక్క దివ్యమంగళరూపము గాంచి పులకితగాత్రుడై అశ్రుపూర్ణనయనములతో అనేకదండ ప్రణామముల నర్పించెను స్వామిదివ్యపాదస్పర్శచే వెంకన్న పంక్తులు చరితార్థుడయ్యెను శ్రీరాఘవేంద్రస్వామి తన చరణముల నాశ్రయించినశిష్యుని లేవనెత్తి ఆశీర్వదించిఅనుగ్రహించి మంత్రివర్యా? కుశలమా! యనిరి అపుడు వెంకన్న 'గురుదేవా! మంత్రి యెవరు? నేను మీదాసానదాసుడను, మీచరణారవిందముల నాశ్రయించిన భక్తుడ న పల్కి తనభక్తిప్రపత్తులను ప్రదర్శించెను గురుదేవా! నే ననాథను, విద్యాగంధము లేని మూఢుడను మీయనుగ్రహమువలన నేను అపారవిద్యావంతుడనై పరిషియాభాషలో నున్న అసదుల్లాఖానునిరాజపత్రమును పఠించుటచే నేడు ఈరాజ్యమునకు మంత్రినైతిని ఈసౌభాగ్యమంతయు తమకృపా పసాద మని జరిగినవిషయము నంతటిని

వెంకన్నపంతులు శ్రీతీర్థులవారికి విన్నవించుకొనెను గురుదేవుని పరివారసహితముగ తనగృహమునకు దయచేయుడని వెంకన్న ప్రార్థింపగా స్వామివా రంగీకరించి వెంకన్న గృహమును పావన మొనరించిరి శ్రీతీర్థులవారు వెంకన్న కతిథియై ఆయనగృహ ప్రాంగణములో నిత్యారాధనల కేర్పాట్లుచేయవలసినదిగ శిష్యుల నాజ్ఞాపించిరి పీఠాధిపతి యైనసన్యాసి ప్రతినిత్యము భగవదారాధన మొదలగునవి విధిగ నిర్వర్తింపవలెను వెంకన్న పంతులు శ్రీతీర్థులవారి కనన్య శిష్యుడై తనహోదానుసైతము మఱచి సామాన్యభృత్యునివలె గురుకార్యములందు నిమగ్ను డయ్యెను

వెంకన్నపంతులు ప్రతిదినము సత్సంగమున కేర్పాట్లుచేసి ప్రజ లందఱిని పాల్గొనవలసినదిగ ఆహ్వానించెను దూరప్రాంతములనుండి అరుదెంచు భక్తులకు, స్థానికముగ పాల్గొను ప్రజలకు ఉచితముగ ఆహారవ్యవస్థ నొసరించెను విశాలమైనచలువ పందిళ్ళను నిర్మించి ఒకసమున్నతవేదికపై పీఠమును మూలవిగ్రహములను విరాజిల్లచేసెను

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ప్రతినిత్యము ఆశ్రమమూల దైవములకు స్వయముగ పూజల నొనరించెడివారు ఆదృశ్యము చూపరుల కత్యంతాహ్లాదకరము, సకలపాపవినాశకము, భగవ క్తిప్రదాయకము నై యుండెను ఈమహోత్సవమును గాంచుటకు ప్రజ లసంఖ్యాకముగ వచ్చెడివారు ఈభూరాధనామహో

త్సవములో శ్రీమూలరామారాధన మత్యంత యుత్కృష్టముగ నుండెను శ్రీమూలరామస్వామి త్రేతాయుగములో శ్రీరామ చంద్రమూర్తినుండి ఆవిర్భవించెను ఈపావనచరితము సకల బవబంధహారము నిర్మలభక్తిజ్ఞాన వైరాగ్యప్రదము



# శ్రీ మూలరామ చరితము

అది సత్యయుగము సనకసనందనాదులచే శపింపబడి జయవిజయు లనుపార్షదులు వైకుంఠమునుండి దిగివచ్చి అవనిపై జన్మించిరి విరోధభావములో మూడుజన్మలలోనే నన్ను జేర గల రని శ్రీహరి జయవిజయులకు అభయ మొసంగెను వారే మొదటి జన్మలో హిరణ్యాక్ష హిరణ్యకశిపు లైరి శంఖు డను శ్రీహరిపార్షదుడు బ్రహ్మదేవుని ఆదేశానుసారముగ అవ నిపై హిర శిపుని కుమారు డై నప్రహ్లాదునిగ అవతరించెను హిరణ్యాక్ష . రణ్యాకశిపులు భేద మనెడు ఆరాధన ద్వారమున భగవంతునిచే నిహతులై త్రేతాయుగములో రావణకుంభ ర్ణు లుగ జన్మించిరి ప్రహ్లాదుడు శ్రీలక్ష్మీనృసింహస్వామి కృపకు పాత్రుడై సకలభువనములకు చక్రవర్తియయ్యెను హిరణ్యాకశిపుని

వధానంతరము శ్రీఉగ్రనారసింహస్వరూపు డైన శ్రీహరి హిరణ్యకశిపునిసింహాసనము నధిష్ఠించి దానిని పవిత్రమొనరించి బాలప్రహ్లాదుని సకలసామ్రాజ్యాధినేతగ నభిషేకించెను. చక్రవర్తి యైనప్రహ్లాదుడు రాజోచితము లైనయజ్ఞయాగాది కర్మల నొనరించి అఖండపుణ్యమును సముపార్జించెను. పుణ్యము కూడ జీవునకు మరల జన్మను సంప్రాప్తింపజేయును. కావున తనయనిష్ట పుణ్యావశమున పరమభక్తాగ్రేసరు డైనప్రహ్లాదుడు రావణకుంభకర్ణులకు తమ్ముడై జన్మించి విభీషణు డనునామ ధేయమున ప్రసిద్ధిగాంచెను.

భక్తులకు తా నొసంగిన వరములను నెరవేర్చుటకై ఆశ్రీమన్నారాయణుడే రావణకుంభకర్ణాదులను అనుగ్రహించుటకు అవనిపై దశరథరాజనందను డనబడు శ్రీరామచంద్రునిగ నవతరించెను. శ్రీరామకథామృతమును గ్రోలనివారు పవిత్ర భారతవర్షములో ఉన్నారనుట కేవలము విడంబనమే కాగలదు.

రావణవధానంతరము శ్రీరామభద్రుడు సీతాలక్ష్మణ సహితుడై సకలవానరపరివారముతో విభీషణుడు వెంటరాగా అయోధ్యానగరమును జేరెను. పదునాల్గు సంవత్సరములు శ్రీరామవియోగమును అనుభవించిన అయోధ్యావాసులు పరమానందభరితులై మహోత్సవముల నొనరించిరి. శ్రీరామ పట్టాభిషేకమును ప్రజలు పరమానందభరితులై తిలకించిరి. మహోత్సవానంతరము లంకాధిపతి యైనవిభీషణుడు రామ

భద్రుని కళ్యాణమూర్తిని గాంచి లంకానగరమునకు మరలి పోలేక స్వామిచరణారవిందములచెంతనే జీవితమును గడుపవలె నని సంకల్పించుకొనెను శ్రీరాముడు "ప్రజలను పరిపాలించుట నీకర్తవ్యము కావున లంకానగరమునకు బయలుదేర" మని విభీషణు నాదేశించెను అపుడు విభీషణుడు "కళ్యాణగుణాభి రామా! నీదివ్యమంగళవిగ్రహమును గాంచనిదే, ఆరాధింపనిదే ఒక్కక్షణ మైనను నేను జీవింపజాలను నన్ననుగ్రహింపు' మని శ్రీరామచంద్రు ననేకవిధముల ప్రార్థించి ఆయనదివ్యచరణార విందముల నాశ్రయించెను ఆపరమభక్తునకు గలభగవద్భక్తిని గాంచి సకలవానరులు, అయోధ్యప్రజలు ఆభాగవతోత్తముని వివిధరీతుల ప్రశంసించిరి

భక్తవత్సలుడు, భక్తాధీనుడు, దయాసాగరుడు, సకల కళ్యాణగుణాభిరాముడు, పరబ్రహ్మము, పరమా పరంధాముడు, భగవంతుడు నైనశ్రీరామచంద్రమూర్తి అ భక్తుడైనవిభీషణు ననుగ్రహించుటకై ఆత్మశక్తిచే తనన శ్రీమూలారామవిగ్రహమును ప్రాదుర్భవింపజేసెను ఆ దివ్య విగ్రహము పరిపూర్ణతము నైనభగవంతుని యర్చావిగ్రహము సభాసదులందరీదృశ్యమును గాంచినవారై పరమానంద భరితులై అశ్రుపూర్ణలోచనములతో గద్గదకంఠముతో పులకితగాత్రులై భగవంతుని అనేకవిధముల స్తుతించి విభీషణుడు బా ఙ్ఞనమును విస్మరించి శ్రీరామనామ ముచ్చరించుచు సభా

మధ్యమున నృత్యమొనరించెను. శ్రీరామచంద్రుడు తనపాదముల నాశ్రయించిన విభీషణుని శిరముపై మంగళకరము, అభయ ప్రదము నగు తనదక్షిణహస్తము నుంచి యిట్లుపలికెను.

"రాక్షసేశ్వరా! మద్భక్తాగ్రగణ్యా! నీయనన్యభక్త్యారాధనలకు నే నత్యంతసంతుష్టుడ నైతిని. నాస్వరూపమే యైన ఈమూలరామమూర్తిని నీ కొసంగుచున్నాను. నాయారాధనలో చరితార్థుడవు గమ్ము".

ఇట్లనుగ్రహించి శ్రీరామభద్రుడు తనఅర్చావిగ్రహమును విభీషణున కొసంగెను. అప్పు డాకాశమున సకలదేవతలు ఆశ్రీవిగ్రహమును దర్శించుటకు సమావేశమైరి. కుసుమవృష్టిని గావించి, ఆనకదుందుభులను మ్రోగించుచు దేవతలు శ్రీరామ నామసంకీర్తన మొనరించిరి. బ్రహ్మ గగనమునుండి భూమిపైకి దిగి స్వయముగ శ్రీమూలరామమూర్తిని సభామధ్యములో ఆరాధించెను. తనకమండలములోని దివ్యమందాకినీజలముతో శ్రీమూలరామమూర్తి చరణారవిందములను ప్రక్షాళనముచేసెను. శ్రీరామభద్రు ననేకవిధముల స్తుతించి బ్రహ్మ తనలోకమునకు వెడలిపోయెను.

విభీషణుడు శ్రీమూలరామమూర్తి విగ్రహమును శిరముపై నుంచుకొని ఆత్మతృప్తి నొందినవాడై రామనామమును గీర్తించుచు శ్రీరామాజ్ఞచే సకలపరివారముతో లంకానగరము జేరెను. ప్రప్రథమమున బ్రహ్మదేవు డారాధించిన

ఆ శ్రీమూలరామ విగ్రహమును భక్తాగ్రేసరు డైనవిభీషణు డారాధించెను అయినను విభీషణునకు తృప్తి కలుగలేదు కోట్లకొలదిజన్మలనిచ్చినచో నేను శ్రీమూలరామమూర్తిని తనివి దీర ఆరాధింపగలనుగదా యనివిభీషణుడు సతతము సంకల్పించెడివాడు ఈవిభీషణుడే సత్యయుగములోని ఆప్రహ్లాదుడు ఆప్రహ్లాదుడే శ్రీహరిపాదుకు డైనశంఖుకర్ణుడు

విభీషణసార్వభౌముడుకూడ రాజోచితము లైనయ యాగాదులుజేసి అనంత ము లైనయనిష్టపుణ్యములను సముపార్జించెను పాపపుణ్యములు, సంకల్పములు జీవునకు మఱలజన్మను ప్రసాదించును శ్రీమూలరామారాధన మొనరింపవలె ననెడి ప్రగాఢాకాంక్షచే విభీషణుడు ద్వాపరయుగములో నేటిబరిస్సా ప్రాంతమునకు ప్రభు నైనబాహ్లీకునిగ జన్మించెను బాహ్లీకుని పూర్వ ............ త్యమును జయించి అచట విరాజిల్లియున్న శ్రీరామవిగ్రహమును తనరాజధానికి సకలమర్యాదలతో తోడ్కొనివచ్చి ఆరాధింపనారంభించిరి కావుననే విభీషణు డావంశములో శ్రీమూలరామవిగ్రహము నారాధించుటకు జన్మించెను

బాహ్లీకచక్రవర్తియొక్క జీవితమంతయు శ్రీమూలరామ విగ్రహము నారాధించుట రాజోచితము లైనయజ్ఞయాగాదుల ద్వారమున అపారమైన అనిష్టపుణ్యమును సముపార్జించెను శ్రీమూలరామారాధనమున తనివిదీరక బాహ్లీకచక్రవర్తి

మరల కలియుగములో శ్రీవ్యాసరాయలుగ జన్మించెను బాహ్లీకుని వంశజులు శ్రీమూలరామమూర్తిని శ్రీవ్యాసరాయల వారిగురుపరంపరలోని వారైన శ్రీనరహరితీర్థుల కొసంగిరి

బాహ్లీకవంశజులనే 'గజపతు' లందురు గజపతివంశజులు శ్రీమూలరామమూర్తినిఆరాధించుచుండెడివారు ఆవంశములో ఒకరాజు మరణించెను వాని యేకైకపుత్రుడు చిరుతప్రాయము వాడు సింహాసనాధికారము పొందుటకు పన్నెండుసంవత్సరము లాగవలెను అపుడు సచివులు రాజ్యసంచాలకుని యెన్నిక కొఱకు భద్రగజమును పుష్పమాలతో విడచిరి శ్రీనరహరితీర్థులు ఒకసరోవరముచెంత భగవదారాధనమందు నిమగ్నులై యుండగ ఈభద్రగజము ఆమహాత్మునిపుష్పమాలా లంకృతునిగ నొనరించెను శ్రీనరహరితీర్థులు రాజ్యసంరక్షణార్థమై రాజప్రతినిధిపదవి నలంకరించి పండ్రెండుసంవత్సరములు ధర్మపాలనమొనరించెను రాజాంతఃపురము నందున్న శ్రీమూలరామవిగ్రహమును ఆయతీశ్వరు లారాధించి చరితార్థులయ్యెను యుక్తవయస్కుడైనరాజకుమారునకు పట్టాభిషేక మొనరించి నిజాశ్రమమునకు బయలుదేరెను ఆగజపతిరాజు శ్రీమూలరామవిగ్రహమును శ్రీనరహరితీర్థులవారి కొసంగి నిత్యారాధనమొనరింపవలసినదిగ ప్రార్థించెను శ్రీనరహరి తీర్థులు తమజీవితమంతయు శ్రీరామచంద్రుని సేవ కర్పించెను ఆగురుపరంపరలోనివారే శ్రీవ్యాసరాయలవారు శ్రీవ్యాస

రాయలవారు శ్రీమూలరామవిగ్రహమును జీవితాంత మారా
ధించి తృప్తినొందక మరల శ్రీరాఘవేంద్రతీర్థస్వామిగ జన్మిం
చెను శ్రీహరిపార్షదుడైనశంఖుకర్ణుడే ప్రహ్లాదుడై, విభీషణుడై
బాహ్లీకుడై, శ్రీవ్యాసరాయలై తుదకు శ్రీరాఘవేంద్రస్వామిగ
నవతరించి మూలరామవిగ్రహము నారాధించుచుండెను ఎన్ని
జన్మలు భగవదారాధనచేసినను భక్తులకు తనివిదీరునా?
భక్తులు సాలోక్యసారూప్యాదిమోక్షముల నభిలషింపరు
బ్రహ్మేంద్రాదిపదముల నాకాంక్షింపరు, ఐశ్వర్యాదులను
ముట్టరు ఏజన్మమైనను ఎన్నిజన్మలైనను భగవంతున కనన్య
భక్తులై ఆయనదివ్యచరణారవిందములనే ఆరాధింపవలె నని
ఆకాంక్షింతురు శ్రీరాఘవేంద్రస్వామి పరమగురువులైన
శ్రీమధ్వాచార్యులు, వారిశిష్యులైన శ్రీనరహరితీర్థులు,
శ్రీవ్యాసరాయతీర్థులు మొదలగువారందరు ఆవిధముగ
శ్రీమూలరాముని ఆరాధించి చరితార్థులైరి శ్రీమూలరామ
విగ్రహమును విభుదేంద్రతీర్థులవారు ఆరాధించిరి శ్రీసుధేంద్ర
తీర్థులు మొదలగువారారాధించిరి ఇపుడు శ్రీరాఘవేంద్ర
తీర్థులు ఆరాధించుచున్నారు



# శ్రీ వ్యాస ముష్టికలు

శ్రీమధ్వాచార్యులు వ్యాసభగవానుని అనన్యభక్తితో నారాధించిరి శ్రీకృష్ణద్వైపాయనుడు శ్రీమధ్వాచార్యునకు ప్రత్యక్షమై తనస్వరూపము లైనపంచముష్టికల నొసంగెను ఆ అయిదుముష్టికలు నాసంపూర్ణ సన్నిధానము లేనని వేద వ్యాసుడు వచించెను ఈ ఐదువ్యాసముష్టికలలో ఒకముష్టిక శ్రీరాఘవేంద్రస్వామిచే ఆరాధింపబడుచుండెను రెండవముష్టిక శ్రీవ్యాసరాయలవారిమఠములో విరాజిల్లెను మూడవముష్టిక సోదెమఠమందు ఉండెను నాల్గవముష్టిక శ్రీబదరికాశ్రమములో కలదు ఐదవముష్టిక దివ్యబృందావనమం దుండెను ఈనాల్గవ ముష్టిక, ఐదవముష్టికలుమాత్రము అదృశ్యరూపమున విరాజిల్లి యున్నవి ఈమూర్తులేకాక యెన్నియో దేవతామూర్తులు శ్రీరాఘవేంద్రస్వామిచే ఆరాధింపబడుచున్నవి శ్రీరాఘవేంద్ర స్వామి ఏకాగ్రచిత్తముతో తారతమ్యములనుపాటించుచు సకల దేవతామూర్తులనారాధింతురు ఆమహామహునియోగబలముచే సకలదేవతలు శ్రీతీర్థులవారికిసాక్షాత్కరించెదరు సకలదేవతలను ప్రత్యక్షముగ దర్శించి, ఆరాధించి నివేదనమొనరించుటయే శ్రీరాఘవేంద్రతీర్థస్వామియొక్క నిత్యకృత్యము వారెచ్చట నున్నను మఠములో పరంపరాగతముగ ఆరాధింపబడుచున్న ఈమూర్తులన్నియు అచటనే యుండవలయును కావున సకల దేవతామూర్తులను దోడ్కొని ప్రతినిత్యము దివ్యారాధనమొన

రించుచు శ్రీరాఘవేంద్రస్వామి సకలపరివారసహితముగ దక్షిణ ముగ పయనించుచు ఆదోని జేరి ఆరాజ్యమునకు మంత్రి యైన దివాన్ వెంకన్నపంతులు గృహమందు విడిదిచేసిరి. తనయనుంగు శిష్యుని ప్రార్థనలను మన్నించి కొంతకాలము పరివారసహితముగ ఆతిథ్యమును స్వీకరించుటకు శ్రీరాఘవేంద్రతీర్థస్వామివా రంగీక రించిరి.

— ० —

# శ్రీ నరహరితీర్థులు

శ్రీమూలరామచరితము బ్రహ్మదేవునినుండి ఆరంభమై నట్లుగ కలదు. సృష్ట్యాదిలో చతుర్ముఖు డైన బ్రహ్మదేవుడు ఆగమశాస్త్రానుసారముగ విశ్వకర్మచే శ్రీమూలసీతారామ మూర్తులను నిర్మాణ మొనరింపజేసెను. ఆదివ్యమూర్తులను బ్రహ్మ నిత్యము ఆరాధించుచుండెను. వైవస్వత మన్వంతర ములో మనుచక్రవర్తి భక్త్యారాధనలకు సంతసించి సృష్టికర్త యీమూలరామవిగ్రహములను మనువున కొసంగెను. మనువు సూర్యదేవున కొసంగెను. నాటినుండి సూర్యవంశచక్రవర్తులు శ్రీమూలరామారాధన మొనరించుచుండిరి. భగవంతు డైన శ్రీరామచంద్రుడు మానవకళ్యాణార్థమై ప్రతికల్పమందును అవ తరించుచుండును. శ్రీరామావతారము లసంఖ్యాకములు.

శ్రీరామచంద్రుడే యీ శ్రీరామమూర్తిని ఆరాధించెను దాశరథి పట్టాభిషేకానంతరము దిగ్విజయమొనరించుటకు సంకల్పించెను శ్రీరామవియోగమును భరింపలేని సీతా సాధ్వి తానుకూడ వెంటవచ్చెద నని ప్రార్థించెను అపుడు శ్రీరాఘవేంద్రుడు తనచే ఆరాధింపబడుచున్న వ గార్తిని తనస్వరూపముగ పేర్కొని సీతాదేవి కొసంగెను సీతాదేవి సంతుష్టురాలై శ్రీరామచంద్రుని ప్రతిరూప మైనశ్రీమూలరామ మూర్తిని ఆరాధింపదొడంగెను శ్రీరామావతారముకంటె పూర్వమునుండి పరంపరాగతముగ నున్న అర్చవిగ్రహము కావున యీమూర్తినిశ్రీమూలరామమూర్తి యనిసీతాదేవియే స్వయముగ నామకరణ మొనరించెను పరిచయసౌలభ్యమునకై ఆమె మూర్తిని మూలరామమూర్తి యని వ్యవహరించెను

సీతాదేవి లక్ష్మణు డొనరించిన సేవకు ప్రసన్నురాలై శ్రీమూలసీతారామవిగ్రహములనుఆరాధనా మైప్రసాదించెను లక్ష్మణుడు స్వామి నారాధించి 'సౌభరి' మహర్షి కొసంగెను ఆమహానివర్యుడు ఈమూలమూర్తులకు నిజమైన ఆరాధకుడు శ్రీఆంజనేయుడే యనిగ్రహించి మూలసీతారామవిగ్రహములను పవనాత్మజున కొసంగి చరితార్థుడయ్యెను శ్రీఆంజనేయస్వామి ఆదివ్యరూపముల నారాధింపనారంభించెను యుగము మారెను ద్వాపరయుగ మారంభమయ్యెను ద్వాపర యుగ ములో శ్రీకృష్ణపరమాత్మ గోలోకమునుండి వచ్చి అనేకదివ్యలీలల నొనరించెను ఆయన దివ్యానుగ్రహమునకు పాత్రులైనవారే

పాండవులు పాండవద్వితీయుడైనభీమసేనుడు వాయుదేవుని యవతారము పాండవులు వనవాసమొనరించుసమయమున పాండవమధ్యముడైనఅర్జునుడు శివానుగ్రహముకొఱకై తపమాచరించుటకు వెడలిపోయెను పాండవులు గంధమాదన పర్వతప్రాంతమున భ్రమించుచుండిరి ఒక శుభ దినమున ద్రౌపదితో కలసి భీమసేనుడు రమ్యమగు నాపర్వతప్రాంతమున చరించుచుండగను ఆకసమునుండి ఒకదివ్యపుష్పము ద్రౌపది యొడిలో పడెను దానిసుగంధము అద్భుతము ఆసౌగంధికా పుష్పములను భగవదారాధనానిమిత్తమై తీసికొనిరావలసినదిగ ద్రౌపది భీమసేను నర్థించెను ఆవాయుపుత్రుడు ఆప్రసూన మేతెంచిన దిక్కుగ బయలుదేరెను మార్గములో ఒకవృ వానరము తనవాలమును మార్గమున కడ్డముగనుంచి పరుండెను మానవుడు వానరవాలమును దాటుట ధర్మముకాదు అందు వలన భీమసేనుడు వాలమును తొలగింపవలసినదిగ వానరము నాదేశించెను అందుకావానరము తాను వృద్ధుడనని, తొలగ లేనని వాలమును తొలగించుకొని పోవలసినదని పలికెను భీమసేను డావాలమును తొలగించుటకు ప్రయత్నించి విఫలు డయ్యెను తననాగాయతబలముపై నెంతయో గర్వము గల భీమసేనునియభిమానముభంగమయ్యెను ఈవానరముసామాన్య మైనదికాదనియు, ఎవరోమహాపురుషుడై ్చననియు భావించి భీమసేను డనేకవిధముల స్తుతించెను అపుడు ఆవృ వానర మంతర్థానమై శ్రీఆంజనేయస్వామిగ సాక్షాత్కరించెను

శ్రీవాయుపుత్రు లిద్ద రు పరస్పర మాలింగన మొనరించు కొనిరి భీమసేనుడు శ్రీఆంజనేయుని విశ్వరూపమును సందర్శించి ధన్యుడయ్యెను తనసోదరుని ఉద్ధరించుటకు సంకల్పించుకొని ఆంజనేయుడు శ్రీమూలసీతారామమూర్తులను భీమసేనున కొసంగెను భీమసేనుడు ఆదివ్యమూర్తుల నారాధించెను పాండవు లందఱు ఈయర్చవిగ్రహములను పూజించిరి వారు శ్రీరామానుగ్రహమునకు పాత్రులై కురుక్షేత్రసంగ్రామములో విజయమునుపొంది చక్రవర్తులైరి ఆకాలములో శంఖుకర్ణుడు కళింగదేశాధీశ్వరు డైనబాహ్లీకునిగ అవతరించెను పాండవుల యనుగ్రహమునకు పాత్రు డైనయీచక్రవర్తి శ్రీరామచంద్రున కనన్యభక్తుడు పాండవులనుండి శ్రీమూలరామవిగ్రహములను బాహ్లీకచక్రవర్తి పొంది ఆరాధింప నారంభించెను

బాహ్లీకచక్రవర్తి వంశమువారలను గజపతు లందురు వీరిది కళింగరాజ్యము, అనగా ఒరిస్సాప్రాంతము

శ్రీవాయుదేవుని యవతారమైన మధ్వాచార్యులు 13వ శతాబ్ధములో కళింగరాజ్యమునకు వేంచేసెను కళింగరాజ్య ములో శ్యామశాస్త్రి యనుమహాపండితుడు కలడు వీరిజన్మ స్థలము గంజాంజిల్లాలోని చికాకోలు నగరము తండ్రి నరసింహా భట్టారకుడు అనంగభీమరాజాస్థానములో మంత్రిగ నుండెను ఈయన కిర్వురు కుమారులు కలరు వారిర్వురు మహావిద్వాం

సులేకాదు రణరంగధీరులు, రాజకీయచతురులు వారిలో ఒక్కరే యీశ్యామశాస్త్రిలు

శ్రీమద్ధ్వాచార్యులతో శాస్త్రచర్చయొనరించి శ్యామశాస్త్రి పరాజితుడయె ను శ్యామశాస్త్రి శ్రీమద్ధ్వాచార్యులకు శిష్యుడై సన్యాసాశ్రమమును స్వీకరించెను నాటినుండి శ్రీనరహరి తీర్థులను ప్రఖ్యాతినిగాంచెను శ్రీనరహరితీర్థులుకూడ శ్రీమద్ధ్వాచార్యులతో గలసి బయలుదేరుటకు సంసిద్ధుడయ్యెను శ్రీవాయుదేవునియవతార మైనశ్రీమద్ధ్వాచార్యులకు శ్రీమూలసీతారామమూర్తులు గజపతిరాజులభాండాగారములో వేంచేసియున్న వని తెలియును కావున ఆయన శ్రీనరహరితీర్థులను అచ్చోటనే యుండి సమయ మాసన్నమైనపుడు మూలసీతారామమూర్తులను గజపతిరాజులనుండి స్వీకరింపవలసినదిగ ఆదేశించెను గురుదేవునియాదేశానుసారముగ నరహరితీర్థులు గజపతుల రాజధానిలో నుండి సమయముకొఱకై నిరీక్షించుచుండెను

కళింగదేశపురాజు యౌవనకాలమందే మరణించెను వానికుమారుడు బాలుడు రాజ్యాధికారమునకు ఇంకను పండ్రెండుసంవత్సరము లాగవలయును అధికారముకొఱకై మంత్రులు, సేనాధిపతులు వివాదపడసాగిరి రాజ్యమరాచకమయ్యెను

రాజ్యనిర్వహణభార మెవరికి అప్పగింపవలె ననెడిసమస్య రాణిని బాధింపదొడంగెను చివరకు వృద్ధు లగుమంత్రులు

ఆలోచించి ఒకనిర్ధారణకు వచ్చిరి భద్రగజము నలంకరించి దానితొండమునకు శ్రీజగన్నాథస్వామి కర్పించియున్న పుష్ప హారమును తెచ్చి అందించిరి ఆగజమును పట్టణములో ఊరేగించిరి ఆసమయములో శ్రీజగన్నాథస్వామిని దర్శించి దేవాలయమునుండి వెలుపలకు వచ్చుచున్న శ్రీనరహరితీర్థుల మెడలో ఆఏనుగు పుష్పహారాల నలంకరించి ముందుకాళ్ళను వంచి తొండమునెత్తి నమస్కరించెను శ్రీనరహరితీర్థులను రాజప్రతినిధిగ అభిషేకించిరి

పండ్రెండు సంవత్సరములు రాజ్యపాలన మొనరించి శ్రీనరహరితీర్థులు కళింగరాజ్యమును భూలోకస్వర్గమువలె తీర్చి దిద్దిరి రాజకుమారుని సింహాసనాధీశునిగ నొనరించి తీర్థులు శ్రీమధ్వాచార్యులచెంతకు పోవుటకు సంసిద్ధు డయ్యెను అపుడు రాజకుటుంబము హస్తములను ముకుళించి నమస్కరించుచు స్వామీ ! తమరు మానుండి యేదైనను కానుకగ స్వీకరింప వలయునని ప్రార్థించిరి అందులకు శ్రీనరహరితీర్థులు రాజా ! సర్వసంగపరిత్యాగుల మగుమాకు ధనకనకవస్తువాహనములందు మోహము లేదు మీభాండాగారములో పూజారాధనలు లేకయున్న శ్రీసీతారామవిగ్రహములను నాకు ఇచ్చినచో నే నారాధించుకొనెద'నని పల్కెను అందులకు కళింగరాజు సంతోషముతో అంగీకరించి ఆవిగ్రహములను తీర్థుల కర్పించి నమస్కరించెను

శ్రీసీతారామవిగ్రహములను తీసికొని శ్రీనరహరితీర్థులు శ్రీమధ్వాచార్యులను జేరుటకు వేగముగ పయనించుచు సింహాచల క్షేత్రమును చేరెను శ్రీసీతారామవిగ్రహములు కళింగరాజ్యపు సరిహద్దులను దాటగనే రాజధానిలో అనేక ఉత్పాతములు సంభవించెను రాజాంతఃపురమునకు నిప్పుఅంటుకొనెను ఆసమయమున వయోవృద్ధు లగుమహాత్ములు తారాముల విగ్రహముల మహిమను తెలియజెప్పి ఆమూర్తులు మనరాజధానినుండి వెడలుటయే యీయుత్పాతమునకు కారణ మని చెప్పిరి

ఆసమాచారము విన్న వెంటనే కళింగరాజు ప్రతిమలను తిరిగితీసుకొని రావలసినదిగ భటులను పంపెను తన్ననుసరించి వచ్చిన రాజభటులనుచూచి తీర్థులు శ్రీసీతారాములున్న పెట్టెను వారిముం దుంచి మీకు సాధ్య మైనయెడల తీసికొనిపొమ్మని పల్కెను వారెంత ప్రయత్నించినను ఆమూర్తులు కించిన్మాత్ర మైనను కదలలేదు వారు హతాశులై వెడలిపోయిరి నరహరితీర్థులు అచటినుండి బయలుదేరి శ్రీసీతారాముల ప్రతిమలను తీసికొని ... ను

శ్రీమధ్వాచార్యు లవతరించినకార్యము సంపన్నమయ్యెను ఆదిగురు వైనవేదవ్యాసుని దర్శనమునకై వారు బదరికాశ్రమమునకు వెళ్ళుటకు నిశ్చయించుకొనిరి శ్రీమూలసీతారాముల కొఱకై ఆయన ఎదురుచూచుచుండెను పూ... ము ఆయన

శ్రీఆంజనేయావతారమందు, భీమావతారమందు తానుభక్తితో ఆరాధించియున్న శ్రీమూలసీతారామచంద్రులను ఈఅవతారమందుకూడ పూజింపవలె నని ఆయనహృదయము వేగిరపడుచుండెను అందువలన ఆయన శ్రీనరహరితీర్థుల రాకకొఱకు ఎదురుచూచు చుండెను

కార్తీకశుద్ధ ద్వాదశి సంధ్యాకాలమున శ్రీనరహరితీర్థులు శ్రీమూలసితారామవిగ్రహములను తెచ్చి గురుదేవుల కర్పించి సాష్టాంగదండప్రణామములొనర్చెను శ్రీమధ్వాచార్యులత్యంత ప్రసన్నులై శ్రీనరహరితీర్థుల నాలింగనముచేసుకొని గౌరవించెను శ్రీమధ్వాచార్యులు మధ్వసరోవరములో స్నానమాచరించి బ్రహ్మచే ఆరాధింపబడిన శ్రీమూలసీతారామవిగ్రహములను శ్రీకృష్ణపరమాత్మవిగ్రహమునకు ప్రక్కనుంచి తనివితీర పూజించి చరితార్థుడయ్యెను తదనంతరము ఈమూలమూర్తులను పరంపరాగతముగ అవిచ్ఛిన్నముగ ఆరాధింపవలెనని ఆదేశించి శ్రీపద్మనాభతీర్థుల కొసంగిరి

నాటినుండి పరంపరాగతముగ శ్రీమూలసీతారామవిగ్రహములు శ్రీమధ్వాచార్యులశిష్యులచే ఆరాధింపబడుచుండెను ఆమూలమూర్తులనే శ్రీరాఘవేంద్రస్వామి తనివితీర ఆరాధించిరి

### శ్రీమధ్వాచార్యుల పరంపర

1 శ్రీమధ్వాచార్యులు
2 శ్రీపద్మనాభతీర్థులు
3 ,, నరహరితీర్థులు
4 ,, మాధవతీర్థులు

శ్రీఆంజనేయావతారమందు, భీమావతారమందు తానుభక్తితో ఆరాధించియున్న శ్రీ మచంద్రులను ఈఅవతార మందుకూడ పూజింపవలె నని ఆయనహృదయము వేగిరపడు చుండెను అందువలన ఆయన శ్రీనరహరితీర్థుల రాకకొఱకు ఎదురుచూచు చుండెను

కార్తీకశుద్ధ దా శి సంధ్యాకాలమున శ్రీనరహరితీర్థులు శ్రీమూలసెతారామవి ములను తెచ్చి గురుదేవుల కర్పించి సాష్టాంగదండప్రణామములొనర్చెను శ్రీమద్ధ్వాచా లత్యంత ప్రసన్నులై నరహరితీర్థుల నాలింగనముచేసుకొని గౌరవించెను శ్రీమద్ధ్వాచార్యులు మధ్వసరోవరములో స్నానమాచరించి బ్రహ్మచే ఆరాధింపబడిన శ్రీమ లసీతారామవిగ్రహములను శ్రీకృష్ణపరమాత్మవిగ్రహమునకు ప్రక్కనుంచి తనివితీర పూజించి చరితార్థుడయ్యెను తదనంతరము ఈమూలమూర్తులను పరంపరా గతముగ అవిచ్ఛిన్నముగ ఆరాధింపవలెనని ఆ దే శి ం చి శ్రీపద్మనాభతీర్థుల కొసంగిరి

నాటినుండి పరంపరాగతముగ శ్రీమూలసీతారామవిగ్రహ ములు శ్రీమద్ధ్వాచార్యులశిష్యులచే ఆరాధింపబడుచుండెను ఆమూలమూర్తులనే శ్రీరాఘవేంద్రస్వామి తనివితీర ఆరాధించిరి

## శ్రీమధ్వాచార్యుల పరంపర

1 శ్రీమధ్వాచా లు
2 శ్రీపద్మనాభతీర్థులు
3 ,, నరహరితీర్థులు
4 ,, మాధవతీర్థులు

5 శ్రీ అక్షోభ్యతీర్థులు
6 శ్రీ జయతీర్థులు
7 ,, విద్యాధిరాజతీర్థులు
8 ,, కవీంద్రతీర్థులు
9 ,, వాగీశతీర్థులు
10 ,, రామచంద్రతీర్థులు
11 ,, విభుదేంద్రతీర్థులు
12 ,, జితామిత్రతీర్థులు
13 ,, రఘునందనతీర్థులు
14 ,, సురేంద్రతీర్థులు

వీరికాలములోనే శంఖుకర్ణుడు వ్యాసరాయునిగ అవతరించెను వ్యాసరాయస్వామికూడ మధ్వాచార్య సాంప్రదాయములోని యతీశ్వరులే

15 శ్రీవిజయేంద్రతీర్థులు
16 శ్రీసుధీంద్రతీర్థులు
17 ,, రాఘవేంద్రతీర్థులు
18 ,, యోగేంద్రతీర్థులు
19 , సురీంద్రతీర్థులు
20 ,, సుమతీంద్రతీర్థులు
21 ,, ఉపేంద్రతీర్థులు
22 ,, వాదీంద్రతీర్థులు
23 ,, వసుధేంద్రతీర్థులు
24 ,, వరదేంద్రతీర్థులు
25 ,, భువనేంద్రతీర్థులు
26 ,, సుబోధేంద్రతీర్థులు
27 ,, సుజనేంద్రతీర్థులు
28 ,, సుజ్ఞానేంద్రతీర్థులు
29 ,, సుధర్మేంద్రతీర్థులు
30 ,, సుగుణేంద్రతీర్థులు
31 ,, సుప్రజ్ఞానేంద్రతీర్థులు
32 , సుకృతేంద్రతీర్థులు
33 , సుశీలేంద్రతీర్థులు
34 ,, సువ్రతీంద్రతీర్థులు
35 ,, సుయమీంద్రతీర్థులు
36 ,, సుజయేంద్రతీర్థులు

ప్రస్తుతము శ్రీసుజయేంద్రతీర్థస్వామి మంత్రాలయములో ఆచార్యునిగ విరాజిల్లుచున్నారు

# వంశవృక్షము

గురుసారంబాముయు, శ్రీవిశావేంకటనాథాచార్యులు (శ్రీరాఘవేంద్ర స్వామి) మూలపురుషులు విరి కుమారుయు శ్రీలక్ష్మీనారాయణాచార్యులు వీరి కుమారుయ శ్రీపురుషోత్తమాచార్యులు, వీరికి యిద్దరు కుమారులు కలరు ఒకరు శ్రీవేణుగోపాలాచార్యులు, రెండవవారు శ్రీశ్రీనివాసాచార్యులు శ్రీనివాసాచార్యులుసన్న్యాసాశ్రమమునుస్వీకరించిశ్రీవాదేంద్ర తీర్థులుగ ప్ర ద్ధి రి వీరు గురుగుణస్తవ మురచించిరి

శ్రీవేణుగోపాలాచార్యులకు శ్రీపురుషోత్తమాచార్యులనుకుమారుడు కలడు ఆయన సన్న్యాసాశ్రమమును స్వీకరించి శ్రీవసుదేంద్రతీర్థులుగ విరాజిల్లి గురుగుణస్తవమునకు వ్యాఖ్యానమును రచించిరి శ్రీశ్రీనివాసాచార్యుల కుమారులు శ్రీజయరామాచార్యులు వీరు సన్న్యాసాశ్రమమును స్వీకరించి శ్రీధీరేంద్రతీర్థులై శ్రీగురుగుణస్తవమునకు మఱియొక వ్యాఖ్యానమును వ్రాసిరి వీరి కుమారులు శ్రీవే ర్యులు వీరి కుమారులు శ్రీరామాచార్యులు విరి కుమారులు శ్రీరాఘవేంద్రాచార్యులు వీరు యతీశ్వరులై శ్రీసుజ్ఞానేంద్రతీర్థులుగ కీర్తింపబడిరి వీరి కుమారులు శ్రీరాజారాజగోపాలాచార్యులు వీరి కుమారులు శ్రీరాజావేంకటరాఘవేంద్రాచార్యులు వీరి కుమారులు శ్రీరాజావేణుగోపాలాచార్యులు వీరు యతీశ్వరులై శ్రీసుకృతేంద్రతీర్థులుగ గణుతికెక్కిరి వీరి కుమారులు

శ్రీరాజా శ్రీనివాసమూర్తి ఆచార్యులు శ్రీసుయమీంద్రతీర్థులై ఇప్పుడు శ్రీమంత్రాలయాధిపతులై విరాజిల్లియున్న శ్రీసుజ యీంద్రతీర్థులు వీరిశిష్యులు

శ్రీరాజా శ్రీనివాసమూర్తి ఆచార్యులకు ముగ్గురు కుమారులు కలరు ఒకరు రాజా వేణుగోపాలాచార్యులు రెండవవారు రాజాగురురాజాచార్యులు, మూడవవారు రాజాలక్ష్మీనారాయణా చార్యులు

— ० —

## అసదుల్లాఖానుని గర్వభంగము

శ్రీరాఘవేంద్రతీర్థస్వామిచేయు మూలరామార్చన మత్యంత సుందరముగ దర్శనీయముగ నుండును ఆ ఆరాధనా క్రమమును గాంచినవారు బ్రహ్మానందమనుభవింపగలరు భగ వంతుని షోడశోపచారములద్వారా ఆరాధించి సకలదేవతా పూజల నొనరించి అనంతరము భగవంతుని దివ్యచరణామృత మును (తీర్థమును) భక్తుల కొసంగెదరు తదనంతరము మహా నైవేద్యము నొసంగెదరు సంతర్పణానంతరము సాయంత్రము కూడ భగవదారాధన, సత్సంగము యథావిధిగ జరుపబడును తీర్థులవారు మంత్రాక్షతలనుభక్తులకొసంగిఅనుగ్రహించెదరు

శ్రీ వెంకన్నపంతులు సజ్జనుడు తాను తరించుటయేకాక సకలమానవాళి భగవదనుగ్రహమునకు పాత్రము కావలయు ననిఅభిలషించెడివాడు శ్రీరాఘవేంద్రతీర్థస్వామిని సేవించుచు తనను చరితార్థునిగ నెంచుకొనెను తనకు అమాత్యపదవి నొసంగి గౌరవించిన ఆదోని రాజ్యాధినేత అసదుల్లాఖాన్ కూడ తనగురుదేవుననుగ్రహమునకు పాత్రుడు కావలయు ననిసంక ల్పించి వెంకన్నపంతులు నవాబుగారిమహాలును జేరి అసదుల్లా ఖానుని దర్శించి యిట్లుబల్కెను జహాపనా ! మాగురుదేవులు మనరాజధాని కేతెంచి మాగృహములో విరాజిల్లియున్నారు ఆయన మహాత్ముడు భగవద్భక్తుడు, సర్వసమర్థుడు, సర్వజ్ఞుడు దర్శనమాత్రముననే సకలపాపములను నశింపజేయగల దివ్య మూర్తి మీరు సపరివారముగ నేతెంచి ఆమహాత్ముని దర్శింప వలసినదిగ ప్రార్థించుచున్నాను

అప్పుడు అసదుల్లాఖాన్ దివాన్‌జీ ! అలాగుననా ! అచ్ఛా ! తప్పక నే నాపైగంబరుని దర్శింపవలయును రేపు సూర్యాస్తమయసమయములో స్వయముగ నేను మీగృహ మున కేతెంచి నీగురుదేవుని దర్శింపగల ననిపల్కెను

అసదుల్లాఖానుని సమాధానము నాలకించి వెంకన్న పంతులు పరమానందభరితుడై గృహమును జేరి నవాబు మరునాడు తమదర్శనార్థమై రాగలడని గురుదేవులకు విన్న వించెను

అసదుల్లాఖాన్ సహజముగ మంచిహృదయముకలవాడే కాని హిందువులయెడలగలవైరభావమునువిస్మరింపలేకపోయెను స్వామిని పరీక్షింపవలె ననిసంకల్పించుకొనెను తానే రాజ్యాధినేత ననియు సామాన్యులైనసన్యాసులను విశేషముగ గౌరవింపబ లేదనియు, దివానుకోరికను దీర్చుటకే అచటికి వెడలి ఆసన్యాసి నవహేళన మొనరింపవలెనని దురాలోచన చేసెను మరునాడు సకలపరివారముగ శ్రీరాఘవేంద్రతీర్థస్వామిని దర్శించుటకు అసదుల్లాఖాన్ బయలుదేరెను ఒక బంగారు పళ్ళెరములో మాంసము నుంచి దానిపై ముఖమల్ వస్త్రమును గప్పి శ్రీస్వామివారికి కానుకగ దీసుకొని బయలుదేరెను

నవాబుగారే శ్రీరాఘవేంద్రస్వామివారిని దర్శించుటకు బయలుదేరుచున్నా రని తెలిసికొని అసంఖ్యాకముగ ప్రజలందరు వెంకన్న గృహప్రాంగణమునకు జేరుకొనిరి గృహమును సర్వాంగసుందరముగ నలంకరించిరి భగవదారాధన జరుగు ప్రదేశములో శ్రీతీర్థులవారి ఆసనమున కెదురుగా నవాబుగారి కొఅకై ఒకయుచితాసనము నేర్పరచిరి సాయంకాలసమయములో ఆరాధనను తిలకించుటకు పరివారసమేతముగ బంగారు ప రములో విచిత్రకానుక(మాంసము)నిడుకొని అసదుల్లాఖాన్ అఱుదెంచెను వెంకన్నపంతులు స్వాగతము బల్కుచుండగ ఖాను ఆప్రదేశమున కేతెంచి శ్రీవారికి అనేకసలాము లొనరించి ఆబంగారుపళ్ళెరములోని పదా ములను భగవంతునకు నివేదింప

వలసినదిగ ప్రార్థించెను. పళ్ళెరములోని మాంసఖండములపై ముఖమల్ వస్త్రము కప్పియున్నదిగాన యెవరును ఖాన్ యొన రించిన ఈదుష్కృత్యమును గమనింపరైరి కాని సర్వజ్ఞులైన శ్రీరాఘవేంద్రస్వామి సర్వము గ్రహించినవారై చిరునవ్వుతో ఖాను నాశీర్వదించి ఆసనము నలంకరింపవలసినదిగ ఆజ్ఞ పించిరి అసదుల్లాఖాన్ తన దుష్కృత్యము సఫలీకృత మైనదని ఈ సన్యాసి సామాన్యుడే యనిభావించి తనరాజసమును ప్రద ర్శించుచు ఆసనము నలంకరించెను ఈమాం ఖ భగవంతునకు నివేదించి సకలప్రజామధ్యమున ఈ స న్యాసి అపహాస్యముపాలు కాగలడని తలపోయుచుండెను శ్రీరాఘ వేంద్రతీర్థస్వామి తనకమండలములోని గంగాజలమును ఖాన్ తెచ్చిన బంగారుపళ్ళెరముపై చల్లను ఆముఖమల్ వస్త్రమును తొలగింపవలసినదిగా ఒకశిష్యు నాజ్ఞాపించెను ఆబంగారుపళ్ళె రములో వివిధములైనఫలములను, సుగంధపుష్పములను దర్శించి ప్రజలందరు పరమానందభరితులైరి అసదుల్లాఖాను మాత్రము పరమాశ్చర్యచకితుడై తా నొనరించిన భాగవతాప చారమునకు పశ్చాత్తాపముజెందుచు గడగడవణకనారంభించెను శరీరమంతయు చెమటపట్టుచుండగ వివర్ణముఖు డైనఖాను దిగ్గున ఆసనమునుండి లేచి తీర్థులవారి చరణములపై బడి "మహాత్మా! నేను మిమ్ములను గౌరవించుటకుగాక, అవమా నించి అవహేళనజేయుట కరుదెంచితిని నాయమాత్యుడు మీరు భగవత్సములని, మహాత్ములని చెప్పినను సత్యము

నంగీకరింపలేక పామరునివలె మీదివ్యసముఖమున అపరాధ మొనరించితిని గురుదేవా ! నే నొనరించిన ఈదుష్కృత్యము నకు హృదయపూర్వకముగ పశ్చాత్తాపమును జెందుచున్నాను నా య ప రా ధ ము ను మన్నించి నన్ను క్షమించవలసినదిగ ప్రార్థించుచున్నా''నని పల్కి అనేకవందనముల నర్పింపసాగెను

వెంకన్నపంతులుతోపాటు అందఱు ఈవిచిత్రసంఘటనను గాంచి విషయము తెలియక పరమాశ్చర్యచకితులైరి నవాబు స్వామి కేయపరాధ మొనరించినాడో తెలియక అచ్చెరువొందసాగిరి ఖాన్ యొనరించిన అపరాధము ఖానునకు శ్రీవారికిదప్ప అన్యులందఱకు అగోచరమే శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి అసదుల్లాఖాను నాశీర్వదించి తీర్థప్రసాదముల నొసంగి గౌరవించిరి అసదుల్లాఖాను రాజగృహమును జేరినవాడై తా నొనరించిన దుష్కృత్యమునకు పశ్చాత్తాపము జెందుచు దీనికి పరిహారముగ నేమియొనరింపవలె ననిరాత్రంతయు ఆలోచించెను ఉదయముననే వెంకన్నపంతులును రావించి అమాత్యా ! నిన్నటిరాత్రి నేను మరలివచ్చిన అనంతరము గు రు దే వు లేమనిరి ? నే నాయనసమక్షములో ఘోరాపరాధము నొన రించితిని మహాత్ము లాగ్రహించిన నేను నారాజ్యము నశింపగల మనిపల్కి జరిగినదంతయు సంక్షిప్తముగ వివరించెను జరిగిన విషయమును గ్రహించి వెంకన్నపంతులు ఆశ్చర్యచకితుడై "జహాపనా ! నాగురుదేవులు శాంతమూర్తి, కరుణాసముద్రుడు,

క్షమాస్వరూపుడు కావున తా మొనరించిన ఈఅపరాధమును సరకుగొనడని'' ధైర్యము చెప్పెను

అసదుల్లాఖాను తనదుష్కృత్యమునకు పరిహారముగ కొన్నిగ్రామములను శ్రీరాఘవేంద్రతీర్థస్వామికికానుకగా అర్పించెదనని, ఏయేగ్రామములు కావలయునో స్వామివారే నిర్ణయింపవలెనని బల్కెను రాజుపల్కిన మధురవాక్యముల నాలకించి పరమానందభరితుడై గురుదేవునిజేరి విన్నవించెను శ్రీరాఘవేంద్రతీర్థస్వామి మందహాసము నొనరించుచు వెంకటేశా ! నా కెన్నియో గ్రామములు వలదు సర్వము ఆశ్రీరామచంద్రుని సంకల్పమాత్రముననే సంభవించును భగవదారాధనార్థమై 'మంచాల' యనుగ్రామమును సమర్పింపవలసినదిగ నవాబును కోరుమనెను వెంకన్నపంతులు బాదుషాను జేరి 'మంచాల విషయమును విన్నవించెను అసదుల్లాఖాన్ మంచాల గ్రామము నొక ఫకీరున కొసంగెను నవాబు ఆఫకీరును రావించి వానికి మరికొన్ని గ్రామముల నొసంగి మంచాలను స్వీకరించెను అసదుల్లాఖాను పరమానందభరితుడై ఆక్షణమందే 'మంచాల గ్రామమును శ్రీరాఘవేంద్రతీర్థస్వామికి కానుకగా సమర్పించెను నవాబు అనేకగ్రామముల నొసంగుటకు సిద్ధముగా యుండెను కాని శ్రీవారు ఒకమంచాలకుగ్రామమునే కోరుకొనుట దివాన్ వెంకన్నపంతులునకు ఆశ్చర్యమును కలిగించెను అతడు శ్రీవారితో ఆవిషయమును ప్రస్తావించెను అపుడు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి యిట్లు పల్కిరి

వెంకన్నా! నేను ప్రహ్లాదావతారములో అనేక యజ్ఞయాగా దుల నొనరించితిని, నాటి ఆయజ్ఞభూమియే నేటి ఈ మంచాల గ్రామము పరమపవిత్ర యజ్ఞ క్షేత్రము, దివ్యభూమి, కర్మ భూమి కావుననే నేనా కుగ్రామమును అంగీకరించితిని ఆదోని అమార్ శేఖరు డైన వెంకన్నపంతులు 'మంచాల గ్రామములో ఒక విశాల మైనఆశ్రమమును నిర్మించెను ఆశ్రమ నిర్మాణవ్యయమంతయు అసదుల్లాఖా నిర్వహించెను తదనంతరము శ్రీరాఘవేంద్రతీర్థస్వామి భగవన్మూర్తులను దోడ్కొని, పరి వారము, అసదుల్లాఖాను, వెంకన్నపంతులు మొదలగువారందరు వెంటరాగా మంచాలలోని నూతనాశ్రమమును ప్రవేశించిరి

నేడాప్రదేశమే 'మంత్రాలయ' మను పేర ప్రసిద్ధి గాంచెను నాటినుండి నేటివరకు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ఆపవిత్రస్థానము లోనే విరాజిల్లుచు భగవదారాధనాతత్పరులై తనాశ్రయించిన భక్తులకు ధర్మా కామమోక్షముల నొసంగుచున్నారు ఆదివ్య క్షేత్రములో అడుగిడినంతమాత్రముననే మానవునిహృదయము పవిత్రమగును ఆశ్రమమును ప్రవేశించి శ్రీరాఘవేంద్రతీర్థ స్వామిని దర్శించిన సర్వపాపవిముక్తుడై భగవద్భక్తుడుకాగలడు సకామారాధకులు, బృందావనాంతర్గతముగ విరాజిల్లియున్న శ్రీవారియనుగ్రహమువలన తమమనోభీష్టములను పరిపూర్ణ మొనరించుకొనగల్గుచున్నారు

# మృత్తికా మాహాత్మ్యము

మంచాలగ్రామములో నిర్మింపబడిన సువిశాలమఠములో శ్రీరాఘవేంద్రతీర్థస్వామి శిష్యపరివారసమేతముగ విరాజిల్ల నారంభించిరి ఎందఱో ఆధ్యాత్మికవిద్యార్థులకు ఆపవిత్రాశ్రమము మూర్తీభవించిన సరస్వతీనిలయమయ్యెను ముముక్షువులైనభక్తులకు దివ్యక్షేత్రమయ్యెను ఆశ్రితులకు కల్పవృక్షమయ్యెను ఆదివ్యాశ్రమములో సకలజీవులకు పరమశాంతి లభించును మానవులేగాక పశుపక్ష్యాదులుకూడ పరస్పరవైరమును మరచి పరమమిత్రులై మెలగుచుండును కారణమేమన ఆదివ్యక్షేత్రము తపోభూమి, యజ్ఞభూమి, భక్తాగ్రేసరుల పాదధూళిచే పవిత్రమైనధరణి మన్నారాయణుడు, శ్రీలక్ష్మీనృసింహరూపమున నడయాడిన పావనధరిత్రి సత్యయుగములో ప్రహ్లాదచక్రవర్తి ఈప్రదేశములోనే అఖండభగవదారాధన మొనరించుచు అసంఖ్యాకములుగ రాజసూయవాజపేయయజ్ఞాదుల నొనరించెను ఆప్రదేశమందలిమన్నుగూడ పావకునివలె పవిత్రమే ఆనాటి ప్రహ్లాదుడే నేటి శ్రీరాఘవేంద్రతీర్థ యతీంద్రులు కావుననే శ్రీవారు ఆశ్రమస్థాపనకై ఈమంచాల ప్రదేశము నెంపికచేసిరి నే ాప్రదేశము 'మంత్రాలయ' నామమున గణుతికెక్కెను శ్రీరాఘవేంద్రతీర్థస్వామి జితేంద్రియులై అనన్యభక్తితో పరంపరాగతవిధానానుసారముగ భగవదారాధనము చేయుచునంద్రు శ్రీవారియాశ్రమములో

ఎందరో బ్రహ్మచారులు విద్యార్థులు, ఆశ్రమవ్యవస్థాపకులు ఆశ్రమకర్మచారులు మొదలగువారుకలరు ఆయాశ్రమప్రాంగణ మంతయు పవిత్రతులసీవనములతో నిండియుండును నిరంతరము హరినామసంకీర్తనముచే పవిత్ర మగుచుండును వేదమంత్ర ఘోషచే ప్రతిధ్వనించుచుండును కావున మంత్రాలయ మను నామ మాప్రదేశమునకు సార్థకమయ్యెను

తులసీవనములకు, ఫలపుష్పోద్యానములకు రక్షకులుగ, పోషకులుగ కొందఱు బ్రహ్మచారులను శ్రీవారువినియోగించిరి వారిలో శ్రీకృష్ణదాసు డనుసద్గుణవంతుడైనయువకుడు గలడు ఆతడు నిత్యము గురుదేవుని దివ్యనామమును జపమొనరించుచు గురువునే దైవముగ భావించుచు గురుదేవునాజ్ఞను శిరసా వహించి పరిపాలించుచుండెను ఒకదినమున శిష్యులకు ఆధ్యాత్మ విద్యాప్రబోధన మొనరించుచు శ్రీ రా ఘ వేం ద్ర తీ ర్థ స్వా మి గృహస్థాశ్రమధర్మమును ప్రశంసించిరి వీతరాగివై సర్వకర్మలను భగవదర్పణముగ నొనరించుచు శీలవతిని బరిణయమాడి భగవదారాధనాతత్పరుడై నిరతము దీనజనసేవానిమగ్నుడై అతిథులను గౌరవించుచు సత్సంతానమును బొంది తామరాకుపై నీటిబొట్టువలె నీప్రపంచములో వ్యవహరించినట్టివాని గృహస్థాశ్రమమే ప్రశంశనీయ మని శ్రీవారు ప్రవచించెను

గురుదేవుని ప్రవచనము నాలకించిన శ్రీకృష్ణదాసు గృహస్థాశ్రమమును స్వీకరింపవలె నని సంకల్పించు కొనెను

తత్క్షణమే గురుదేవుని సమీపించి సాష్టాంగదండప్రణామము లర్పించి తనమనోగతభావమును బహిర్గతమొనరించెను శిష్యు నాకాంక్ష నాలకించి శ్రీవారు మందహాసముచేసి తనపాదతల మున నున్న మృత్తికను దీసి ఒక యంత్రాకారముగ నొనర్చి 'కృష్ణా! నీవీమృత్తికను అహర్నిశములు వెనువెంటనుంచు కొనుము, ఉత్తరదిశగాపయనించిన నీకుసద్గుణవతియు, సాధ్వియు పరమసౌందర్యవతియు నగుభార్యలభింపగలదని యాశీర్వదించెను

గురుదేవు డొసంగిన ఆదివ్యమృత్తికను తనయుత్తరీయ ములో బంధించి శ్రీకృష్ణదాసు వధువు నన్వేషించుటకు ఉత్తర దిశగా గురుదేవునినామమును జపమొనరించుచు బయలుదేరెను

శ్లో॥ పూజ్యాయ రాఘవేన్ద్రాయ సత్యధర్మరతాయ చ ।
భజతాం కల్పవృక్షాయ నమతాం కామధేనవే ॥

తా॥ పూజింపదగినవాడు, స ర్మరతుడు, సేవించు వారికి కల్పవృక్ష మైనవాడు, నమస్క చువారికి కామధేను వైనవాడు నగురాఘవేంద్రస్వామికి నమస్కరించుచున్నాను

ఇట్లు గురునామజపమొనరించుచు కొన్నిదినము లుత్తర దిశగా ప్రయాణమొనరించి అర్ధరాత్రికి ఒకగ్రామమును జేరెను ఆగ్రామమునుమ లో ఒకహర్మ్యము కలదు అర్ధరాత్రికూడ ఆభవనములో కాంతులు వెదజల్లుచున్నవి ఆభవనములోని వారుదక్క అన్యగ్రామవాసులందరు గాఢనిద్రానిమగ్నులై యుండిరి

కొన్నిగంటలు ప్రయాణము చేసిచేసి శ్రీకృష్ణదాసు బాగుగ అలసినవాడై గ్రామమధ్యములో నున్న ఆభవనమును జేరెను మూసియున్న భవనప్రధానద్వారమును తట్టుచు అతిథి నగునే నే తెంచినానని కేకలు వేయసాగెను కాని ఈయువకుని కేకల నెవరును పట్టించుకొనలేదు ఆగృహములో గలవారందరు చింతాక్రాంతులై విషణ్ణవదనములతో దుఖనిమగ్నులై యుండిరి ఆద శ్యమును గాంచి తన కిక ఉపవాసమే శరణ్య మని భావించి శ్రీకృష్ణదాసు సింహద్వారమున కడ్డముగ విశ్రమించెను అర్ధరాత్రిదాటుచుండగ అలికిడివలన శ్రీకృష్ణదాసు నిద్రమేల్కాంచెను తనసమ్ముఖమున ఒకవికృతాకారుడు గోచరించెను వా డత్యంతభయంకరముగ యమకింకరునివలె నుండెను మొదట ఆభీకరాకారుని గాంచి చలించినవాడై శ్రీకృష్ణదాసు ఎవరు నీవని ప్రశ్నించెను అపు డాభయంకరాకారి "బ్రాహ్మణోత్తమా! నేనొక బ్రహ్మరాక్షసుడను నీవు సింహద్వారమున కడ్డముగ శయనించి యున్నయీగృహ మొక జమీందారునిది వానితో నాకు పూర్వజన్మవైరము కలదు

ున కొకకుమార్తె కల్గెను ఆమెయనంతరము వరుసగా ఎనమండుగురు పుత్రులు కల్గిరి నాజన్మస్వభావమైన ద్వేషకారణమున జమీందారుని పుత్రహీనునిగ నొనరింపవలె నని నేను నిశ్చయించుకొంటిని జన్మించిన మరుక్షణములోనే ఆబిడ్డలను సంహరించుచుంటిని జ్యేష్ఠసంతానము పుత్రిక కావున ఆమెకుమాత్రము అపకారమొనరింపక మిన్నకుంటిని ఆజమీం

దారుభార్య పదియవసంతానమునుగనుటకు వేదనబడుచుండెను. మరల వారికి పుత్రోదయము కాగలదు నేను ఈశిశువును గూడ సంహారింప నిశ్చయించితిని నీవు సింహద్వారమున కడ్డముగ పరుండియున్నావు నీఉత్తరీయమందు భగభగమండు చున్న అగ్నిగోళమున్నది ఆగోళమే నిన్ను ఈగృహమువారిం దరిని నానుండి రక్షింపగల్గుచున్నది ఎందులనో నిన్నుగాంచిన క్షణమందే నానోరు అసత్యమును బల్కుటలేదు బ్రాహ్మణోత్తమా! నీ వీప్రదేశమును వీడిపొమ్ము నీవు నీయగ్నిగోళము ఈప్రదేశమున నున్నంతకాలము నేనిహర్మ్యమును ప్రవేశింపజాలనని'' పల్కెను బ్రహ్మరాక్షసుడు పల్కిన పల్కుల నాలకించి శ్రీకృష్ణదాసు ఆశ్చర్యచకితుడై తనయుత్తరీయములో భగభగమండుచున్న అగ్నిఏమిటి యనిచూచెను అది గురుదేవు లొసంగిన పాదధూళియే యనిగ్రహించి శరీరమంతయు పులకింపగ సాశ్రుపూర్ణనయనుడై గద్గదకంఠముతో ఉచ్చైస్స్వరముతో గురుదేవునిదివ్యనామమును కీర్తింపనారంభించెను తనయుత్తరీయమందు భద్రపరచియుంచిన గురుదేవులొసంగినమృత్తికను ఆబ్రహ్మరాక్షసునిపై జల్లెను ఆసమయమందే గృహములో జమీందారుభార్య కుమారుని ప్రసవించెను సంతానము పుట్టినప్పుడు మరణించినప్పుడు వారెనిమిది పర్యాయములు దుర్భరగర్భశోకము ననుభవించిరి కానీ నే డీశిశువు మరణింపలేదు అందరు పరమాశ్చర్యచకితులై సింహద్వారము నుండి వచ్చుచున్న దివ్యమంత్రము నాలకించిరి శ్రీరాఘవేంద్ర

తీర్థస్వామి దివ్యనామము కర్ణములందు సోకగనే మృత్తిక శరీరమును దాకగనే ఆబ్రహ్మరాక్షసుని దేహము అగ్నికి ఆహుతి కాగా ఆత డాక్రందనముచేయుచు భస్మమయ్యెను. ఈకోలాహలము నాలకించి గృహములోనివారందరు బయటకు పరుగిడి వచ్చి మంటలలో దగ్ధమగుచున్న వికృతాకారుని, సింహద్వారముచెంత నిలుచుండి మంత్రము నుచ్ఛరించుచున్న ఈనవయువకుని గాంచి విషయముదెలియక ఆశ్చర్యమగ్నులైరి.

అగ్నిజ్వాలలలో భస్మమగుచున్న ఆ బ్రహ్మరాక్షసుని దేహమునుండి ఒక వెలుగు బయల్వెడలి ఊర్ధ్వముఖముగ పయనించెను. గురుదేవుని నామమహాత్మ్యము నెఱిగి శ్రీకృష్ణదాసు పరమానందభరితుడయ్యెను. జమీందారు మొదలగువారందఱు శ్రీకృష్ణదాసుచుట్టూ చేరి మహాత్మా! తా మెవ్వరు ? ఈ విచిత్ర మేమి యని ప్రశ్నించిరి. శ్రీకృష్ణదాసు జరిగినదంతయు చెప్పగా జమీందారుతోపాటు కుటుంబసభ్యులందఱు జన్మించిన బాలకుడు మృతినొందక జీవించుటకు కారణము ఈమహాత్ముని సన్నిధానమే యనిగ్రహించి శ్రీకృష్ణదాసుపాదములపై బడిరి. ఆయనను సాదరముగ గృహములోనికాహ్వానించి అర్ఘ్యపాద్యాదులచే సత్కరించిరి మహాత్మా! మీరు వధువు నన్వేషించుచు మాగ్రామము జేరి మమ్ముల నందఱిని దుస్సహపుత్రదుఃఖము నుండి సంరక్షించిరి. మమ్ము వీడి పోవలదని ఆయనను అనేక విధముల ప్రార్థించిరి జమీందారు ముకుళితహస్తుడై బ్రాహ్మ

ణోత్తమా! నాజ్యేష్ఠపుత్రిక సౌందర్యవతి, సద్గుణవతి ఈమెను పరిణయమాడిఆజన్మాంతము మాగృహమందే యుండి మమ్ములను ధన్యుల జేయవలసినదిగా ప్రార్థించుచున్నాడనని బల్కెను

గురుదేవుని నామమహాత్మ్యమును, ఆశీర్వాదబలమును ప్రత్యక్షముగ దర్శించిన శ్రీకృష్ణదాసుమనసులో గురువుయెడల శ్రద్ధాభక్తులు ఇనుమడించెను గృహస్థాశ్రమము స్వీకరింపవలెనని సంకల్పించినాడు గావున జమీందారుని ప్రార్థనలను మన్నించి ఆయనపుత్రికను పాణిగ్రహణముచేసి శ్రీకృష్ణదాసు గృహస్థుడయ్యెను గురుదేవుని విడి జీవించుట అసంభవ మని యెఱిగిన వాడై శ్రీకృష్ణదాసు మామగారియనుజ్ఞ గైకొని సాధ్వీలలామ యైనసహధర్మచారిణితో బయలుదేరి ఆశ్రమమునుజేరి గురుదేవునిచరణకమలముల నాశ్రయించెను శ్రీరాఘవేంద్రతీర్థ యతీంద్రులు ఆదంపతుల నాశీర్వదించి అనుగ్రహించిరి శ్రీకృష్ణదాసు ఉత్తమగృహస్థు, భగవద్భక్తుడునై సత్సంతానమును బడసి జీవితాంతము గురుదేవుని సేవించుచు తనజన్మను చరితార్థమొనరించుకొనెను,

— o —

# ఆశ్రితజన వాత్సల్యము

అది పదునైదవ శతాబ్దము విజయనగర సామ్రాజ్యము అత్యున్నత స్థితిలో నున్న శుభసమయము శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి ఆకాలములో శ్రీవ్యాసరాయతీర్థులు గానుండిరి శ్రీవారు వృద్ధులైరి సంచారమును నిలిపి పెక్కుకాలము భావ సమాధిలో నుండసాగిరి హంపీలోగల చక్రతీర్థము చెంత నివ సింపసాగిరి నాటి విజయనగరపాలకులు త్రిసంధ్యల యందు స్వామిని దర్శించెడివారు శ్రీస్వామివారు అప్పుడప్పుడు శ్రీపురందరదాసు, శ్రీకనకదాసు, శ్రీవాదిరాజతీర్థస్వాములు మొదలగువారిని సమావేశపరచి శ్రీహరివాయుదేవుల దివ్యలీల లను చర్చించెడివారు ఒకప్పుడు చర్చలో జన్మ పునర్జన్మ వారి చర్చనీయాంశ మయ్యెను అపుడు శ్రీవ్యాసరాయతీర్థు లిట్లుపల్కిరి "మహాశయులారా! ఈజన్మ పరిసమాప్తము కానున్నది కాని మనకు శ్రీమూలరాముని యారాధనములో తృప్తి కలుగదయ్యె" అపుడు కనకదా సిట్లుపలికెను "దేవా! అటులైన తమరు మరల భూమిపై అవతరింపగలరు కనకదాసు యమాంశచే అవతరించినభక్తుడు స్వామీ! ఈపురందరదాసుకు ముక్తి కల్గునా యనిపలికెను అపుడు వ్యాసరాయలవారు అదెట్లుజరుగును ఈయన యింకను ఆఱు జన్మము లెత్తవలసి యుండె ననిపలికిరి మరి శ్రీవాదిరాజతీర్థస్వాములవారి విషయ మేమి యని కనకదాసు ప్రశ్నించెను అపుడు స్వామి శ్రీవాదిరాజ

తీర్థస్వామి యీ భూమిపై వేలకొలది సంవత్సరములు విరాజిల్లగలరు, వారి కొఱకై ఎందులకు ఆలోచింతు వని పల్కెను అపుడు కనకదాసు ప్రభూ! మరి యీదాసునకు ముక్తి యెప్పుడని పలికెను అపుడు శ్రీ వా రాయ తీర్థస్వామి కనకదాసా! నీవు మరల జన్మింపవలెను ప్రారబ్ధము నెవరైనను అనుభవింప వలసినదే నీవు మరుజన్మములో నీ ప్రారబ్ధశేషము ననుభవించి నన్ను దర్శించి భవబంధ విముక్తుడ వయ్యెదవని పలికెను

తదనంతరము శ్రీవ్యాసరాయ తీర్థస్వామి శ్రీరాఘవేంద్రునిగా అవతరించి పీడిత మానవాళి నుద్ధరించుటకు దేశాటన మొనరించుచు మానవి యను గ్రామమందు గల శ్రీ వీరాంజనేయస్వామి దేవాలయములో చాతుర్మాస్య మొనరించుచుండిరి చాతుర్మాస్య వ్రతసమయములో ఆషాఢశుద్ధ ద్వాదశి నుండి శ్రావణశుద్ధ ద్వాదశివఱకు ఆహారమందు కొన్ని పదార్థములను (చింతపండు, పచ్చిమిరప, ఆవాలు మొదలగునవి) వర్జించుట సాంప్రదాయకమై యున్నది, దీనినే వ్రతనిష్ఠ యని కూడ నందురు

శ్రీరాఘవేంద్రస్వామి చాతుర్మాస్య వ్రత మొనరించుచున్న సమయములో ఆ ప్రదేశమునకు ఒక హరిజనుడు అరుదెంచెను అతడు స్వామికి సాష్టాంగ దండ ప్రణామ మొనరించెను, ఆవ్యక్తినిగాంచగనే స్వామి "కనకదాసా! ఎన్నాళ్ళకు

నిన్ను గాంచితిని నీ ప్రారబ్ధానుభవము నేటితో అంతరించె"నని పలికిరి

శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి పలికిన మధుర వచనముల నాలకింపగనే హరిజనునకు పూర్వస్మృతి కల్గెను ఆతడు శ్రీవారి పాదములపై బడి గురుదేవా శ్రీవా సరాయ యతీంద్రా క్షుద్ర మగు ఈ మానవ జన్మమును నేనుం భరింప లేను నాకర్మములను బాపి నాకు పరంధామమును అనుగ్రహింపుమని ప్రార్థించెను అపుడు శ్రీవారు "కనకదాసా! భగవంతునకేమి కానుక తెచ్చితి"వని ప్రశ్నించెను అందులకు కనకదాసు "స్వామీ! నేను కటిక దరిద్రుడను కావున నావద్దయున్న ఈ గుప్పెడు ఆవాలను మాత్రమే సమర్పింప గల"నని పల్కి తన చెంగులో కట్టియున్న ఆవాలను శ్రీవారి కర్పించెను శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి అంత ప్రసన్నులై భక్తు డర్పించిన ఆ ఆవాలను త్ప్రసాదములో వినియోగింప వలసినదిగ పలికిరి

చాతుర్మాస్య దీక్షలో నున్నవారు కొన్ని పదార్థము లను విసర్జింప వలెను ఆపదార్థములో ఆవాలు ఒకటి శ్రీవారు ఆవాలను ప్రసాదములో వినియోగింపుడని పల్కుటగాంచి ఇతరత్ర శిష్యులు, గ్రామ పెద్దలు ఆశ్చర్య చకితులైరి అది గాంచి శ్రీవారు ఇట్లు పలికెను 'భక్తులారా! భగవంతుడు భావమయుడు, భక్తపరాధీనుడు ఈ హరిజన రూపములో నున్న కనకదాసు పరమ భాగవతోత్తముడు ఆ జగన్నాథుడు

మధురాతి మధురములగు పదార్థములనైనను స్వీకరింపడు పత్రపుష్ప ఫలతోయములు (నీరు) అయినను భక్తుడొసంగినచో ప్రేమతో స్వీకరించును శ్రీరామచంద్రుడు శబరి ఎంగిలి పండ్లను గింపలేదా ? శ్రీకృష్ణుడు విదురుడొసంగిన అరటి తొక్కలను కరింపలేదా ? కుచేలుడొసంగిన అటుకుల నారగింపలేదా ? కావున పరమ భక్తుడగు నీ కనకదాసొసంగిన ఆవాలు పరమపవిత్రములు భగవంతుని నివేదనకు యీ ఆవాలే అర్హతను కల్గియున్నవి'

శ్రీవారు హరిజనుని రూపములో నున్న కనకదాసుని గాంచి నదీస్నానము చేసి శుచియై రమ్మని పల్కెను నాటి మహా నైవేద్యములో ఆవాలు కలుపబడెను నివేదనానంతరము ఆవాలు కలిపిన మహానైవేద్యము సంతర్పణలో వినియోగింపబడెను కనకదాసు నదీ స్నానమాచరించి శుచియై శ్రీఆంజనేయస్వామి దేవాలయమున కఱుదెంచి ధ్వజస్తంభము చెంతనతము స్తకుడై నిలువబడెను శ్రీవారు భక్తుని గాంచగనే దిగ్గున లేచి అత్యంతాను గ్రహముతో మహానివేదనమును కనక దాసున కొసంగిరి మహానివేదనము నారగించి శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి అనుగ్రహమునకు పాత్రుడై భవబంధములను తెంచుకొని అర్చిరాది మార్గమున కనకదాసు పరంధామమునకు జనెను

శ్రీరాఘవేంద్ర స్వామి ఒక మహాభక్తు డర్పించిన ఆ యావాలను ప్రసాదముగ భావించి స్వీకరించెను. ఆహా! స్వామియొక్క ఆశ్రిత భక్తజన వాత్సల్యమేమి ? భక్తుని కొఱకు తమ చాతుర్మాస్య వ్రతనిష్ఠను గూడ నుల్లంఘించి ద్వాదశీ దినమున ఆవాలను అమృతముగ స్వీకరించెను. నాటి నుండి శ్రీరాఘవేంద్ర స్వామి మఠములో వ్రతదినములందు గూడ ఆవాలను స్వీకరించుట ఆచార మయ్యెను. శ్రీస్వామివారి మఠమును దక్షిణాది మఠమని వ్యవహరింతురు.

— o —

## బిదరహళ్లి శ్రీనివాసతీర్థులు

ధార్వారు జిల్లాలో బిదరహళ్లి యను గ్రామము కలదు. ఆగ్రామములో కృష్ణమాచార్యుడను సద్బ్రాహ్మణుడు తిరుమలాంబ యను సహధర్మచారిణితో నివసించు చుండెను. వారి కులదైవము వేంకటాచలముపై విరాజిల్లి యున్న శ్రీవేంకటేశ్వర విభుడు. వారు మధ్వ సంప్రదాయమును త్రికరణ శుద్ధిగ ఆచరించుచున్న ఉత్తములు. వారికి శ్రీనివాసుని యనుగ్రహము వలన ఒకకుమారుడు కలిగెను. వానికి తల్లిదండ్రులు శ్రీనివాసా

చార్యులని నామకరణము చేసిరి శ్రీనివాసాచార్యులు తన ప్రాథమిక విద్యాభ్యాసమును తండ్రియొద్దనే ముగించుకొని మధ్వ సంప్రదాయ మందు గల ఉన్నత విద్య నభ్యసించుటకై శ్రీయాదవార్యులనెడి గురుదేవు నాశ్రయించెను

శ్రీ యాదవార్యులు ఒక గృహస్థు ఆయన తపస్వి, జ్ఞాని, కర్మిష్ఠి, భక్తుడు గృహస్థాశ్రమమున నున్నను ఆయన సర్వసంగ పరిత్యాగివలె జీవించు చుండెను శ్రీయాదవార్యులు వేదవ్యాస భగవానుని భక్తులు యాదవా లు పిలచిన వ్యాసదేవుడు పలికెడి వాడట !

ఆ మహాత్ముని చెంత శ్రీనివాసాచార్యులు అనేక మధ్వ సంప్రదాయ గ్రంథముల నధ్యయనముచేసి ఉద్దండ పండితుడై గురుదేవు నను గ్రహమును బడసి తన స్వగ్రామమునకు మరలి వచ్చెను బ్రహ్మచర్యాశ్రమమును విసర్జించి శ్రీనివాసాచార్యులు గృహస్థాశ్రమమును స్వీకరించి తన గురుదేవులైన శ్రీయాదవార్యునివలె వైరాగ్య యుక్తమైనజీవనమును గడుపు చుండెను

శ్రీనివాసాచా లు శ్రీమదానంద తీర్థులయొక్క గ్రంథములపై వ్యాఖ్యానములను రచింపదొడంగెను

శ్రీనివాస తీర్థులు శ్రీరాఘవేంద్రవైభవమును పెక్కండ్రు భక్తులద్వారా తెలిసికొనెను శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి సర్వజ్ఞ

డని, త్రికాలజ్ఞుడని, ఘటనా ఘటన సమర్థుడని, నిగ్రహానుగ్రహ సమన్వితుడని, మధ్వశాస్త్రములందు మహావిద్వాంసుడని, మహాభక్తుడని శ్రీనివాసాచార్యులు తెలిసికొని మంచాల గ్రామమునకు అపుడపుడు వెళ్ళుచు స్వామివారితో సాంగత్య మొనరించు చుండెను ఒకప్పుడు స్వామి యాశ్రమములో ఒక విచిత్ర సంఘటనము సంభవించెను శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి తాను రచించిన భాష్యములను సరిచూచు కొనుచుండెను ఒక భాష్యములో కొంత మార్పు చేయవలసి వచ్చెను కాని వారివద్ద వ్రాతపరికరములు లేవు, అపుడు స్వామి వాటిని తెప్పించుటకు అటునిటు దృష్టి సారించిరి కాని దాపులలో ఆశ్రమ శిష్యులెవ్వరును లేరు శ్రీనివాసాచా లు స్వామికి కొంత దూరములో కూర్చుండి గ్రంథా లోకన మొనరించు చుండెను సా మి శ్రీనివాసా చార్యులను వ్రాత పరికరములను ఎవరి చేతనై పంపించవలసినదిగ కోరిరి అపుడు వెంటనె శ్రీనివాసాచార్యులు లేచి పరిశుభ్రమైన వస్త్రములను ధరించి తన సిరాపాత్రను, కలమును స్వామి ముందుంచెను శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి శ్రీనివాసాచా ని వస్త్రధారణను గాంచి ఆశ్చర్య చకితులై యిట్లు బల్కిరి ఆచార్యా ! మీారే స్వయముగ వ్రాతపరికరములను తీసికొని రావలసినదిగా మేము చెప్పలేదే, ఎవరిచేతనైన పంపవలసినదిగా కోరినాము కాని మీారు వ్రాతపరికరములను దెచ్చుటకు పవిత్రవస్త్రముల నేల ధరించి తెచ్చితిరి" అందులకు శ్రీనివాసాచార్యు లిట్లు ప్రత్యుత్తర

మొసంగెను "దేవా ! గంగానది ప్రతిసంవత్సర మొక శుభ ముహూర్తమున తుంగభద్రను ప్రవేశించును ఆ పవిత్ర సంగమ సమయమందు దివ్యజలములను నేను స్వీకరించి యీసిరాను తయారు చేసికొంటిని, కావున యిది పరమ పవిత్రము ప్రతి దినము నేను స్నానానంతరము పవిత్ర వస్త్రములను ధరించి యీ వ్రాతపరికరములచే నారచనలను సాగించెదను, తదుపరి వాటిని (వ్రాతపరికరములను) దైవసన్నిధియందుంచెదను మరల స్నానమాచరించెడి వరకు వాటిని ముట్టెడి వాడను కాను"

అపుడు శ్రీరాఘవేంద్రస్వామి పరమానంద భరితుడై "ఆచార్యా ! మీ వ్రాతపరికరములే అంత పవిత్రమైనచో మీరచన లెంతపవిత్రములో కదా ! మీరచనలను పరికింపవలె నని నాకు కుతూహలముగ నున్నదని" పలికెను

అపుడు వెంటనే శ్రీనివాసాచార్యులు తనరచనలను తెచ్చి శ్రీరాఘవేంద్ర తీర్థుల సమక్షమున నుంచిరి శ్రీస్వామి శ్రీనివాసాచార్యుని గ్రంథములను కొన్ని దినములు పరికించి అవి మధ్వ సాహిత్యములో మణిమకుటములని గ్రహించెను శ్రీస్వామి ఆనంద బాష్పసమన్వితుడై యిట్లు బల్కెను "ఆచార్యా ! నీ వెంతో ధన్యుడవు, నీ యీ గ్రంథములు మధ్వ సాహిత్యములో అత్యుత్తమములు, నీ జీవనము పవిత్రము, నియమ బద్ధము నీవు తపస్వివి, ధ్యానపరుడవు, కర్మానుష్ఠాన పరాయ

ఋషివు నీవు గృహస్థాశ్రమములో నున్న యతీశ్వరుడవు నీ యీ భాష్యగ్రంథములు, అక్షరములు నిత్యములు, మధురాతి మధురములు "

మరునాడు శ్రీరాఘవేంద్రతీర్థ స్వామి విద్వజ్జన సభ నేర్పాటు గావించెను ఆ మహాసభలో శ్రీస్వామి శ్రీ బిదరహళ్లి శ్రీనివాసా చార్యులను హృదయపూర్వకముగ అభినందించెను ఆయనకు ఉన్నతాసనము నొసంగి గౌరవించెను సభలోని విద్వాంసు లందఱు ప్రస్తుతించు చుండగ శ్రీరాఘవేంద్ర తీర్థ స్వామి శ్రీ శ్రీనివాసాచార్యునకు తీర్థులని బిరుదు నొసంగి బంగారపు తీగలచే అలంకరింపబడిన దుశ్శాలువను గప్పి ఒక పెద్ద పళ్ళెరము నిండ వెండినాణెములను నింపి సత్కరించెను ఆ దినమునుండి శ్రీనివాసాచార్యులు బిదరహళ్లి శ్రీనివాసతీర్థులుగ ప్రసిద్ధికెక్కెను ఈ తీర్థులనెడి బిరుదు కేవలము సర్వసంగ పరిత్యాగులైన యతీశ్వరులకే లభించును కాని శ్రీనివాసా చార్యునకు రాఘవేంద్రుని యనుగ్రహము వలన గృహస్థాశ్రమము లోనే లభించెను

తనకు ఈ విద్వత్సత్కారము లభించుటకు కారణము తన గురుదేవులైన శ్రీయాదవార్యులని శ్రీశ్రీనివాసతీర్థులు నిర్ణయించుకొని యీ విషయము నంతయు గురుదేవులకు విన్నవించుటకై ఎక్కండి (శ్రీయాదవార్యుల వారుండుప్రదేశము) బయలుదేరుటకు సంకల్పించెను

కర్మలు మూడు విధము లని చెప్పబడెను జీవుడు భవబంధములను తెంచుకొనవలె నన్న యీ మూడు కర్మలను అనుభవింపక తప్పదు అవి 1 సంచితము 2 ఆగామి 3 ప్రారబ్ధము

సంచితాగామి కర్మలు తపస్యాదులచేత, సద్గురుదేవుని యనుగ్రహముచేత నివారింపబడగలవు కాని ప్రతిజీవుడు ఎంతటి వాడైనను ప్రారబ్ధ మనుభవించిన యనంతరమే యీ జనన మరణ చక్రమును దాటగలడు

ఎంతటి విద్వాంసు డైనను తపస్సంపన్ను డైనను శ్రీనివాసతీర్థులు తన ప్రారబ్ధకర్మ ననుభవింపక తప్ప లేదు శ్రీనివాసతీర్థుల వంశీయులు ఉత్తరాది మఠమునకు శిష్యులు శ్రీరాఘవేంద్ర తీర్థస్వాముల మఠము దక్షిణాది మఠముగ వినుతికెక్కెను

కొన్ని మాసములలో వైష్ణవులు కొన్ని యాహార పదార్థములను విసర్జింతురు దానిని వ్రతమందురు ఉదాహరణ మునకు ఆషాఢ శుద్ధ ద్వాదశినుండి శ్రావణశుద్ధ ద్వాదశివరకు చింతపండు రసమును, పచ్చిమిరపకాయలను, ఆవాలను, భోజన మందు విసర్జింతురు కాని శ్రీరాఘవేంద్రుని మఠమందు వ్రత సమయమున ఆవాలను మాత్రము స్వీకరించు ఆచారము కలదు

బిదరహళ్లి శ్రీనివాసతీర్థులు ఆషాఢ శుద్ధ ద్వాదశి దినమున భోజనా నంతరము ఎక్కుండికి బయలు దేరుటకు నిర్ణయించు కొనిరి. ఆశ్రమములోని భోజనశాలలో ద్వాదశి పారణకు భగవత్ప్రసాదముసిద్ధము జేయబడెను. శ్రీరాఘవేంద్రస్వామి చెంత శ్రీనివాసతీర్థులకు భోజనము వడ్డింపబడెను.

భోజన సమయమున ఆశ్రమములోని వంటవారు ఆవాలు కలిపిన రసమును దెచ్చి మొదట శ్రీస్వామివారికి వడ్డించి తదుపరి శ్రీనివాసతీర్థులకు వడ్డింపబోయిరి. శ్రీనివాసతీర్థులు ఆరసమును తిలకించి శంకించి దీనిలో ఆవాలను కలిపితిరా యని ప్రశ్నించెను. అందులకు ఆవంటవాడు అవునని పలికెను. అపుడు శ్రీనివాసతీర్థులు వ్రతమందు ఆవాలను మేము స్వీకరింప మని పలికెను. అపుడు శ్రీరాఘవేంద్రస్వామి వంటవాని నుద్దేశించి "ఏమయ్యా"! శ్రీనివాసతీర్థులు ఉత్తరాది మఠమునకు జెందిన వారని తెలియదా ? కావున వెంటనే ఆవాలను కలపని రసమును దెచ్చి వారికి వడ్డింపు' మని ఆదేశించిరి.

శ్రీస్వామి యాజ్ఞాను సారము శ్రీనివాస తీర్థులకు ఆవాలు కలపని రసమే వడ్డించుట జరిగెను. భోజనానంతరము శ్రీశ్రీనివాస తీర్థులు ఎక్కుండికి బయలు దేరిరి. అపుడు శ్రీస్వామి తీర్థులకు మంత్రాక్షతల నొసంగి యెంతయో గౌరవించి పంపిరి. అయిదు దినములు ప్రయాణ మొనరించి శ్రీనివాస తీర్థులు ఎక్కుండి చేరెను.

మహాత్ముఁడు, దైవస్వరూపుఁడైన శ్రీరాఘవేంద్ర తీర్థ స్వామిచే మన్ననల నొంది తనశిష్యుఁడు వచ్చుచున్నాఁడని శ్రీయాదవార్యులకు తెలిసెను ఆయన తన శిష్యునకు స్వాగతము పల్కుటకు సిద్ధముగా నుండెను శ్రీనివాసతీర్థులు ఏగుదెంచి గురుదేవునకు సాష్టాంగదండప్రణామ మొనరించుట కుద్యుక్తుఁడయ్యెను తనశిష్యుని దూరమునుండియే గాంచి అసహ్యముతో శ్రీయాదవార్యులు కర్కశకంఠముతో నిట్లు బల్కెను "తిరిగిపొమ్ము, నన్నంటకుము, నీకుటుంబములో నెవరైన మరణించిరాయేమి? పంచమహాపాతకములలో దేనినైన ఆచరించితివా? భగవంతునకు అసంతుష్టికరము లైనకార్యముల నేమైన యొనరించితివా? ఏమి జరిగెను? నీచుట్టును పాపభూయిష్టమైనవాయువు ప్రసరించు చున్నది"

అపుడు భయకంపితుఁడై వణకుచున్నకంఠముతో శ్రీనివాసతీర్థులు "గురుదేవా! నేను పవిత్రుఁడను, నావలన నెట్టియపరాధము జరుగలేదు నన్ను శ్రీరాఘవేంద్రతీర్థస్వామి అభినందించి, గౌరవించి, సత్కరించి, ఆదరించి పంపిరి నాకు తీర్థులనుబిరుదు నొసంగిరి' యనిపలికెను

అవి యన్నియు నాకు తెలియును, కాని బయలు దేరుటకు ముందు నీకు స్వామి ఫలమంత్రాక్షతల నొసంగిరా! లేదా? యని శ్రీయాదవార్యులు ప్రశ్నించిరి అందులకు శ్రీనివాసతీర్థులు 'అవు నని పలికి, తనకొంగున కట్టబడియున్న ఫల

మంత్రాక్షతలు బయటకుతీసెను అరుణ వర్ణముకోను వలసిన మంత్రాక్షతలు కారునలుపుగ మారుట గాంచిన శ్రీయాదవార్యులు, శ్రీనివాసతీర్థులు సభాసదులందరు పరమాశ్చర్యచకితులైరి అపుడు శ్రీయాదవార్యులు దృఢమైన వాణితో నిట్లు పల్కెను "శ్రీనివాసా! ఏయపరాధమొనరించితివి, శ్రీరాఘవేంద్రస్వామి బృందావనములో నీవొనరించిన దానిని నాకు పూర్తిగ వివరింపుము

శ్రీనివాసతీర్థులు ఆశ్రమప్రాంతములో జరిగిన దానిని విన్నవించుచు తాను ఆవాలతో కూడియున్న రసమును స్వీకరింపక తన వ్రతనిష్ఠను నిలుపుకొన్న ఉదంతమును గూడ చెప్పెను అపుడు శ్రీయాదవార్యులు "అదియే నీవొనరించిన యపరాధము ఆమహాత్ముని యెదుట నీవెంతకర్కశముగ ప్రవర్తించితివి ? నీగొప్పతనమును ఆదైవస్వరూపు నెదుట ప్రదర్శించితివి నీవుడుత్తరాది మఠమునకు చెందిన వాడవని, తెలియనట్లు ప్రవర్తించితివి వ్రతసమయమున ఆవాలను స్వీకరింపరాదను విషయము శ్రీరాఘవేంద్రతీర్థస్వామికి తెలియనట్లు ప్రవర్తించితివి మూర్ఖుడా! శ్రీరాఘవేంద్రు లనగా నెవరనుకొంటివి ? సామాన్యసన్యాసి యనియనుకొంటివా ? ఆయన సర్వజ్ఞుడు, సర్వదర్శకుడు, సర్వాంతర్యామి, ఆయన కినుక వహించిన ఆక్షణమందే నీవు భస్మమైయుండెడివాడవు, కాని ఆమహాత్ముడు కరుణాంతరంగుడు, సాక్షాత్తుగ భగవంతుని

ఆయన హృదయమందు విరాజిల్లి యున్నాడు ఆ పవిత్ర మూర్తియెదుట యెట్లుప్రవర్తింపవలెనో విద్యాధికుడ వైననీకు తెలియదా ? వెంటనే శ్రీరాఘవేంద్రతీర్థస్వామి చెంతకు వెడలి ఆయన పాదములపై బడి క్షమాభిక్ష నర్థించి పవిత్రుడవై నావద్దకు రమ్ము'అని పలికెను

బిదరహాల్లి శ్రీనివాసతీర్థులు పవిత్ర జీవనమును గడుపు చున్న భక్తుడు కాని, అతని ప్రారబ్ధము అతనిచే నిట్లు గురు జనాపరాధ మొనరింపజేసెను అన్నియు తెలిసియు తెలియని వాడయ్యెన ఆహా ! ప్రారబ్ధానుభవ మెంతపని చేసెను వెంటనే శ్రీనివాసతీర్థులు మంచాలకు తిరిగివెళ్ళి శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి పాదములపై బడి ఉచ్చైస్స్వరముతో విలపించుచు తన యపరాధమును క్షమింప వలసినదిగ ప్రార్థింప దొడంగెను అపుడు శ్రీస్వామి కృపాదృక్కులను ప్రసరింపజేయుచు ' శ్రీని వాసా ! నీవు నీ విద్యాగురువుకడకు చేరితివికదా ! ఆయన నిన్ను మరల ఇక్కడకు పంపినాడు కదా ! యని పలికెను అపుడు శ్రీనివాస తీర్థలు "మహాత్మా ! నీవు సర్వాంతర్యామివి భూత భవిష్యత్వర్తమానముల నెఱింగిన సర్వజ్ఞుడవు, నేను అజ్ఞానిని, మూర్ఖుడను, నీవు గొప్పవాడవు, దైవస్వరూపుడవు, నేను దీనుడను, హీనుడను, పాపిని, నన్ను క్షమింపుడు నన్ను ఎక్కడికి పంపకుండ మీరే వేలశిక్షింపరైరి నన్ను క్షమిం

పుడు, నన్ననుగ్రహింపు డని యనేకవిధముల ప్రార్థింప దొడంగెను.

ఆ దినముననే శ్రీస్వామివారి సరసన శ్రీనివాసతీర్థులకు గూడ భగవత్ప్రసాదము వడ్డింపబడెను. అందు ఆవాలతో గూడిన రసముకూడ వడ్డింపబడెను. శ్రీనివాసతీర్థులు పశ్చాత్తప్త హృదయుడై భక్తితో ఆ రసమును స్వీకరించెను. భోజనానంతరము శ్రీరాఘవేంద్రతీర్థుల పాదముల నాశ్రయించి ఆయన యనుగ్రహమునకు పాత్రుడై ఫలమంత్రాక్షతలను బొంది పాప విముక్తుడయ్యెను. తదనంతరము శ్రీస్వామివారి యనుమతి గైకొని తనవిద్యాగురువులైన శ్రీయాదవార్యులను దర్శించుటకు ఎక్కండి బయలుదేరెను.

— o —

# శ్రీరాఘవేంద్రతీర్థస్వాముల పూజారులు

భగవద్భక్తు లైనవారు తీర్థయాత్రల నొనరించుచు పవిత్రక్షేత్రములను దర్శించి పవిత్ర నదీజలములందు స్నాన మాచరించుచు దేశాటన మొనరింతురు దక్షిణభారత దేశములో ఒక గ్రామమందు ముగ్గురు సద్బ్రాహ్మణులు కలరు వారు భగవద్భక్తులు, పవిత్రాచరణముగల ఆదర్శగృహస్థులు, సతతము శ్రీహరినామ సంకీర్తనపరులు మిత్రులు ఈ ముగ్గురు మధ్వసాంప్రదాయమునకు జెందినవారు విద్వాంసులు వారు శ్రీమధ్వాచార్యులు శాసించిన ప్రకారము తమ జీవనమును గడుపుచున్న పవిత్రులు వారు తీర్థయాత్రల నొనరించుచు బళ్ళారి ప్రాంతమున కరుదెంచిరి ఆదోని చెంత మంచాలలో శ్రీరాఘవేంద్రతీర్థు లనుముఖ్య యతీశ్వరుడు విరాజిల్లియున్నా డని తెలిసికొని ఆయనను దర్శింపవలెనని, పవిత్రతుంగభద్రా నదీజలములందు స్నానమాడవలె నని బయలుదేరిరి మార్గ ములో శ్రీరాఘవేంద్రతీర్థస్వామి యొక్క అద్భుతము లైన లీలలను, తపశ్శక్తిని, మహత్తరమైన అనుగ్రహశక్తిని, మధ్వ సాహిత్యమందుగల విద్వత్తును, వీటన్నింటికంటె అపరోక్ష జ్ఞానమును సర్వజ్ఞత్వమును, సర్వవ్యాపకత్వమును ప్రజలు ఇంటింటను చర్చించుకొనుట ఆలకించిరి వారు ఈవిషయముల నన్నింటిని విని ఆశ్చర్యచకితులైరి ఒకే వ్యక్తి అసంఖ్యాకము లైన సిద్ధులను కల్గియుండుట అసంభవమని, గోరంతలు

కొండంతలుచేసి శ్రీస్వామివారి నాశ్రయించిన జనులు ప్రచారము చేయుచుండ వచ్చునని భావించుకొనిరి ఎట్లైనను ఆయన మధ్వయతీశ్వరులు గావున ఆయనను దర్శించి ఆయన సిద్ధులను పరీక్షింపవలయు నని నిర్ణయించుకొనిరి వారు ముగ్గురు ఇట్లనుకొనిరి "మనము మనస్సులలో ఒక పదార్థమును తినవలయు నని సంకల్పించుకొనవలెను మంచాలలో మఠమందు భోజనసమయమున శ్రీస్వామి మనమర్థింపకుండగనే ఆ మూపదార్థములు మనకు వడ్డింపవలెనని కోరినచో అప్పుడు శ్రీస్వామి సర్వాంతర్యామి యని, సకలసిద్ధులు కలవాడని విశ్వసింపవలెను లేనిచో నెందఱో యతీశ్వరులవలె ఈయనకూడ ఒకసామాన్యుడని ఋజువు కాగలదు"

ఈయుపాయము అద్భుతముగ నున్నదని ముగ్గురు భక్తులు నిర్ణయించుకొని తమమనస్సులలో ప్రత్యేకపదార్థమును శ్రీరాఘవేంద్రస్వామిమఠములో భుజింపవలెనని నిర్ణయించుకొని దానిని బహిర్గతమొనరింపక మనస్సు లోనే యుంచుకొని మంచాలకు బయలుదేరిరి మధ్యాహ్నసమయమునకు మంచాల మఠముచేరి తుంగభద్రానదిలో స్నానమొనరించి శ్రీస్వామిని దర్శించు టుత్తమ మనితలంచి నదీ తీరమునకు జనిరి

నదీతీరములో ఒకబాలకుడు శ్రీస్వామివారివస్త్రములను నీటిలో తడిపి ఆరవేయుచుండెను అతడు ఈ ముగ్గురు బ్రాహ్మణులను చూడగనే "బ్రాహ్మణోత్తములారా! మీరు

విచ్చేయుడు మీరు కోరుకొనిన పదార్థములు సిద్ధముచేయ బడినవి భోజనసమయమందు అవి మీకు విడివిడిగ వడ్డింప బడగలవు ”

అనిపల్కి ఆబాలకుడు శ్రీవారివస్త్రముల దీసికొని వారి సమాధానమునకైనను ఎదురుచూడక మఠమునకు బయలు దేరెను ఆముగ్గురు బ్రాహ్మణోత్తములు ఈబాలకుడు సర్వజ్ఞునివలె మాటల పల్కుటగాంచి విస్తుపోయిరి శ్రీవారి వస్త్రములను స్పృశించుచున్నంతనే వానికి పరోక్షజ్ఞానము కలుగుచున్నదని విద్వాంసులైన యాబ్రాహ్మణులు గ్రహించిరి వస్త్రములకే యింతటి మాహాత్మ్యమున్న శ్రీవారిసన్నిధాన మెంతశక్తివంతమో వారూహించుకొనగల్గిరి ఆయన మూర్తీభవించిన అగ్నిహోత్రస్వరూపుడని, ఆయనను పరీక్షించుట మహాపాతకమని, ఆత్మహత్యాసదృశమని గ్రహించి పశ్చాత్తప్తహృదయులైరి వారు తమమనస్సును పవిత్ర మొనరించుకొని అంతభక్తినమ్రాత్మకంధరులై మఠమును జేరిరి

ఆగంతకులైన ఆయతిథులకు శ్రీస్వామియే స్వయముగ స్వాగతము పల్కుచు “బ్రాహ్మణోత్తములారా ! మీరు మధ్యాహ్నభోజనసమయమున కరుదెంచిరి, మీరు మా కతిథులు మీరు మా యాతిథ్యమును స్వీకరింపవలెను ” ఉచితాసనముల నొసంగి ఆశ్రమములో వంటవానిని ఆముగ్గురకు

వారు తమమనస్సులలో సంకల్పించిన పదార్థముల నొడ్డింప వలసినదిగ ఆజ్ఞాపించెను వారిలో శ్రీవారుగూడ ప్రసాదమును స్వీకరింపనారంభించిరి ఈముగ్గురు బ్రాహ్మణులు శ్రీస్వామి వారియపరోక్షజ్ఞానమును, మాహాత్మ్యమును వేనోళ్ళకీర్తించుచు భోజనము ముగించిరి తదనంతరము ఆబ్రాహ్మణోత్తములు శ్రీవారిపాదపద్మములపై బడి 'దేవా! మమ్ములను క్షమింపుము మేము కలుషితమనస్కులము, అజ్ఞానులము, మీయెడల అపరాధమొనరించినదౌర్భాగ్యులము తమయాశీర్వాదములను అభిలషింపవలసిన మేము మిమ్ములను పరీక్షించుటకు, మీ తపశ్శక్తి యెంతటిదో తెలిసికొనుటకు ప్రయత్నించితిమి దయామయుడవైన నీవు మమ్ములను అనుగ్రహించితివి మహాత్మా! మే మొనరించిన యీదుష్కృత్యమునకు పశ్చాత్తాపముచెంది మీపాదారవిందముల నాశ్రయించితిమి ఈదీనులను క్షమించి తమపదరేణువులుగ స్వీకరింపుడు మా జీవితాంతము మిమ్ములను ఆరాధించెదము మేమేకాదు, మావంశపారంపర్యముగ మీకు సేవ యొనరించి మేమొనరించిన యీభాగవతాపరాధమునుండి ముక్తిపొందెదము మా యీ అభ్యర్థనను అనుగ్రహింపు మనివిలపింపసాగిరి

సర్వజ్ఞుడైన శ్రీరాఘవేంద్రతీర్థస్వామి కరుణాంతరంగుడై 'బ్రాహ్మణోత్తములారా! మిమ్ములను త్వరగా నాసన్నిధాన మునకు జేర్చుటకే అదృశ్యశక్తి మిమ్ముల నట్లు ప్రేరేపించెను

పూర్వకాలమందు నాప్రహ్లాదావతారములో మీరు నాసహపాఠులు. నాయాధ్యాత్మికబోధల నాలకించి దైత్యకుమారులైనమీరు నన్నారాధింపవలెనని, నన్ను పూజింపవలెనని ప్రార్థించిరి; కావున నాటి మీయభ్యర్థనను నేటికి నేననుగ్రహించుచున్నాను. త్వరలో నేను బృందావనమును (సజీవ సమాధి) ప్రవేశింపవలెనని సంకల్పించితిని. నాబృందావన ప్రవేశానంతరము మీరు బృందావనపూజారులు కండు, ఒక్కొక్కరు ఒక్కొక్కసంవత్సరము బృందావనపూజారులుగ విధ్యుక్తధర్మములను నిర్వర్తింపుడు. మీరు, మీ వంశములవారు మంచాలలోనే నివసించి వంశపారంపర్యముగ బృందావన పూజారులుగ నుండి నాపరంధామగమనసమయమున ముక్తిని పొందెదరుగాక ! యని యనుగ్రహించెను.

తదనంతరము బృందావనప్రవేశసమయమున శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ఆమువ్వురుబ్రాహ్మణులను బృందావనపూజారులుగ నియమించెను. వారికి మంచాలలోనే మూడుగృహములను నిర్మించి కొంతమాన్యమునుకూడ నేర్పాటుచేసెను. వారిని వంశపారంపర్యపూజారులుగ నియమించినట్లు మూడు అధికారపత్రములను స్వహస్తములతో లిఖించి మఠముద్రికవేసి శ్రీస్వామివారు ఆమువ్వురుబ్రాహ్మణుల కొసంగెను. నేడు మంత్రాలయాంతర్గతబృందావనపూజారులైనవారు శ్రీవారి

యనుగ్రహపాత్రులైన ఆసద్బ్రాహ్మణవంశజులే నేటికి వారి వద్ద శ్రీవారు స్వహస్తములతో లిఖించి యొసంగిన అధికార పత్రములు కలవు



## జ్యోతిశ్శాస్త్రవేత్తలు

మళయాళదేశము (నేటి కేరళ) లో ముగ్గురు సద్బ్రాహ్మణులు కలరు వారు జ్యోతిశ్శాస్త్రములో ఉద్దండులు తమ శాస్త్రపటిమపై వారికి గర్వముకూడ కలదు మళయాళ దేశము జ్యోతిశ్శాస్త్రములో, హస్తసాముద్రికములో, టక్కుటుమారిమంత్రతంత్రాది వ ములలో ప్రసిద్ధము ఆ దేశములోని విద్యలను కొందఱు వినికూడ యుండక పోవచ్చును

జ్యోతిశ్శాస్త్రవిద్వాంసులైనయీ ముప్పురు బ్రాహ్మణులు జాతకములను పరిశీలించి సరియైన భవిష్యత్తును నిర్ణయింపగలదిట్టలు వారు విద్యాగర్వమునకు లోనై విజయ యాత్రకు బయలుదేరిరి ఒక్కొక్క సంస్థానమును జయించు

కొనుచు, దక్కనురాష్ట్రమును జేరిరి వారు శ్రీరాఘవేంద్ర స్వామిమహాశక్యములను విని వారిసంస్థానములోకూడ విజయ ప్రాప్తిని పొందవలె నని యెంచాలచేసిరి

వారు శ్రీవారియాశ్రమమునకు జని తమవిషయములను విన్నవించుకొనిరి శ్రీవారు వారి నాదరించి మరుసటిదినమున విద్వజ్జన సభను ఆయత్తపరచిరి మరునాడు ఈముగ్గురు పండితులు తమపాండిత్యప్రకర్షను ప్రదర్శించుటకు సభను జేరిరి శ్రీరాఘవేంద్రస్వామి ఆమహాసభకు యీముగ్గురుపండితులను పరిచయముచేసి వారికి ఒకజాతకము నొసంగి ముగ్గురు విడి విడిగ దానిభవిష్యత్తును శాస్త్రానుసారముగ వివరింపవలె నని వారికి రెండుజాములు సమయ మొసంగిరి ఆముగ్గురు పండితులు చక్కగ గుణించి ఆజాతకముయొక్క భవిష్యత్తును వేఱు వేఱుగ నిర్ణయించుకొని సభను ప్రవేశించిరి

మొదటిజ్యోతిశ్శాస్త్రవేత్త యిట్లుపల్కెను "ఆచార్యా! నాలెక్క ప్రకారము ఈజాతకుడు దీర్ఘాయుష్మంతుడు కాని ప్రజలకు యెనుబది సంవత్సరములవరకే గోచరింపగలడు"

రెండవజ్యోతిశ్శాస్త్రవేత్త యిట్లుపల్కెను "మొదట చెప్పినలెక్క తప్పు నాగణితప్రకారము ఈజాతకునకు యెనిమిది వందలసంవత్సరముల ఆయుర్దాయము కలదు"

రెండవపండితుని ఖండించుచు మూడవపండితు డిట్లు బల్కెను "మీయిద్దరియొక్క గణితము సరిగా లేదు ఈ జాతకునకు మూడువందలసంవత్సరములు మాత్రమే ఆయుర్దాయము కలదు"

ఒకేజాతకమునకు మూడువిధములైన భవిష్యత్తును బల్కుటను గాంచి ప్రజలందఱు వీరు అల్పవిద్వాంసులని, గొప్పలను చెప్పుకొనువారని, గర్విష్ఠులని అనేకవిధముల పలుకదొడంగిరి ఆముగ్గురుపండితులు గూడ ఒకేజాతకమునకు మూడువిధములైన భవిష్యత్తు లెట్లుసంభవమని, నీవు తప్పు యనగా నీవు తప్పు యనితర్కించుకొనదొడంగిరి

ఇంతలో సభలోనివిద్వాంసులు లేచి ఒకేజాతకమునకు మూడువిధములైనవ్యాఖ్యానము లెట్లుసంభవము లనియు, వీరు జ్యోతిశ్శాస్త్రపండితులుకారనియు నొక్కివక్కాణించిరి అందులకు సభాసదులందఱు ఆమోదముద్రవైచిరి విజయపత్రికకొఱకై వచ్చిన ఆముగ్గురుపండితుల పాండిత్యగర్వము నశించెను వారు తమవిద్యాహంకారము నాక్షణమందే వీడి పశ్చాత్తప్త హృదయముతో శ్రీరాఘవేంద్రతీర్థస్వామి దివ్య చరణారవిందముల నాశ్రయించిరి అప్పుడు శ్రీవారు వారి ననుగ్రహించి సభాముఖముగ ఆముగ్గురు పండితులు చెప్పినది యథార్థమని, వారు నిజమైన విద్వాంసులని ప్రకటించిరి అందులకు సభాసదు లాశ్చర్యచకితులై అదెట్లుసంభవమని

అసలు ఈజాతకమెవ్వరిదని ప్రశ్నించిరి అపుడు శ్రీవారు ఈజాతకము శ్రీవ ్వామిసేవకుడైన యీ వేనునదే యని తనహృదయమును తాకుచు పల్కిరి సభాసభలందఱు పరమాశ్చర్యచకితులై శ్రీవారిదివ్యమంగళవిగ్రహమును భక్తితో తిలకించుచు ఈమూడువ్యాఖ్యానము లెట్లుసత్యములో వివరింప వలసినదిగ ప్రార్థించిరి

అపుడు శ్రీస్వామివారు ఇట్లుబల్కిరి "భక్తజనులారా! మొదటిపండితుడు పల్కినట్లు మేము డెబ్బది సంవత్సరములు మీమెదుటనుండి, రెండవపండితుడు చెప్పినట్లు బృందావనము ప్రవేశించి ఏడువందల సంవత్సరములు మిమ్ముల నందఱిని అనుగ్రహించెదము ఎవరైనను ఎంతకష్టములోనివారైనను నాబృందావనము జేరిన వారిని దక్షించెదను వారికి చతుర్విధ పురుషార్థములను, జ్ఞానభక్తి వైరాగ్యములను ప్రసాదించి ముక్తిమార్గానుయాయులుగ నొనరించెదను మూడవ పండితుడు చెప్పినట్లు నాచే రచింపబడిన గ్రంథములు మూడువందల సంవత్సరములు బహుళ ప్రచారములోనుండగలవు" సభా సదులలో ఒకరు తరువాత యేమి యగు నని స్వామిని ప్రశ్నించిరి

అందులకు శ్రీస్వామివారు తదనంతరము నాగ్రంథములు ముముక్షువులకు భక్తులకు నిత్యమార్గదర్శకములు కాగలవు అవి అనంతకాలము తమమహిమలను ప్రదర్శింపగలవు, కావున

విద్వజ్జనులారా! ఈ ముగ్గురు జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పిన వివరణములు అక్షరసత్యములు కావున వీరు యథార్థముగనే మహాపండితులు, ఇందు లేశమైనను సంశయము లేదని పల్కిరి

తదనంతరము శ్రీవారు ఆముగ్గురు పండితులను అనుగ్రహించి దుశ్శాలువలతో అనేక ధనకనక వస్తువాహనములతో సత్కరించి ఫలమంత్రాక్షతల నొసంగిరి శ్రీస్వామివారి యనుగ్రహముచే జీవుని పరమార్థము దేవుని జేరుట యని దెలిసికొని ఆపండితులు అహంకారరహితులై శ్రీస్వామివారికి శిష్యులై పరమభక్తులై చరితార్థులైరి

షట్శాస్త్రపండితులు శ్రీస్వామివారిమాహాత్మ్యమును వేనోళ్ళ పొగడుచు తమతమ నెలవులకు జనిరి



## రెండు రెండు రెండు

శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి రెండు పర్యాయములు తీర్థయాత్రల నొనరించుచు భారతదేశమందంతట పర్యటించి శ్రీహరి భక్తని, శక్తిని, ద్వైతమతమును ప్రచారమొనరించిరి

ఆశ్రమములో ప్రతిదినము శ్రీరాఘవేంద్రతీర్థస్వామి శిష్యులకు తత్త్వబోధ చేయుచుండెడివారు ఒకదినమున శ్రీవారు శిష్యులకు ఉపనిషద్రహస్యములను వివరించుచుండిరి ఆసమయములో ఆయన ప్రవచనము నాపి దిగ్గున ఆసనము నుండి లేచి ఆకసమున జూచుచు నమస్కరించి సంభాషణ మొనరింపనారంభించిరి తదనంతర మాయన ప్రసన్నుడై ఆసనము నలంకరించెను

గురుదేవు లొనరించిన యీవిచిత్రప్రవర్తన శిష్యులకు అవగతము కాలేదు వారు గురుదేవుని ఆసంఘటనను వివరింప వలసినదిగ ప్రార్థించిరి అపుడు శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి యిట్లుపల్కెను "వత్సలారా! కుసుమవర్తి శ్రీకృష్ణద్వైపాయన స్వామి గొప్ప భగవద్భక్తుడు వేదవిహిత ధర్మానుసారముగ జీవితమును కొనసాగించిన మహాత్ముడు

ఆయన తన కర్మము లన్నింటిని శ్రీహరియనుగ్రహముచే నిశ్శేషముగ నిర్మూలించుకొనెను నేడు శాలివాహన శకము 1591 వ సంవత్సరము, జ్యేష్ఠమాసము, శుక్లపక్షము, పౌర్ణమి ఆమహాభక్తుడు నేడు తన పాంచభౌతికదేహమును వీడి దివ్య దేహముతో విమానము నధిరోహించి అర్చిరాదిమార్గమున (దివ్యదృష్టి గలవారు మాత్రమే గాంచగలమార్గము) పరం ధామమునకు పోవుచున్నారు ఆమహాపురుషుని దర్శించి నేను లేచి నమస్కరించి స్తుతించితిని భక్తాగ్రేసరా! నీవు ధన్యుడవు

భగవదను గ్రహామునకు పాత్రుడవై ముందుగనే పరంధామమునకు పోవుచున్నావని నేను పల్కితిని అందుల కాయన మందహాసముతో తన దక్షిణకరము నెత్తి రెండు అంగుళీయకములను మూడు పర్యాయములు చూపుచు సంజ్ఞాశాస్త్రమున పల్కెను నేను సరిగ యీదినమునుండి రెండుసంవత్సరముల రెండునెలల రెండురోజులకు బృందావనమును ప్రవేశించెదనని, అపుడా పరంధామమే భగవంతునితోసహా నీచెంతవిరాజిల్లగలదని శ్రీకృష్ణద్వైపాయన స్వామి తన కరాంగుళీయకములను మూడుపర్యాయములు చూపుచు సూచించెను

కావున నాప్రియశిష్యులారా! నేను రెండు సంవత్సరముల రెండు నెలల రెండురోజుల తదనంతరము బృందావనమును ప్రవేశించెదను ఇది సత్యము

గురుదేవుడు పల్కిన వచనముల నాలకించి ఆశ్రమవాసులందఱు చింతాక్రాంతులైరి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి త్వరలో జనమధ్యమునుండి అంతర్ధానము కానున్నారని తెలిసికొని అందఱు విలపింపసాగిరి శ్రీవారు తన భక్తులకు తత్త్వబోధ యొనరించి వారిని ఓదార్చిరి

తుంగభద్రానది కావల శ్రీపంచముఖాంజనేయస్వామి స్వయంభూరూపమున విరాజిల్లియుండెను శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి ప్రతిదినము తుంగభద్రపై నడచి ఆవలిగట్టునమున్న

శ్రీపంచముఖాంజనేయస్వామివారి మందిరమును చేరి పూజారాధనముల నొనరించి తిరిగి నీటిపై నడచుచు తుంగభద్రను దాటి ఆశ్రమమును చేరెడివారు ఈమహాద్భుతమును గాంచి ప్రజలందఱు పరమాశ్చర్యచకితులై శ్రీవారి ననేకవిధముల స్తుతించెడివారు ప్రతిదినము శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి యొనరించుచున్న ఏకాగ్రతపమునకు ప్రసన్నులై శ్రీఆంజనేయస్వామి సాక్షాత్కరించెను అపుడు శ్రీరాఘవేంద్ర స్వామి పరమానందభరితుడై, సాశ్రుపూర్ణనయనుడై హస్తములను ముకుళించి నుతించెను

శ్లో॥ వందే వాయుతనూభవం సుచరితం వందేజగద్భ్రాపిణమ్।
వందే వజ్రతనుం సురారిదళనం వందే దయాసాగరమ్॥
వందే పంచముఖం సుకుండలధరం వందే కపీనాం
పతిమ్ ।
వందే సూర్యసుతా సఖం ప్రియఫలం వందే
హనూమత్ప్రభుమ్ ॥

(వాయునందనునకు, ఉత్తమచరిత్రునకు నమస్కరించెదను జగద్భ్రాపునకు నమస్కరించెదను వజ్రశరీరుడు, దేవతా శత్రువులైనవారిని మర్ధించువాడు, దయాసాగరుడు నైన శ్రీఆంజనేయస్వామికి నమస్కారము పంచముఖములుకలిగిన వాడు, దివ్యకర్ణకుండలములను ధరించియున్నవాడు, కపీశ్వరుడు,

సూర్యునికుమార్తెకు సముద్రైనవాడు, ప్రేమకు ఫలస్వరూపు డైనహనుమదీశ్వరునకు నమస్కారము )

శ్రీఆంజనేయస్వామి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ననుగ్రహించి వరముల నర్థింపవలసినదిగ పలికెను అపుడు శ్రీవారు తన బృందావనము నెదుట విరాజిల్లుచు భక్తులను రక్షించి అనుగ్రహింపవలసినదిగ వరము నర్థించిరి అందులకు శ్రీవాయునందనుడు 'తథాస్తు' అనుచు పలికి అంతర్హితుడయ్యెను శ్రీఆంజనేయస్వామి భక్తున కిచ్చిన మాట ప్రకారము శ్రీరాఘవేంద్రతీర్థస్వామి బృందావనము ఎదుట స్వయంభూరూపమున నున్న అర్చావిగ్రహములో సదా విరాజిల్లుచుండును రామభక్తుడు, శివాంశసంభూతుడునైన శ్రీఆంజనేయస్వామిని దర్శించి తదుపరి భక్తులు శ్రీరాఘవేంద్రతీర్థస్వామిని దర్శించుచుందురు



# బృందావన నిర్మాణము

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి విశేషానుగ్రహమునకు నిర్వురు గృహస్థులు పాత్రులైరి. వారిలో మొదటివారు వెంకన్న పంతులు, ఆయన ఆదోనిదివాన్. శ్రీస్వామివారు మంచాలలో విరాజిల్లియున్నారు. వెంకన్నపంతులు తనసమయము నంతటిని శ్రీవారిసేవలకు వినియోగించి వారిదివ్యానుగ్రహమును బొంది జీవన్ముక్తుడయ్యెను. రెండవవారు అప్పణాచార్యు డను బ్రాహ్మణోత్తముడు, భక్తుడు, పవిత్రుడు, మధ్వసాంప్రదాయానుగామి, విద్వాంసుడు. ఆయన సంస్కృతములో పండితుడు. అప్పణాచార్యులు తుంగభద్రానదికి ఆవలిగట్టు నున్న గ్రామమునకు చెందినవాడు. ఆయన తన జీవితములో ఎక్కువ భాగమును శ్రీవారిసేవలకు వినియోగించెను. శ్రీవారికి ప్రీతిపాత్రుడయ్యెను.

ఈ యిర్వురుగృహస్థులు పూర్వకాలములో ప్రహ్లాదుని బాల్యమిత్రులు. ప్రహ్లాదుని యుపదేశామృతమును గ్రోలిన మహాత్ములు. తమ గురుదేవుని సేవించుటకు ఆ బాలకులు కలియుగములో శ్రీవారి సేవకులై జన్మించి భవబంధవిముక్తి నొందిరి.

శ్రీహరిపార్షదుడైన శంకుకర్ణుని యవతారమైన శ్రీరాఘవేంద్రతీర్థుల యవతారప్రయోజన మేమనగా తన్నాశ్రయించిన

వారలకు వా రెవ్వరైనను, యెట్టివారైనను తన యనిష్టపుణ్యమును ప్రసాదించుటయే అనిష్టపుణ్యమును పరిపూర్ణముగ వితరణమొనరించి తదనంతరము శ్రీవారు గోలోకమును జేరెదరు శ్రీహరిపార్షదుడు భూలోకమున శ్రీరాఘవేంద్ర తీర్థునిగ అవతరించి పీఠాధిపతియై ఏబదియేడు సంవత్సరములు అనన్య భక్తితో శ్రీమూలరామమూర్తులను ఆరాధించి పతితులను పావనులుగ చేయుచు, అనేక గ్రంథములన, వ్యాఖ్యానములను రచించెను వీరి యద్భుతగ్రంథములు జీవుని శ్రీహరివాయువులచెంతకు జేర్చగలవు నాటినుండియు నేటి వఱకు, మరినాల్గువందల సంవత్సరముల వఱకు శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి మంత్రాలయాంతర్గత బృందావనమందు విరాజమానులై తన్నాశ్రయించిన పీడితజనుల నుద్ధరించుచుండెదరు

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి తాను జనులమధ్య చరించి కాలము సమాప్తమైనదని, యిక బృందావనమును ప్రవేశించి ఏడువందల సంవత్సరములు అనిష్టపుణ్యమును దానమొనరింపవలెనని సంకల్పించుకొనిరి శ్రీవారు వెంటనే వెంకన్నపంతులునకు కబురంపిరి దివాన్ వెంకన్నపంతులు మంచాల చేరి ముకుళితహస్తుడై శ్రీవారియెదుట నిలువబడెను అపుడు శ్రీస్వామి "వెంకటేశా! మీ మధ్య నేనుండవలసిన కాలము సమాప్తమయ్యెను నాబృందావనమును సిద్ధమొనరింపు"మని పలికిరి

శ్రీవారి యీవాక్యములు వెంకన్నపంతులుపై అశని పాతమువలె పడెను ఆయన ఉచ్చైస్స్వరముతో దుఃఖించుచు "దేవా! నీవు వెళ్ళినచో మే మెట్లు జీవింపగల" మనెను అపుడు శ్రీవారు 'వెంకటేశా! దు ఃఖింపకుము నేనీ ప్రపంచ మును వీడిపోవుటలేదు సజీవముగ బృందావనమును ప్రవే శించి యుండగలను కావున బృందావన నిర్మాణమునకు చక్కనిశిలలను తెప్పించుము ద్వాదశక్షేత్రముల నుండి సాలగ్రామములను దెప్పింపుము శిష్యులను హిమాలయ ప్రాంతమున నున్న గండకీనదికి బంపి ఏడువందల నారసింహ వాసుదేవ, నారాయణ, అధోక్షజాదిసాలగ్రామములను తెప్పిం పుము త్వరలో బృందావనము సిద్ధముకావలెను శ్రీవారి బృందావన ప్రవేశవార్త దావానలమువలె వ్యాపించెను శిష్యులు, భక్తులు, ప్రజలు తుదకు క్రిమికీటకపశుపక్ష్యాదులు కూడ శ్రీవారిదర్శన మికదక్క దనివిలపింపగాడంగిరి

వెంకన్నపంతులు వెంటనే కొందఱు బ్రాహ్మణులను ద్వాదశక్షేత్రములకు, హిమాలయప్రాంతమునకు, సాలగ్రామా న్వేషణకై పంపెను, ఆబ్రాహ్మణులు మహాపండితులు, సాలగ్రామశాస్త్రములో ఉద్దండులు వెంకన్నపంతులు గొప్ప శిల్పులను రావించి చక్కని నల్లరాయిని సిద్ధమొనరింపజేసి బృందావననిర్మాణమును ప్రారంభించెను త్వరలో బృందా వనము పూర్తియయ్యెను శ్రీవారు వెంకన్నపంతులును దోడ్కొని తుంగభద్రానదీతీరమున నడచుచు మంత్రాలయ

మున నైదారుమైళ్ళదూరములో నున్న మాధవపుర మను గ్రామమునకు జనిరి ఆ గ్రామనదీతీరప్రాంతములో శ్రీవారు సగము నీటిలో సగము బయట పడియున్న ఒక శిలను జూపి వెంకన్నా! నాబృందావనమును, శ్రీమారుతి విగ్రహమును ఈరాతిలోనే చెక్కవలె ననిబల్కిరి అందులకు వెంకన్న ఆశ్చర్యచకితుడై "దేవా! మీబృందావనము చెక్కబడి సిద్ధముగ నున్నది మఱి దాని నేమిచేయవలె"ననిబల్కెను అపుడు శ్రీవారు దానిని ఉంచుము నాతదనంతరము ఐదవ పీఠాధిపతికి ఉపయోగింపవచ్చు ననిరి

వెంకన్నపంతులు ఆశిలను పరికించి "స్వామీ! ఇది నల్లరాయికాదు, పైగా చిన్నది బృందావనవిగ్రహనిర్మాణ ములకు సరిపోదు మీరేల యీశిలనే వినియోగింపవలెనను చున్నా"రనెను అపుడు శ్రీవారు 'వెంకటేశా! నాకు యీ శిలయే కావలెను త్రేతాయుగములో శ్రీరామలక్ష్మణులు అరణ్యములందు సీతాదేవిని వెదకుచు నీతుంగభద్రానదీప్రాంత మున కేగుదెంచి యీశిలపై ఏడుఘడియలు సీతాదేవి నామో చ్చారణ మొనరించుచు ఆసీనులైరి కావున యీశిల పరమ పవిత్రము దీనిని నాశిరస్సుపై బృందావనముగ మలచుడనెను వెంకన్నపంతులు త్రేతాయుగమందు సంభవించిన యీసంఘట నను విని ఆశ్చర్యచకితుడై గురుదేవుని పాదములను దాకి ఆశిలను మంత్రాలయమును జేర్చుట కేర్పాట్లుజేసెను

బృందావనము, మారుతివిగ్రహము సిద్ధమొనరింపబడెను సాలగ్రామములతో బ్రాహ్మణులు మరలివచ్చిరి శ్రీవారి బృందావనప్రవేశమహోత్సవమున కన్నియేర్పాట్లు గావింపబడెను

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి పూర్వాశ్రమములో తన అన్నగారైన గురురాజాచార్యుని కుమారుడైన వెంకన్నాచార్యుని రావించి ఆయనకు సన్న్యాసాశ్రమమును ప్రసాదించి, యోగేంద్రతీర్థు లనినామకరణమొనరించెను శ్రీమూలరామ పూజారిగ, శ్రీవారి మఠాధిపతిగ శ్రీయోగేంద్రతీర్థులను నియమించిరి

శ్రీవారిబృందావన ప్రవేశసమయ మాసన్నమైన దని గ్రహించి వెంకన్నపంతులు శ్రీవారిచెంతనే నివసింపదొడంగెను శ్రీరాఘవేంద్రతీర్థస్వామి శ్రీవెంకన్నపంతులకు ఒకప్రదేశమును జూపించి దానిలో తనకు భూగృహమును నిర్మింపవలసినదిగ దానిపై బృందావనమును నిర్మింపవలసినదిగ ఆజ్ఞాపించిరి ఆపవిత్రప్రదేశమందె కృతయుగములో ప్రహ్లాదమహారాజరూపములో తాను అనేక యజ్ఞములను జేసితి ననివివరించెను శ్రీవారియాజ్ఞానుసారముగ తత్‌క్షణమే భూగృహము నిర్మాణమయె , దానిపై శిలలచే చెక్కబడిన బృందావనముంచబడెను



# నాస్తికుడు ఆస్తికుడైన విధము

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి మరణించిన వారిని కూడ పునర్జీవితులుగ నొనరించి మృత్యుంజయు లనికీర్తినివహించిరి ఎందరో భక్తులు ఆయన భగవదవతార మనివిశ్వసించి శ్రీవారిని పూజింపసాగిరి ఈ కలియుగము నో నిట్టిమాహాత్మ్యములు బూటకము లనివిశ్వసించెడినాస్తికు లెందరో కలరు ఒకగ్రామమందు ఒకలింగాయతుడు కలడు ఆతడు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి మరణించినవారికి పునర్జీవనము నొసంగుటసత్య [illegible] ములు అమాయకు లగుప్రజలచెంత ధనమును [illegible] నిట్టి ప్రచారములు నొనరింపచేయుచుందు రనిభావించెను తనతోటివారి నందఱిని సమావేశపరచి శ్రీరాఘవేంద్రతీర్థస్వామిని అపహాస్యముపాలుచేయవలె నని తీర్మానించెను

ఆగ్రామమందే యున్న ఒకయువకుని మరణించినట్లు నటింపవలసినదిగ పలికెను ఆతడు వల్లె యని శవాకారముగ బడెను తదనంతరము గ్రామవాసుల నందఱిని చేర్చి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి నాశ్రయించినచో నీతడు పున తు డగునని పలికెను అందఱుకలసి ఆయువకుని శ్రీరాఘవేంద్రస్వామి చెంతకు గొనిపోయిరి వారందఱు ఏడ్చుచు శ్రీవారికి నమస్కరించి 'స్వామీ! ఈయువకుడు అకాలమరణము పొందినాడు ఎందఱో మృతులకు మీరు ప్రాణమును పోసినా రని

తెలిసికొని మిమ్ము ఆశ్రయించితిమి ఈయువకుని పునర్జీవి తునిగ నొనరింపుడని' వేడుకొనుచు దొంగయేడ్పులనేడ్వనారం భించిరి ఈవిచిత్రమును చూచుటకు ఆగ్రామవాసు లందఱు గుమికూడిరి

దివ్యజ్ఞానసంపన్నుడైన శ్రీరాఘవేంద్రస్వామి వచ్చిన వారు తన్న పహాస్యము పాలుచేయుట కసత్యములాడుచున్నా రని తెలిసికొని 'నాయనలారా ! నేను మున్ను బ్రతికించినవారు కొనప్రాణముతో నున్నారు కావున వారిప్రాణములను నిలుప గల్గితిని కానీ ఈయువకుని ప్రాణము ఈదేహమును వీడి వెడలిపోయెను, కావున వీనిని నేను బ్రతికింపజాలను, ఇక వెళ్ళిరం డని పల్కెను అపుడు ఆలింగాయతుడు పరిహాసించుచు 'లెమ్మోయి యువకుడా ! లెమ్ము ! ఈదొంగసన్న్యాసి పస బయటపడె నని ఆయువకుని పిలచెను ఎంతతడవు పిలచినను ఆతడు కదలలేదు ఔరా! ఇది ఏమి యనివారు ఆయువకుని పరీక్షింపగా అతడు మరణించి శరీరము కొయ్యబారిపోయెను సలక్షణముగ నున్న యువకుడు మరణించుటగాంచగనే లింగా యతునియొక్క వారి స్నేహితులయొక్క గుండెలు పగిలెను వారిపుడు నిజముగ ఆక్రందనముల నొనర్పింపసాగిరి వారి మోసము ఊరిజనులకు తెలిసిపోయెను నాడు ప్రహ్లాదుడు పల్కిన సూక్తిని (ఇందుగల డందులే డనుసందేహము వలదు) సత్యమొనరించుటకు శ్రీనృసింహస్వామి విశ్వమంతటిలో గల

అణువణువందు నిండియుండెను నేడు ఆ జగన్నాధుడు ప్రహ్లాదుని యవతార మైనశ్రీరాఘవేంద్రస్వామి పల్కిన పల్కులను సత్యమొనరించుటకు జీవించియున్న యువకుని మర ణింపజేసెను ఊరకేపోవునా! ఈభాగవతాపచారఫల మని గ్రామప్రజలు లింగాయతుని దూషింపనారంభించిరి

తమకుమారుని మరణవా_ర్తను విని వానితలిదండ్రులు దుఃఖించుచు ఆప్రదేశమున కేగుదెంచిరి వారు ఇట్లు కన్నీరు మున్నీరుగ విలపింప నారంభించిరి 'మహానీయు డగుశ్రీరాఘ వేంద్రయతీంద్రునిపై మూఢబుద్ధు లగువీరి కిట్టి దురాలోచన ఏల గలుగవలె? వారు మాకుమారు నేలగొంపోవలె? శ్రీవారికి మాబిడ్డపై ఆగ్రహమేల కలుగవలె? మాగ్రహాచార మిట్లున్నది కొందఱు ఈదుండగులను రాజభటులకు అప్పగించి ఉరితీయ వలె ననిపల్కిరి కొందఱు శ్రీరాఘవేంద్రతీర్థస్వామిచరణ ములపై బడి పశ్చా_త్త_ప్తహృదయముతో ప్రార్థించినచో లాభముకలుగునని పలుకసాగిరి అపు డాలింగాయతుడు వాని యనుచరులు పశ్చా_త్తాపమును చెందుచు క్షమింపుడని, యీ యువకుని పునర్జీవితునిగ నొనరింపు డనిశ్రీవారివాదములపై బడి వేడుకొనదొడంగిరి ఆయువకుని తల్లిదండ్రులు మిక్కిలి దుఃఖించుచు శ్రీవారిపాదములచెంత మృతు డై_నయువకుని శరీర ముంచి యిట్లుప్రార్థించిరి "కరుణాసింధూ! ఏపాప మెఱుగని మాకుమారుని కాపాడుము ఈ పాపాత్ములసాంగత్యముచే

నీతడు ఇట్టి యధోగతిని బొందినాడు వీనిని పునర్జీవితునిగ నొనరించి మావంశమును కాపాడుడు'

శ్రీరాఘవేంద్రతీర్థస్వామి మూర్తీభవించిన క్షమామూర్తి ఆమహానుభావుడు తనకమండలములో నున్న పవిత్ర జలములను ఆయువకునిశరీరముపై చల్లి శ్రీమన్నారాయణుని స్మరించెను తత్‌క్షణమే నిదురనుండి మేల్కాంచినవానివలె ఆయువకుడు లేచి కూర్చుండెను జరిగినవిషయము తెలిసికొని ఆతడు శ్రీవారిపాదములపై బడి తనఅపరాధమును క్షమింపుడని ప్రార్థించెను లింగాయతుడు, ఆతని యనుచరులు త్రికరణశుద్ధిగ శ్రీవారికి శిష్యులైరి నాస్తికులు ఆస్తికులైరి, శ్రీవారి యీయద్భుత లీలను గాంచి సకలజనులు పరమానందభరితులై జయ, జయధ్వానముల నొనరించుచు తమ తమ నెలవులకు జనిరి



# బృందావన ప్రవేశము

ఆదినము పరమపవిత్రము నాడుశాలివాహన శకము 1593 విరోధికృతనామ సంవత్సర, శ్రావణ కృష్ణబహుళద్వితీయ (ఆగష్టు 1671/72 AD) బ్రహ్మముహూర్తనమునే శ్రీవారు నేడు

తాను బృందావనమును ప్రవేశించెద నని ప్రకటించిరి అందఱు ఉచ్చైస్స్వరముతో విలపింపదొడంగిరి శ్రీవారి యంతిమదర్శనమునకై లక్షలకొలదిగ ప్రజలు మంత్రాలయమునకు వచ్చి ఉచ్చైస్స్వరముతో భగవన్నామసంకీర్తన మొనరింపనారంభించిరి శ్రీవారు నిత్యకార్యక్రమానుసారము శ్రీమూలరామాదిపీఠదేవతలను మనఃపూర్వకముగ ఆరాధించి, జపమాలను జేకొని ప్రజ్వరిల్లుచున్న జ్యోతి స్స్వరూపునివలె ప్రకాశించుచు సకలజీవులకు తత్త్వబోధనొనరించిరి వారొనరించిన ఆమహాబోధనే శ్రీమద్రాఘవేంద్రగురుగీత యందురు శ్రీవారు ఆసమయమున సమావేశమై యున్న వారందరికి ఆశీస్సులను ఫలమంత్రాక్షతలను నొసంగిరి తదనంతరము శ్రీరాఘవేంద్రతీర్థస్వామి శ్రీహరినామోచ్చారణ మొనర్చుచు బృందావనాంతర్గతమగు భూగృహమును ప్రవేశించి పద్మాసనాసీనులై అర్ధనిమీలితనేత్రములతో తపోమగ్నులైరి ఆసమయమున దశదిశలు శ్రీహరినామసంకీర్తనతో మారుమ్రోగెను ఆకసము నుండి ఆనకదుందుభులశబ్దము వినిపించెను నదులు సాగరములు ప్రశాంతముగ నుండెను మేఘములులేక ఆకాశము నిర్మలమై యుండగా సూర్యభగవానుడు జాజ్వల్యమానముగ ప్రకాశింపదొడంగెను

వెంటనే శ్రీవారి యాదేశానుసారముగ భూగృహద్వారము మూసివేయబడెను శ్రీవారిపై నిర్మించిన బృందావనమందు ద్వాదశక్షేత్ర సాలగ్రామములు, గండకీనదినుండి

తెప్పించబడిన వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధాదులైన ఏదువందలసాలగ్రామములు ఉంచబడెను బృందావనము గూడ తదనంతరము మూసివేయబడెను ఆసమయములో వేలాదిబ్రాహ్మణులు వేదపారాయణ మొనరించిరి, అప్రతిహతముగ దేవాలయఘంటలు మ్రోగింపబడెను భక్తులు నగారాలను మ్రోగించిరి శిష్యులు శంఖారావము లొనరించిరి ఈమంగళకరధ్వనులతో ఆకాశమంతయు నిండిపోయెను నూతనపీఠాధిపతులైన శ్రీయోగేంద్రతీర్థస్వామి బృందావనమును షోడశోపచారములచే ఆరాధించిరి బృందావనముపై మూలరామాది దివ్యవిగ్రహముల నుంచి పంచమంత్రాభిషేకము, జలాభిషేకము, క్షీరాభిషేకము, శర్కరాభిషేకము, మధుఅభిషేకము, ఘృతాభిషేకము, పుష్పాభిషేకము, ఫలాభిషేకము, గంధాభిషేకము చేసిరి బృందావనము సంతటిని స్వయముగ శ్రీయోగేంద్రతీర్థస్వామి తులసీమాలలతో అలంకరించిరి మహానివేదనముగావింపబడెను ఆప్రదేశమునకు జేరిన భక్తులందఱకు మహాసంతర్పణ గావింపబడెను బ్రాహ్మణులను, భక్తులను, విద్వాంసులన, దక్షిణలతో సత్కరించిరి అట్లు ఆనాటి శ్రీవారిబృందావన ప్రవేశకార్యక్రమము మంగళకరముగ పరిపూర్ణమయ్యెను

— o —

# శ్రీ అప్పణాచార్యుల సౌభాగ్యము

శ్రీరాఘవేంద్రస్వామి శ్రీహరి భక్తాగ్రగణ్యులు శ్రీహరి, శ్రీవాయువు, (( న సర్వత్ర వ్యాపకమై యున్న శ్రీహరిచైతన్యరూపము) సాక్షాత్తుగ శ్రీవారిబృందావనమందు విరాజిల్లి యున్నారు సర్వతంత్రస్వతంత్రుడైన ఆపరబ్రహ్మమే స్వయముగ తనసన్నిధానము నొసంగిన ఆబృందావనమందు సకల దేవతలు, తీర్థములు, ధామములు ఉండుట నిర్వివాదాంశము

శ్రీవారు శ్రీహరివాయువులను ధ్యానించుచు ఆబృందావన మందు విరాజిల్లిరి ఈబృందావన వృత్తాంతము శ్రీవారి కత్యంతసన్నిహితులైన అప్పణాచార్యుల వారికి తెలియరాలేదు ఆసమయములో ఆయన కొన్ని గృహకార్యములకొఱకై బిచ్చాలె యనుగ్రామమునకు వెడలియుండెను స్వగ్రామమునకు మరలిరాగానే శ్రీరాఘవేంద్రస్వామి బృందావన-వృత్తాంతము పిడుగుపాటువలె ఆయనకు తెలిసెను అపుడు శ్రీఅప్పణా చార్యులు హృదయ విదారకముగ విలపించుచు 'గురుదేవా నాకు నీ యంతిమ దర్శనము నేల ప్రసాదింపలేదు? మీ యంతిమ ఉపదేశము విను సౌభాగ్యము నాకు లేకుండ చేసితిరి పూర్వ జన్మములందు నేనేపాపము చేసితినోగదా !' యని పలుకుచు ఆక్షణమందే బృందావన దర్శనాకాంక్షియై పరుగుపరుగున మంచాలకు బయలుదేరెను దారిలో శ్రీరాఘవేంద్రుని యనేక

విధముల స్తుతించుచు ఆనందబాష్పనయనుడై పులకిత దేహుడై మంచాల జేరెను ఆయన హృదయమునుండి ఆశువుగ సంస్కృతములో ఒక మహాస్తోత్రము వెలువడెను శ్రీఅప్పణాచార్యులు ముప్పదియొకటవ (31) శ్లోకమునందు మూడవపాద ముచ్చరించుచుండగ బృందావన సమ్ముఖమునకు జేరెను వెంటనే ఆయన భక్తిసమన్వితుడై సాష్టాంగదండ ప్రణామ మాచరించి శ్రీగురుదేవుల వియోగము ను భరింప జాలక విలపించెను తదనంతరము తన్నుతాను సంబాళించు కొని గురుదేవుల పాదపద్మములందు తన మనస్సు నేకాగ్ర మొనర్చెను ఈ విచిత్ర ఘట్టమును చేలకొలది భక్తులు ఆశ్చర్యచకితులై వీక్షించుచుండిరి ఆసమయములో అప్పణా చారు నిలో తనస్తోత్రమందు ఆశువుగ వచ్చిన శ్రీరాఘవేంద్ర స్వామి దివ్య లీలావిభూతులు సంభవమా ! యని జీవసహజ మైనశంక ఉద్భవించెను ఆక్షణమందే బృందావనమునుండి "సాక్షీహయా స్త్రహి" అనుచు మేఘగంభీర స్వరము ప్రతిధ్వనించెన ఈ వాః మే అప్పణాచార్యుని స్తోత్రములోని ముప్పది యొకటవ శ్లోకమునకు చతుర్థపాద మయ్యెను ఈస్తోత్ర మందలి ప్రత్యక్షరము పరమ సత్యమని దానికి నేను సాక్షినని ఆమహావాక్యమున కర్థము ఈ దివ్యవా మును శ్రీబృందా వనమునందు వేంచేసియున్న శ్రీహాయగ్రీవస్వామి పల్కెను తదనంతరము శ్రీఅప్పణాచార్యులు మరియొక శ్లోకమును జదివి శ్రీరాఘవేంద్రస్తోత్రము ముప్పదిరెండు (32) శ్లోకములతో

పరిపూర్ణ మొనరించెను. ఆసమయమునుండి శ్రీఅప్పణాచార్యుల ముఖారవిందమునుండి ఆశువుగ వెలువడి హాయ వదను డైన శ్రీహరిచే సత్యమని చెప్పబడిన శ్రీరాఘవేంద్ర స్తోత్రము శ్రీవారి యధికార స్తోత్రమయ్యెను.

శ్రీవారు బృందావన ప్రవేశసమయమున ఆప్రదేశమున యుండుటకు నోచుకొనని శ్రీఅప్పణాచార్యుల ముఖమునుండి శ్రీరాఘవేంద్ర స్తోత్రమును బలికించి శ్రీహరి ఆయన కీర్తిని ఆచంద్రతారార్క మొనరించెను. గురుదేవుని యనుగ్రహము నకు బాత్రు డైనశిష్యుని భగవంతుడే స్వయముగ ఉద్ధరించును. శ్రీఅప్పణాచార్యుని యీ పరమాదృష్టమునకు శ్రీవారియెడల వానికి గల యకుంఠిత మైన యనన్యభక్తియే కారణము. పాఠకుల సౌకర్యార్థమై పరమభాగవతు లైన శ్రీఅప్పణా చార్యులు రచించిన శ్రీరాఘవేంద్రస్తోత్రమును, శ్రీరాఘవేంద్ర కవచమును, మంత్రమును, పూజావిధానమును, శ్రీమత్సద్గురు రాఘవేంద్ర మంగళాష్టకమును మీాముందుంచుచున్నాము. ది. సాహిత్యరత్న అర్చక వేదవ్యాసాచార్యులు రచించిన శ్రీరాఘవేంద్ర అష్టోత్తర శతనామావళినికూడ పొందుపరచు చున్నాము.

శ్రీఅప్పణాచార్య విరచిత మైన దివ్యస్తోత్రము శ్రీరాఘు వేంద్రస్తోత్రముగ ప్రసిద్ధి కెక్కెను.

సూర్యోదయ సమయమందు స్నానమాచరించి శ్రీరాఘవేంద్రస్వామి బృందావన సమ్ముఖమునగాని, ఆయన విగ్రహ సమ్ముఖమునగాని బృందావన మృత్తికచే అలంకరింపబడిన చిత్రపట సమ్ముఖమందుగాని నిలువబడి భక్తితో తలను వంచి హస్తములను ముకుళించి ఒక్క పర్యాయమైనను ఈస్తోత్రమును పఠించినచో పఠించినవానికి సర్వాభీష్టములు సిద్ధించును. నూట యెనిమిది పర్యాయములు పఠించిన వాని స రోగములు, భయము, దుష్టగ్రహదోషములు, మాత పేత పిశాచాదుల బాధలు తొలగి వానికి మనశ్శాంతి లభించును

'ఓం శ్రీరాఘవేంద్రాయ నమ' అను మంత్రమునైనను నూట ఎనిమిదిపర్యాయములు ప్రతిదినము స్నానానంతరము జపించినచో సర్వాభీష్ట సిద్ధి గల్గునని శ్రీఅప్పణాచార్యులు నొక్కివక్కాణించిరి

శ్రీనారాయణ పండితాచార్యులు వాయుస్తుతిని ప్రవచించుచు ఆదిలో రెండు శ్లోకములుగ శ్రీలక్ష్మీనృసింహస్వామిని ప్రస్తుతించి మంగళాచరణ మొనరించిరి అట్లే శ్రీఅప్పణాచార్యులీస్తోత్ర నిర్మాణమందు ప్రప్రథమమున శ్రీవారి వాక్స్వరూపుడగు శ్రీవాయుదేవుని ప్రస్తుతించుచు మంగళాచరణ మొనరించెను

ఈస్తోత్రము భక్తులపై దివ్యశక్తులను కురిపించును ఉత్తరాది మఠమందు శ్రీసత్యధర్మ స్థలను పీఠాధీశ్వరులు

శ్రీరాఘవేంద్రస్వామి అనన్య భక్తులైరి. వారు తమ బృందా వనమును శ్రీరాఘవేంద్రస్వామిస్తోత్ర పఠనముతో ఆరాధింప వలసినదిగ తన శిష్యుల నాజ్ఞాపించిరి. నేటివరకు ఆమతమం దట్లే ఆచరింపబడుచుండెను. శ్రీరాఘవేంద్రతీర్థస్వామినుండి ఎనిమిదవ తరమువారైన శ్రీధీరేంద్రతీర్థస్వామి ప్రసిద్ధులు. వీరు శ్రీవారి యనన్యభక్తులు ఈ మహాత్ముడు అనేక ఘోర తపముల నాచరించి దివ్యశక్తి సమన్వితు డయ్యెను. వీరి బృందా వనము ధార్వార్ జిల్లాలోని 'హోసరిట్టి' గ్రామమున గలదు. ఆబృందావనమందు శ్రీధీరేంద్రతీర్థులవారు తనయంశచే విరాజిల్లుచు భక్తుల ననుగ్రహించుచున్నారు. వారితో శ్రీరాఘ వేంద్రస్వామికూడ తమ యంశతో ఆబృందావనమున విరా జిల్లి యున్నారని భక్తుల విశ్వాసము. ఆబృందావనము నకు సేవల నొనరించి, ఆరాధించి 'హోసరిట్టి' గ్రామములో భక్తితో మూడు నిద్రల చేయు భక్తులకు స్వప్నమందు ఇద్దరు బ్రాహ్మ ణోత్తములు సాక్షాత్కరించెదరు. ఒకరు తెల్లని వర్ణము గలిగి సన్నగా పొడవుగ నుందురు. వారే శ్రీధీరేంద్రతీర్థులు మఱియొకరు అంగసౌష్టవముగల్గి కృష్ణవర్ణముతో నుందురు. వారే శ్రీరాఘవేంద్రస్వామి. వీరిద్దరు స్వప్నమందు నేటికిని భక్తుల ననుగ్రహించు చున్నారు.

శ్రీ సత్యానంద తీర్థులను మఱియొక పీఠాధీశ్వరులు గలరు. వారుకూడ శ్రీరాఘవేంద్రస్వామికి ఏకాంతభక్తులు,

తపస్సంపన్నులు వారి బృందావనము బీజాపురమునకు దగ్గరలో కలదు శ్రీరాఘవేంద్రస్వామి వీరిపై గల అను గ్రహావశమున తమ యంశతో ఆ బృందావనమందు విరాజిల్లి యున్నారు నేటికిని శ్రీసత్యేంద్ర తీర్థుల బృందావన ఆరాధన సమయమందు నిత్యము శ్రీరాఘవేంద్రస్తోత్రమును పఠించెదరు

కావున సర్వజనులు శ్రీరాఘవేంద్రస్తోత్ర పఠనముచే తాపత్రయములనుండి విముక్తి బొంది పరమానంద మనుభవించ వచ్చును నేటికినియిర్వురు యతీశ్వరులు తమ బృందావనము లందు సజీవముగ వేంచేసియుండి ఆశ్రిత భక్తులపై తమ కృపా కటాక్ష వీక్షణములను ప్రసరింపజేసి అనుగ్రహించుచున్నారు వారే సోడే మఠమం దున్న శ్రీవాదిరాజస్వామి, మంత్రాలయ మఠమం దున్న శ్రీరాఘవేంద్ర స్వామి నేటికి వారు తమ భక్తులకు బృందావనము ముందుగాని, స్వప్నమునందుగాని దర్శన మొసంగు చున్నారు భక్తులతో సంభాషించు చున్నారు ఇది అక్షరసత్యము

శ్రీవాదిరాజస్వామి సాక్షాత్తుగ శ్రీవాయుదేవుని యవ తారము వారు తరువాతి కల్పములో స్వస్థానమైన శ్రీవాయు పీఠమును జేరెదరు ఆవాయు దేవుడే నేడు పూర్ణాంశతో శ్రీరాఘవేంద్రుని బృందావనమును ఆవహించియున్నారు శ్రీవారి బృందావన మందు ద్వాదశ క్షేత్రనాలగ్రామములను, ఏడు వందల శ్రీవారి వివిధరూపము లైన సాలగ్రామములను ఉంచిరి

ముప్పది మూడుకోట్ల దేవతలను ఆవాహన మొనరించి యుంచిరి శ్రీవారి బృందావనమందు సాక్షాత్తుగ శ్రీహరి, వాయుదేవులు విరాజిల్లి యున్నారు బృందావన సమక్షమున శ్రీరాఘవేంద్ర స్తోత్రమును పఠించిన భక్తులను బృందావనమం దున్న శ్రీహరి వాయువులు తత్క్షణమే అనుగ్రహించుచున్నారు భక్తులు శ్రీరాఘవేంద్రుని యొక్క దివ్యచరణారవిందముల నాశ్రయించి శ్రీహరి వాయుదేవుల అనుగ్రహామునకు పాత్రు లగుచున్నారు

శ్రీఅప్పణా[illegible] శ్రీరాఘవేంద్రస్వామిని కల్పవృక్ష మని సంబో[illegible]తుంగ మంచాల గ్రామమునకు జని శ్రీవారి బృం[illegible] చెంత స్తోత్రమొనరించి సేవించిన భక్తులను శ్రీవారు కల్పవృక్షమువలె వారి సర్వాభీష్టములను తీర్చుచున్నారు

శ్రీ అప్పణాచార్యులు శ్రీరాఘవేంద్రస్వామిని కామధేను వని స్తుతించిరి కామధేనవు తన భక్తుల ననుగ్రహించుటకు నీ విశ్వమం దెచటకైనను పోగలదు అట్లే శ్రీవారు తన భక్తుల ఆర్తనాదముల నాలకించగనే, వారెచ్చోట నున్నను అచ్చోట కేగుదెంచి వారి ననుగ్రహించుదురు

శ్రీవారిబృందావనమునుండి మృత్తికనుగొని ప్రపంచ మందుగల అనేక పట్టణములలో ఆరాధనార్థమై బృందావనము లను నిర్మించిరి ఆబృందావనములందు శ్రీవారు తమయంశ

లను విరాజిల్ల జేసియున్నారు ఏబృందావనముచెంతనైనను శ్రీరాఘవేంద్రస్తోత్రమును బఠించి ఆరాధించినభక్తులకు శ్రీవారు అనుగ్రహింతురు కొందఱు భక్తులు శ్రీవారిబృందావన మృత్తికను దెచ్చుకొని స్వగృహములయందే శ్రీవారిబృందావన చిత్రపటముల కలంకరించుకొని ఆరాధించుచున్నారు వారు జీవితమంతయు స్వామివారి యనుగ్రహమునకు పాత్రులై అంత్య కాలమందు భవబంధవిముక్తులగుచున్నారు

శ్రీవారి బృందావనమును షోడశోపచారములతో సేవించి ఆరాధించి శ్రీరాఘవేంద్ర స్తోత్రముతో స్తుతింప వలెను శ్రీరాఘవేంద్రస్వామి మంత్రమును నూటఎనిమిది పర్యాయములు జపించవలెను

మంత్రాలయమునకు 9 మైళ్ళదూరములో 'మంత్రాలయం రోడ్డు' గ్రామమునందు స్థాపింపబడని బృందావనమును అణు మంత్రాలయ మనిపేరు శ్రీవారికి శాఖా బృందావనములు అసంఖ్యాకముగ గలవు 1 ఉడగలి, 2 మైసూరు, 3 హోన్నాళి, 4 దావణగేరే, 5 హరపనహాళ్ళి, 6 పూనా 7 శిరేకోళ్ళం, 8 ఉడిపి, 9 నంజనగూడు, 0 తిరుపతి, 11 బెంగుళూరు, 12 కడ్లబాళు 13 గుంటూరు మొదలగునవి

— o —

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ రాఘవేంద్ర స్తోత్రము

శ్లో॥ శ్రీ పూర్ణబోధ గురుతీర్థ పయోబ్ధిపారా
కామారి మాక్ష విషమాక్ష శిరః స్పృశన్తీ ।
పూర్వో త్తరామిత తరఙ్గ చర త్సుహంసా
దేవాళి సేవిత పరాంఘ్రి పయోజ లగ్నా ॥ 1

శ్లో॥ జీవేశ భేద గుణపూ ర్తి జగత్సుసత్వ
నీచోచ్చభావ ముఖ నక్రగణై స్సమేతా ।
దుర్వాద్యజాపతి గిళై ర్గురు రాఘవేన్ద్ర
వాగ్దేవతాసరి దముం విమలీకరోతు ॥ 2

తా॥ కాంతిపూర్ణుడైన పూర్ణచంద్రునికి ఉత్పత్తి స్థానమగు పాలసంద్రములో గలియునదియు, మన్మథుని అణచిన వాడును, జ్ఞానేంద్రియుడును, బేసికంటివాడును నగు నీశ్వరునిచే సైతము శిరసా వహింపబడినదియు, తూర్పు పడమరల యందలి అంతులేని యలలయందు క్రీడించు హంసములు గలదియు, దేవతలు అను తుమ్మెదలచే (దేవతా సమూహాముచే) సేవింప బడుచున్న శ్రీహరి పాదపద్మము లందు బొడమినదియు, దుర్వాదులు అనెడు మొసళ్ళను

ద్రిమింగునదియు, ప్రాణిశ్రేష్ఠము లగు గజాదులను జీల్చివేయ గల యోగ్యమగు పరాక్రమము గలదియు, మొగములయందు మిట్టపల్లములు గల మొసళ్ళగుంపులతో గూడినదియు నగు గురువర్యు లగు శ్రీరాఘవేంద్ర తీర్థుల వాగ్రూప మగు దివిజగంగ తన్ను సేవించు భక్తజనమును బవిత్రము చేయుగాక !

తా॥ జ్ఞానసంపద గల శ్రీ పూర్ణప్రజ్ఞ గురువుల పాల సంద్రము వంటి సచ్ఛాస్త్రము ననుసరించునదియు, అరిషడ్వర్గమును జయించిన యపరోక్షజ్ఞానులచే సైతము శిరసా శ్లాఘింపబడి నదియు, లేదా జ్ఞానసాధనీభూతో పనిషత్సమ్మత మైనదియు, పూర్వపక్ష సిద్ధాంతములను (లేదా) పూర్వోత్తర మీమాంస లను బాగుగా దెలిసిన వారిని శుశ్రూష చేయు పరమ హంసలును, నిర్లోభరాజులును గలదియు, బ్రహ్మాదులచే సైతము సేవింపబడు శ్రీమహావిష్ణువుయొక్క పాదపద్మములను బ్రతిపాదించునదియు, దుష్టవాదులను నిరాకరించునదియు, జీవేశ్వర భేదమును, పరమాత్మ యందు గుణపూర్ణత్వమును, జగత్సత్యత్వమున, దారతమ్యమును బ్రధానముగా శాస్త్రీను గుణమగు యుక్తిసమూహముచే సాధించునదియు, అమరగంగ వలె నిరాఘాటధాటి గలిగి అందఱిని బవిత్రుల నొనర్చు శ్రీరాఘ వేంద్రగురువర్యుల సచ్ఛాస్త్రరూపమగు వాక్కుమమ్ము నిర్మలుల జేయు గాక ! (1 – 2)

శ్లో॥ శ్రీరాఘవేన్ద్ర స్సకల ప్రదాతా
స్వపాదకంజద్వయభక్తిమద్భ్యః ।
అఘాద్రి సంభేదన దృష్టివజ్రః
క్షమాసురేన్ద్రోఽవతు మాంసదాఽయమ్ ॥ 3

తా॥ తన పాదపద్మముల నారాధించు భక్తులకుసర్వాభీష్టముల నొసగుచు దనదర్శన మను వజ్రాయుధముచే భక్తుల పాప పర్వతముల బటాపంచలు సేయు బ్రాహ్మణశ్రేష్ఠుడగు శ్రీరాఘవేన్ద్ర గురువు సర్వదా నన్ను రక్షించుఁగాక ! (3)

శ్లో॥ శ్రీరాఘవేన్ద్రో హరి పాదకంజ
నిషేవణా ల్లబ్ధ సమస్త సంపత్ ।
దేవస్వభావో దివిజద్రుమోఽయ
మిష్టప్రదో మే సతతం స భూయాత్ ॥ 4

తా॥ నిరంతరముభగవంతుని పాదపద్మముల సేవించుట వలన ఐహికాముష్మిక సమస్తైశ్వర్యముల బొందినవాడును, దేవాంశ సంభవుండును, భక్తులకు గల్పవృక్షమువంటి వాడునునగు శ్రీరాఘవేన్ద్ర స్వామి ఎల్లప్పుడును నామనోరధముల నీడేర్చుగాక— (4)

శ్లో॥ భవ్యస్వరూపో భవదుఃఖ తూల
సంఘాగ్నిచర్యః సుఖధైర్యశాలీ ।
సమస్త దుష్టగ్రహనిగ్రహేశో
దురత్యయోపప్లవసింధు సేతుః ॥ 5

తా॥ మంగళకరమగు స్వరూపము గలవాడును, దూదిమొత్తము నగ్నివలె వివిధసాంసారికదుఃఖములను విధ్వంస మొనర్చువాడును, ఆనందము గలవాడును, ధైర్యశాలియు, సమస్త దుష్టగ్రహములను నిర్మూలింపదగిన మహాశక్తి కల వాడును, ఉపద్రవ సముద్రముల నుత్తరించుటకు సేతువు వంటి వాడును అగు శ్రీరాఘవేన్ద్ర స్వామి మమ్ము రక్షించు గాక (5)

శ్లో॥ నిరస్త దోషో నిరవద్య వేష
ప్రత్యర్థిమూకత్వ నిదానభాష ।
విద్వత్పరిజ్ఞేయ మహావిశేషో
వాగ్వైఖరీ నిర్జిత భవ్య శేషః ॥ 6

తా॥ రాగాది దోషములను దోసిపుచ్చిన వాడును, నిర్దుష్ట మగు నాకారము గలవాడును, సభయందు ప్రతిపక్షులను మూగ వారినిగా జేయు వాగ్వైభవము గలవాడును, వాగ్విలాసముచే నందజెని జయించిన వాడును అగు శ్రీరాఘ వేంద్రగురువు మమ్ము రక్షించుగాక (6)

శ్లో॥ సంతాన సంప త్పరిశుద్ధ భక్తి
విజ్ఞాన వాగ్దేహ సుపాటవాదీన్ ।
దత్వా శరీరోత్థ సమస్తదోషాన్
హత్వాస నోఽవ్యా ద్గురురాఘవేన్ద్రః ॥ 7

తా॥ అట్టిలోకోత్తర మహిమగల శ్రీరాఘవేన్ద్ర గురుపాదులు మాకు సత్సంతానమును సంపదలను నిర్మల మగు భక్తిని విజ్ఞానమును వాక్పాటవమును దేహదార్ఢ్యమును ఈ మొదలుగాగల సమస్తశుభముల నొసంగి శారీర దోషముల నెల్ల నడంచి సదా మమ్ము రక్షింతురుగాక (7)

శ్లో॥ యత్పాదోదక సంచయస్సురనదీ ముఖ్యాపగాసాదితా
సంఖ్యానుత్తమ పుణ్యసంఘవిలసత్ప్రఖ్యాతపుణ్యావహా ।
దుస్తాపత్రయనాశనో భువి మహావంధ్యాసుపుత్రప్రదో
వ్యంగస్వంగసమృద్ధిదో గ్రహమహాపాపాపహ స్తంశ్రయే॥

తా॥ ఏ రాఘవేంద్రస్వాముల పాదప్రక్షాళనోదక సమూహము దివిజ గంగాది పుణ్యనదీస్నానములచే సంపాదింపబడిన సర్వోత్తమ మగు పుణ్యముకంటె నధిక పుణ్యమిచ్చునో, తాపత్రయము నడంచునో, మహావంధ్యలకు సైతము సత్పుత్రుని దయచేయునో, వికలాంగులకు సైతము అంగదార్ఢ్యాదికము నొసంగునో, గ్రహబాధలను బ్రహ్మహత్యాది పాపములను బాపునో యట్టి గురువ లగు శ్రీరాఘవేంద్ర తీర్థుల నాశ్రయించుచున్నాను (8)

శ్లో॥ యత్పాద కంజరజసా పరిభూషితాంగా
యత్పాదపద్మమధుపాయితమానసా యే ।
యత్పాదపద్మపరికీర్తన జీర్ణవాచ
స్తద్దర్శనం దురితకాననదావభూతమ్ ॥

తా॥ ఏ భక్తులు శ్రీరాఘవేంద్రస్వాముల పాద పద్మపరాగము నవయవములం దలంకరించు కొందురో, ఏభక్తులు శ్రీరాఘవేంద్ర గురుల పాదపద్మములందు మానసంబును దుమ్మెదను బోలె లగింపజేయుదురో, ఏభక్తులు రాఘవేంద్ర గురు పదపద్మకీర్తనముచేదమ వాక్కుల జీర్ణింప జేసికొందురో యట్టి మహాపురుషుల దర్శనము పాపకాంతార మును గారుచిచ్చువోలె భస్మ మొనర్చును (9)

శ్లో॥ సర్వతంత్ర స్వతంత్రోఽసౌ
శ్రీ మధ్వమత వర్ధన ।
విజయీంద్ర కరాబ్జోత్థ
సుధీంద్రవరపుత్రిక ॥ 10

తా॥ సర్వతంత్రస్వతంత్రుడును, మధ్వమతమును వృద్ధి చేసినవాడును, విజయీంద్రస్వాములవలన నాశ్రమముగొన్న సుధీంద్ర స్వాముల కరాంబుజజనితుండు నగు శ్రీరాఘవేంద్ర స్వామి నా భయముల దీర్చుగాక (10)

శ్లో॥ శ్రీరాఘవేంద్రో యతిరాట్
గురు ర్మే స్యా ద్భయాపహః ।
జ్ఞాన భక్తి సుపుత్రాయు
ర్యశః శ్రీ పుణ్యవర్ధనః ॥ 11

తా॥ భక్తులకు జ్ఞానమున, భక్తిని, సత్పుత్రులను,

అయువును, కీర్తిని సంపదలను వృద్ధిచేయు శ్రీరాఘవేంద్ర గురురాజులు నాభయమును దీర్తురు గాక (11)

శ్లో॥ ప్రతివాదిజయస్వాంత
భేదచిహ్నాదరో గురు ।
సర్వవిద్యాప్రవీణోఽన్యో
రాఘవేంద్రాన్న విద్యతే ॥ 12

తా॥ వాదము చేయునపుడు ప్రతివాదులను నొప్పింపక శాస్త్రార్థ విషయములను చర్చించి వారిని నిరుత్తరులుగ చేసి విజయమును గడించువాడు, సమస్త విద్యలయందు నిపుణుడు నగు శ్రీరాఘవేంద్రస్వామి యొక్కరే, వారు తప్ప మఱియొక గురువులేరు (12)

శ్లో॥ అపరోక్షీకృత శ్రీశః
సముపేక్షిత భావజః ।
అపేక్షిత ప్రదాతాఽన్యో
రాఘవేంద్రాన్న విద్యతే ॥ 13

తా॥ శ్రీ విష్ణుమూర్తిని ప్రత్యక్షము చేసుకొనగల్గిన వాడును, ఉపేక్షింప బడిన మన్మధుడు కలవాడును, వాంఛితముల నెక్కువగా నిచ్చువాడును, శ్రీరాఘవేంద్ర గురుదేవుని కంటె మఱియొకరు లేరు (13)

శ్లో॥ దయా దాక్షిణ్య వైరాగ్య
వాక్పాటవ ముఖాంకితః ।
శాపానుగ్రహ శక్తోఽన్యో
రాఘవేంద్రా న్న విద్యతే ॥ 14

తా॥ కారణము లేకుండగనే పరులదుఃఖమును తొలగింప వలయు ననుదయయు, సౌమ్యస్వభావము, విరక్తియు, వాక్పటుత్వము మొదలగు గుణములు గలవాడును, శపించుటకును, కరుణించుటకును సమర్థుడును శ్రీరాఘవేంద్ర గురుదేవుల కంటె మఱియొకరు లేరు (14)

శ్లో॥ అజ్ఞాన విస్మృతిభ్రాంతి
సంశయాపస్మృతి క్షయాః।
తంద్రా కంప వచ కౌంర్య
ముఖా యే చేంద్రియోద్భవా
దోషా స్తే నాశ మాయాంతి
రాఘవేంద్ర ప్రసాదతః ॥ 15

తా॥ శ్రీరాఘవేంద్రస్వాముల యనుగ్రహము వలన అజ్ఞానము, మఱపు, అన్యథాజ్ఞానము, సందేహము, అపస్మారము, క్షయరోగము, ఇంద్రియ జనితంబులగు తంద్ర, వణకు, వాక్స్తబ్ధత (మాట చచ్చుబడుట) మున్నగా గల దోషంబు లన్నియు నశించిపోవును (15)

శ్లో॥ [ఓం] శ్రీరాఘవేన్ద్రాయ నమ
ఇత్యష్టాక్షర మంత్రతః।
జపితా ద్భావితా న్నిత్య
మిష్టార్థాః స్యు ర్న సంశయః ॥ 16

తా॥ ఓం శ్రీరాఘవేంద్రాయనమః' అను ఈయష్టాక్షరీ మంత్రమును నిత్యము జపము చేయువారికి సర్వాభీష్టములు సిద్ధించును. ధ్యానము చేయువారికి సంశయజ్ఞానము నశించి మోక్షోపయోగి జ్ఞాన ముదయించును. (16)

శ్లో॥ హంతు నః కాయజాన్ దోషా
నాత్మాత్మీయ సముద్భవాన్ ।
సర్వా నపి పుమర్థాం శ్చ
దదాతు గురు రాత్మవిత్ ॥ 17

తా॥ బ్రహ్మజ్ఞాని యగు శ్రీరాఘవేంద్రస్వామి మా వలనగాని మా సంబంధులవలన గాని పొడమిన కాయికము లగు సమస్త పాపముల నశింపజేసి మాకు జతుర్విధ పురుషార్థ ముల నిచ్చుగాక ! (17)

శ్లో॥ ఇతి కాలత్రయే నిత్యం
ప్రార్థనాం యః కరోతి సః !
ఇహాముత్రాప్త సర్వేష్టో
మోదతే నాత్ర సంశయః 18

తా॥ ఈ ప్రకారముగ ప్రతిదినము మూడు వేళల ప్రార్థనను చేయుచున్నవాడు ఈలోకమునను, పరలోకమునను సమస్త మనోరథములను సిద్ధించుకొనినవాడై ఆనందించు చున్నాడు ఈ విషయమున సందేహము లేదు (18)

శ్లో॥ అగమ్యమహిమా లోకే
రాఘవేన్ద్రో మహాయశాః ।
శ్రీమధ్వమత దుగ్ధాబ్ధి
చంద్రోఽవతు సదాఽనఘః ॥ 19

తా॥ లోకమునందు సాకల్యముగ దెలియరాని మహాత్మ్యము కలవాడును, గొప్ప కీర్తికలవాడును సంపదగల శ్రీమధ్వాచార్యుల వారియొక్క సిద్ధాంతమనెడు పాలసంద్రమునకు చంద్రునివంటి వాడును జరామరణాది వ్యసనములు లేనివాడును నగు శ్రీరాఘవేంద్రస్వామి ఎల్లప్పుడు నన్ను రక్షించుగాక ! (19)

శ్లో॥ సర్వయాత్రా ఫలావాప్త్యై
యథాశక్తి ప్రదక్షిణమ్ ।
కరోమి తవ సిద్ధస్య
బృందావనగతం జలమ్,
శిరసా ధారయా మ్యద్య
సర్వతీర్థ ఫలాప్తయే ॥ 20

తా॥ మహాగురూ! కాశీరామేశ్వరాది యాత్రలు సలిపి నందువలన గలుగు పుణ్యమునకై తమ బృందావనమునకు యథాశక్తి ప్రదక్షిణ మొనర్చుచున్నాను మఱియు గంగాది సమస్తతీర్థముల యందు గ్రుంకిన నెట్టి ఫల మబ్బునో యట్టి ఫలమునకై నీ బృందావనమున కభిషేకించిన జలమును దలపై దాల్చుకొనుచున్నాను (20)

శ్లో॥ సర్వాభీష్టార్థ సిద్ధ్యర్థం
నమస్కారం కరో మ్యహమ్
తవ సంకీర్తనం వేద
శాస్త్రార్థజ్ఞానసిద్ధయే ॥ 21

తా॥ శ్రీరాఘవేంద్రస్వామీ! సర్వాభీష్టములు సిద్ధించుకొఱకు దమకు నమస్కారము నొనర్చుచున్నాను మఱియు సమస్త మగు వేదశాస్త్రజ్ఞానము లభించుటకై నిన్ను స్తుతించు చున్నాను (21)

శ్లో॥ సంసారేఽక్షయసాగరేప్రకృతితోఽగాధే సదా దుస్తరే
సర్వావద్య జలగ్రహై రనుపమైః కామాదిభంగాకులే।
నానావిభ్రమదుర్భ్రమేఽమితభయస్తోమాదిఫేనోత్కటే
దుఃఖోత్కృష్టవిషేసముద్ధరగురో!మామగ్నరూపంసదా

తా। స్వభావముచే అగాధమై అనుపమానంబులగు మొసళ్ళు మొదలగు జలచరంబుల బోలు దోషసమూహములచే

దాట శక్యము గానిదై, కామక్రోధ లోభమోహ మద మాత్సర్యములనెడు తరంగములచే భీకరమై, నానావిభ్రమము లనెడు సుడులచే ఆకర్షించుచు నపాయము గూర్చునదియై, భయసమూహ మనెడు డిండీర మండలముచే వెలుగు గొలుపునదియై, దుఃఖంబు లనెడు కాలకూటాది విషంబులచే భయజనకమై, అక్షయమై యొప్పు నీ సంసారసాగరంబున నెంతయు మునిగి పారము జేరలేకున్న నన్ను రాఘవేంద్ర ప్రభూ ! ఉద్ధరింపు ముద్ధరింపుము (22)

శ్లో॥ రాఘవేంద్ర గురుస్తోత్రం
యః పఠే ద్భక్తిపూర్వకమ్ ।
తస్య కుష్ఠాది రోగాణాం
నివృత్తి స్త్వరయా భవేత్ ॥ 23

తా॥ భక్తిపూర్వకముగా నెవ డీ రాఘవేంద్రగురు స్తోత్రమును బఠించునో వానికి త్వరలోనే కుష్ఠాదిరోగములు సైతము నివారణమగును (23)

శ్లో॥ అంధోఽపి దివ్యదృష్టిః స్యా
దేడమూకోఽపి వాక్పతిః
పూర్ణాయుః పూర్ణ సంపత్తిః
స్తోత్రస్యాఽస్య జపా ద్భవేత్ ॥ 24

తా॥ ఈ రాఘవేంద్ర స్తోత్రమను జపించునేని

జాత్యంధుడును, దివ్యదృష్టిగలవా డగును చెవుగల మూగయు బృహస్పతి వాక్చాతుర్యము గలవాడగును మఱియు యము పూర్ణసంపదలు గలవాడు సైతము నగును (24)

శ్లో॥ యః పిబే జ్జల మే తేన
స్తోత్రేణైవాభిమంత్రితమ్ ।
తస్య కుక్షిగతా దోషాః
సర్వే నశ్యంతి తత్క్షణాత్ ॥ 25

తా॥ ఈ స్తోత్రముచే అభిమంత్రింప ఒడిన నీరము నెవడు త్రాగునో వాని కుక్షిలో నున్న వ్యాధి వా రూపంబులు తత్క్షణమే నశించును

శ్లో॥ యద్బృందావన మాసాద్య ।
పంగుః ఖంజోఽపి వా జన ।
స్తోత్రేణానేన యః కుర్యాత్
ప్రదక్షిణ నమస్కృతీ ।
స జంఘాలో భవే దేవ
గురురాజ ప్రసాదత ॥ 26

తా॥ ఈచకాలువాడు గాని నడువశక్తిలేని కుంటి వాడు గాని యీ స్తోత్రమను పఠించుచు శ్రీరాఘవేంద్ర స్వాముల బృందావనమున ప్రదక్షిణ నమస్కారము లు

చేసినచో వాతడు వెంటనే స్వామివారి యనుగ్రహాతి శయముచే వడిగా వడువగల పిక్కబలము గలవాడు నిశ్చ యముగా నగును (26)

శ్లో॥ సోమసూర్యోపరాగే చ
పుష్యార్కాది సమాగమే ।
యోఽనుత్తమ మిదం స్తోత్ర
మష్టోత్తరశతం జపేత్ ।
భూత ప్రేత పిశాచాది
పీడా తస్య న జాయతే ॥ 27

తా॥ చంద్ర సూ గ్ర ను, పుష్యమీ నక్షత్ర సహితభానువాసంమునను, జన్మనక్షత్ర వైధృతి వ్యతీపాత పూర్ణిమామావాస్యాక్షోదయ మహోదయాది పుణ్యకాలములందును ఎవడీ స్తోత్రమును నూటయెనిమిదిమార్లు జపించునో వానికి భూతప్రేత పిశాచాది పీడలు తొలగును (27)

శ్లో॥ ఏతత్ స్తోత్రం సముచ్చార్య
గురో ర్బృందావనాంతికే ।
దీపసంయోజనాత్ జ్ఞానం
పుత్త్రలాభో భవేత్ ధ్రువమ్ 28

తా॥ ఈ స్తోత్రమును భక్తితో బఠించుచు శ్రీరాఘ వేంద్ర స్వాముల బృందావన సమీపమున దీపమును వెలిగించినచో జ్ఞానము, పుత్త్రసంతానము కలుగును (28)

శ్లో॥ పరవాదిజయో దివ్య
జ్ఞానభక్త్యాది వర్ధనమ్ ।
సర్వాభీష్ట ప్రవృద్ధిః స్యా
న్నాత్ర కార్యా విచారణా ॥ 29

తా॥ ఈ స్తోత్రమును బఠించుచు గురువుల బృందావనము కడదీపము వెలిగించువానికి సభలయందు ప్రతివాదులను గెలుచుటయు, అపరోక్షజ్ఞానము, హరి గురువులయెడ భక్తి మొదలగునవియు, సకల వాంఛల బడయుటయు గలుగును, సంశయ మేమాత్రమును లేదు (29)

శ్లో॥ రాజచోర మహావ్యాఘ్ర
సర్పనక్రాది పీడనమ్
న జాయతేఽస్య స్తోత్రస్య
ప్రభావా న్నాత్ర సంశయః ॥ 30

తా॥ ఈ రాఘవేంద్ర స్తోత్రమును బఠించు భక్తులకీ స్తోత్ర మహిమవలన రాజులవలన గాని, చోరులవలనగాని, వ్యాఘ్రములవలనగాని సర్పములవలన గాని మొసళ్లు మొదలుగాగల వాని వలనగాని బాధ కలుగదు సందేహ మేమాత్రము లేదు (30)

శ్లో॥ యో భక్త్యా గురురాఘవేంద్రచరణ
ద్వంద్వం స్మరన్ యః పఠేత్

స్తోత్రం దివ్య మిదం సదా నహి భవే
త్తస్యాసుఖం కించన ।
కింత్విష్టార్థసమృద్ధి రేవ కమలా
నాథ ప్రసాదోదయాత్
కీర్తి ర్దిగ్విదితా విభూతి రతులా
**సాక్షీహయాస్యోఽత్రహి ॥** 31

తా॥ ఎవడు భక్తిశ్రద్ధలతో శ్రీరాఘవేంద్రస్వాముల పాదపద్మములను స్మరించుచు నీస్తోత్రరత్నమును పారాయణ మొనర్చునో వానికి గొంచెమేనియు దుఃఖము గలుగదు సైగా శ్రీహరి యనుగ్రహముచే సర్వాభీష్టములు సిద్ధించును గొప్ప కీర్తి వచ్చును సాటిలేని సంపదలు కలుగును ఈ విషయమున హయగ్రీవమూర్తియే ప్రమాణము 31

ఈశ్లోకమున సంప్రదాయజ్ఞులగు పెద్దలీ విషయమును జెప్పుదురు శ్రీమదప్పణాచార్యులుగారు శ్రీరాఘవేంద్రస్వాముల బృందావన సమీపమున నీస్తోత్రము రచించుచు ఈశ్లోకము నాల్గవ పాదమున 'కీర్తిర్దిగ్విదితా విభూతి రతులా' అను వఱకు రచింపగా బృందావనమునుండి రాఘవేంద్రస్వాముల స్వరముతో 'సాక్షీ హయాస్యోఽత్ర హి' అను వర్ణ సపకము వెలువడినదనియు అప్పణాచార్యులవారు చెప్పిన ఫలమునందు శ్రీహయగ్రీవమూర్తిని ప్రమాణ మిచ్చుచు శ్రీరాఘవేంద్ర గురువులు తమ సమ్మతిని దెలియజేసిరనియు ఆ సాక్షితో శ్రీఅప్పణా

చార్యులవారు తమస్తోత్రమును బూర్తి గావించుకొనిరనియు గింవదంతి.

శ్లో॥ ఇతి శ్రీరాఘవేంద్రార్య
గురురాజ ప్రసాదతః ।
కృతం స్తోత్ర మిదం పుణ్యం
శ్రీమద్భిర్హ్యప్పణాభిధైః ॥ 32

తా॥ ఈ విధముగా శ్రీరాఘవేంద్రార్యులైన గురుశ్రేష్ఠుల అనుగ్రహమువలన గురు కృపాపాత్రుడైన అప్పణాచార్యులను పేరుగల వారి చేత ఈ స్తోత్రము స్తుతింపబడెను. (32)

శ్లో॥ పూజ్యాయ రాఘవేంద్రాయ
సత్యధర్మరతాయ చ ।
భజతాం కల్పవృక్షాయ
నమతాం కామధేనవే ॥ 33

తా॥ పూజింప దగినవాడును, సత్యధర్మముల యందాసక్తిగలవాడును, భక్తితో సేవించువారికి కల్పవృక్షమువంటివాడును, ప్రపత్తితో నమస్కరించు వారికి కామధేనువువంటివాడును నగు శ్రీరాఘవేంద్రస్వామికి నమస్కారము. (33)



# శ్రీ రాఘవేంద్ర కవచమ్

కవచం రాఘవేంద్రస్య యతీంద్రస్య మహాత్మనః ।
వక్ష్యామి గురువర్యస్య వాంఛితార్థ ప్రదాయకమ్ ॥ 1

మహాత్ముడు, యతిశ్రేష్ఠుడు, గురువర్యుడు నగు రాఘవేంద్రునియొక్క వాంఛితార్థము నొసంగు కవచమును చెప్పుచున్నాను

ఋషిరస్యాప్పణాచార్య ఛందోనుష్టుప్ ప్రకీర్తితమ్ ।
దేవతా శ్రీరాఘవేంద్రగురురిష్టార్థ సిద్ధయే ॥ 2

ఈ కవచమునకు ఋషి అప్పణాచార్యులు, ఛందస్సు అనుష్టుప్పు దేవత శ్రీరాఘవేంద్రగురువు, ఇష్టార్థసిద్ధి కొఱకు ఇది చెప్పబడినది

అష్టోత్తరశతం జాప్యం భక్తియుక్తేన చేతసా ।
ఉద్యత్ ప్రద్యోతనద్యోత ధర్మకూర్మాసనేస్థితమ్ ॥ 3

ప్రకాశించు సూర్యునివలె వెలుగొందు సువర్ణకూర్మాసనమునందు కూర్చుండి భక్తితో గూడిన మనస్సుతో నూటయెనిమిది మారులు దీనిని జపింపవలెను

ఖద్యఖద్యోతనద్యోత ప్రతాపం రామమానసమ్ ।
ధృతకాషాయవసనం తులసీహారవక్షసమ్ ॥ 4

సూర్యనిప్రకాశము వంటి ప్రతాపము గలవాడు, రామ మానసుడు, కాషాయ వస్త్రములను ధరించినవాడు, తులసీ మాలలచే శోభిల్లు వక్షస్థలము గలవాడు.

దోర్దండవిలసద్దండ కమండలువిరాజితమ్ ।
అభయజ్ఞానముద్రాక్షమాలాలసీల కరాంబుజమ్ ॥ 5

భుజదండములయందు విరాజిల్లు దండకమండలములు గలవాడు, అభయజ్ఞానముద్ర అక్షమాల హస్తమునందు గలవాడు.

యోగీంద్రవంద్యపాదాబ్జం రాఘవేంద్రగురుం భజే ॥
శిరోరక్షతు మే నిత్యం రాఘవేంద్రోఽఖిలేష్టదః ॥ 6

యోగీంద్రులచే నమస్కరింపదగు పాదపద్మములు గలవాడు నగు రాఘవేంద్ర గురువును సేవించుచున్నాను. సమస్తవాంఛలను దీర్చునట్టి రాఘవేంద్రుడు నిత్యము నాశిరస్సును రక్షించుగాక !

పాపాద్రిపాటనే వజ్రః కేశాన్ రక్షతు మే సదా ।
క్షమాసురగణాధీశో ముఖం రక్షతు మే గురుః ॥ 7

పాపములనెడు పర్వతమును ఛేదించుటయందు వజ్రాయుధము వంటివాడైన రాఘవేంద్రుడు ఎల్లప్పుడును నా కేశములను రక్షించుగాక ! భూసురగణముల కధీశుడు, గురువునగు శ్రీరాఘవేంద్రుడు నా ముఖమును రక్షించుగాక !

హరిసేవాలబ్ధసర్వసంపత్ ఫాలం మమావతు ।
దేవస్వభావోఽవతు మే దృశౌ తత్త్వప్రదర్శకః ॥ 8

హరిసేవవలన లభించిన సర్వసంపదలు గలిగిన రాఘవేంద్రుడు నాఫాల భాగమును కాపాడుగాక ! దేవస్వభావుడు, తత్త్వజ్ఞానమును ప్రదర్శించువాడు నగు రాఘవేంద్రుడు నాదృక్కులను కాపాడుగాక !

ఇష్టప్రదానే కల్పద్రు శ్రోత్రే శ్రుత్యర్థబోధకః ।
భవ్యస్వరూపో మే నాసాం జిహ్వాం మేఽవతుభవ్యకృత్ ॥ 9

ఇష్టార్థముల నొసంగుటయందు కల్పవృక్షమువంటివాడు శ్రుత్యర్థములను బోధించువాడు నగురాఘవేంద్రుడు నాశ్రోత్రములను (చెవులను) భవ్యస్వరూపుడు నానాసికను, శుభంకరుడు నాజిహ్వను (నాలుకను) రక్షించుగాక !

ఆస్యం రక్షతు మే దుఃఖతూలసంఘాగ్ని చర్యకః ।
సుఖధైర్యాదిసుగుణో భ్రువౌ మమ సదావతు ॥ 10

దుఃఖములనెడు దూది మూటలను అగ్నివలె దగ్ధము చేయువాడు నా ముఖమును, సుఖము ధైర్యము మున్నగు సుగుణములు గలవాడు నా కనుబొమ్మలను ఎల్లప్పుడు రక్షించుగాక !

ఓష్ఠౌ రక్షతు మే సర్వగ్రహనిగ్రహశక్తిమాన్ ।
ఉపప్లవోదధిసేతుర్దంతాన్ రక్షతు మే సదా ॥ 11

సర్వగ్రహములను నిగ్రహించుటయందు సామర్థ్యము గలవాడు నా ఓష్ఠములను (పెదవులను), ఉపద్రవములనెడు సముద్రమునకు సేతువువంటివాడు నా దంతములను ఎల్లప్పుడు రక్షించుగాక !

నిరస్తదోషో మే పాతు కపోలౌ సర్వపాలకః ।
నిరవద్య మహావేషః కంఠం మేఽవతు సర్వదా ॥ 12

దోషములు లేనివాడు, సర్వపాలకుడు నా కపోలములను (చెంపలను), దోషములేని మహావేషముగలవాడు నా కంఠమును అన్ని వేళల రక్షించుగాక !

కర్ణమూలే తు ప్రత్యర్థి మూకత్వకరవాఙ్మమ ।
బహువాదిజయీ పాతు హస్తౌ సత్తత్త్వవాదకృత్ ॥ 13

ప్రత్యర్థులను మూగివానినిగా జేయువాడు నా కర్ణములను (చెవులను) పెక్కుండ్రు వాదులను జయించువాడు, సత్తత్త్వమును గూర్చి వాదించువాడు నా హస్తములను రక్షించుగాక!

కరౌ రక్షతు మే విద్వత్ పరిజ్ఞేయవిశేషవాన్ ।
వాగ్వైఖరీభ శేషజయీ వక్షస్థలం మమ ॥ 14

విద్వాంసులు దెలిసికొనదగిన విశేషములు గలవాడు నా కరములను రక్షించుగాక ! వాగ్వైఖరిచేత గొప్పవాడైన

అదిశేషువును జయించినవాడు నా వక్షస్థలమును రక్షించుగాక!

సతీసంతానసంపత్తి భక్తిజ్ఞానాదివృద్ధికృత్ ।
స్తనౌ రక్షతు మే నిత్యం శరీరావద్యహానికృత్ ॥ 15

పత్నీ పుత్రసంతాన సంపదను భక్తిజ్ఞానాదులను వృద్ధి చేయువాడు, శరీరము నందలి దోషములను నశింపజేయువాడు నగురాఘవేంద్రుడు నా స్తనములను రక్షించుగాక!

పుణ్యావర్ధనపాదాబ్జాభిషేకజలసంచయః ।
నాభిం రక్షతు మే పార్శ్వౌ ద్యునదీతుల్యసద్గుణః ॥ 16

పుణ్యమును పెంచునట్టి పాదపద్మముల యందలి అభిషేక జలముయొక్క సమూహముగలవాడు నానాభిని రక్షించుగాక ఆకాశగంగతో సమానమైన సద్గుణములుగలవాడు రెండువైపుల నన్నురక్షించుగాక !

పృష్ఠం రక్షతు మే నిత్యం తాపత్రయవినాశకృత్ ।
కటిం మే రక్షతు సదా వంధ్యాసత్పుత్రదాయకః ॥ 17

తాపత్రయమును నాశముచేయువాడు ఎల్లప్పుడు నాపృష్ఠమును (వెనుక భాగమును) రక్షించుగాక! గొడ్రాలికి సత్పుత్రులనొసంగువాడు ఎల్లప్పుడు నా కటి భాగమును (నడుమును) రక్షించుగాక!

జఘనం మేఽవతు సదా వ్యంగస్వంగసమృద్ధికృత్ ।
గుహ్యం రక్షతు మే పాపగ్రహారిష్టవినాశకృత్ ॥ 18

వికలాంగులకు సహితముమంచి అవయవముల యొక్క పాటవము నొసంగువాడు నిత్యము నాజఘనములను (పిరుదులను) రక్షించుగాక! పాపగ్రహాదుల వలన సంభవించు అనర్థములను నాశన మొనరించువాడు నాగుహ్యాంగములను రక్షించుగాక!

భక్తాఘవిధ్వంసకరనిజమూర్తి ప్రదర్శకః ।
మూర్తిమాన్ పాతుమేరోమం రాఘవేంద్రో జగద్గురుః॥ 19

భక్తుల పాపములను విధ్వంస మొనరించునట్టి తన స్వరూపమును ప్రదర్శించువాడు, జగద్గురువు నగు శ్రీరాఘవేంద్ర స్వామి నా రోమములను మూర్తిమంతుడై రక్షించుగాక !

సర్వతంత్ర స్వతంత్రోఽసౌ జానునీ మే సదాఽవతు
జంఘే రక్షతు మే నిత్యం శ్రీమధ్వమతవర్ధనః ॥ 20

సర్వతంత్ర స్వతంత్రు డైనవాడు నాజానువులను (మోకాళ్ళను) రక్షించుగాక ! మధ్వమత వర్ధను డైనవాడు నాజంఘములను (పిక్కలను) రక్షించుగాక !

విజయీంద్రకరాబ్జోత్థ సుధీంద్రవరపుత్రకః ।
గుల్ఫౌ శ్రీరాఘవేంద్రో మే యతిరాట్ సర్వదావతు ॥ 12

శ్రీవిజయీంద్ర కరపద్మములనుండి ఉద్భవించినవాడైన సుధీంద్రమునివరపుత్రుడు, శిష్యుడు, యతీశ్వరుడు నైన శ్రీరాఘవేంద్రస్వామి నాగుల్ఫములను (చీలమండలను) రక్షించుగాక!

పాదౌ రక్షతు మే సర్వాభయహారీ కృపానిధిః ।
జ్ఞాన భక్తి సుపుత్రాయుర్యశః శ్రీ పుణ్యవర్ధనః ॥ 22

సర్వజనులకు అభయము నిచ్చునట్టిదయానిధి, జ్ఞానము, భక్తి, సుపుత్రులను, ఆయుష్యమును, యశస్సును, సంపదను, పుణ్యమును వృద్ధి యొనరించువాడు నా పాదములను రక్షించుగాక!

కరపాదాంగులీస్సర్వా మమావతు జగద్గురుః ।
ప్రతివాదిజయస్వాంత భేద చిహ్నాదరో గురుః ॥ 23

ప్రతివాదులను జయించునపుడు తన హృదయమున భేద చిహ్నమును (ద్వైతచిహ్నమును) ఆదరమున ధరించు జగద్గురువు నా కరపాదాంగుళీయకములను రక్షించుగాక!

నఖానవతు మే సర్వాన్ సర్వశాస్త్ర విశారదః ।
అపరోక్షీకృతశ్రీశః ప్రాచ్యాం దిశి సదావతు ॥ 24

సర్వశాస్త్రవిశారదుడు నా నఖములను రక్షించుగాక! శ్రీపతిని ప్రత్యక్షమొనరించుకొనినవాడు, నన్ను తూర్పుదిక్కునందు సదా రక్షించుగాక!

స దక్షిణే చావతు మాం సముపేక్షితభావజః ।
అపేక్షితప్రదాతా చ ప్రతీచ్యామవతు ప్రభుః ॥ 25

మన్మథుని ఉపేక్షించినవాడు నన్ను దక్షిణదిక్కునందు సదారక్షించుగాక! అపేక్షితముల (కోరినకోర్కెలు) నిచ్చు ప్రభువు నన్ను పడమర దిక్కునందు రక్షించుగాక!

దయాదాక్షిణ్యవైరాగ్యవాక్పాటవముఖాంకితః ।
సదోదీచ్యామవతు మాం శాపానుగ్రహశక్తిమాన్ ॥ 26

దయ, దాక్షిణ్యము, వైరాగ్యము, వాక్పాటవములతో కూడిన ముఖము కలవాడు, శాపానుగ్రహశక్తి కలవాడు, నన్ను ఉత్తరదిక్కునందు సదా రక్షించుగాక!

నిఖిలేంద్రియదోషఘ్నో మహానుగ్రహకృద్గురుః ।
అధశ్చోర్ధ్వం చావతు మామష్టాక్షరమనూదితః ॥ 27

సర్వేంద్రియ దోషములను పోగొట్టి మహానుగ్రహమును సంపాదింప జేయునట్టి గురువు నా అధో దేశమును, అష్టాక్షర మంత్రముచే నిరూపితుడైనగురువు నా ఊర్ధ్వదేశమును రక్షించుగాక!

ఆత్మాత్మీయాఘరాశిఘ్నో మాం రక్షతు విదిక్షు చ ।
చతుర్ణాం చ పుమర్థానాం దాతా ప్రాతః సదావతు ॥ 28

నా యొక్కయు, నా ఆత్మీయుల యొక్కయు, పాప సమూహములను నాశన మొనరించు నట్టివాడు, ధర్మార్థకామ

మోక్షములను చతుర్విధ పురుషార్థముల నిచ్చు నట్టివాడు, దిక్కులయందు, విదిక్కులందు నన్ను రక్షించుగాక!

సంగమేఽవతు మాం నిత్యం తత్త్వవిత్ సర్వసౌఖ్యకృత్ ।
మధ్యాహ్నేఽగమ్యమహిమా మాం రక్షతు మహాయశాః॥ 29

తత్త్వముల నెరింగినవాడు, సర్వ సౌఖ్యములను సంపాదించువాడు, మధ్యాహ్న సమయమున మహిమ తెలియుటకు శక్యముగానివాడు నన్ను సంగమమున రక్షించుగాక!

మృతపోత సాయాహ్నే మాం సదావతు ।
వేదిస్థ పురుషోజ్జీవీ నిశీథే పాతు మాం గురుః ॥ 30

చనిపోయిన బాలకులకు ప్రాణదాత నన్ను సాయంకాలమున రక్షించుగాక! అరుగపైనున్న పురుషుని జీవింపజేసిన వాడు నన్ను రాత్రియందు రక్షించుగాక!

వహ్నిస్థమాలికోద్ధర్తా వహ్నితాపాత్సదావతు ।
సమగ్రటీకావ్యాఖ్యాతా గురుర్మే విషయేఽవతు ॥ 31

అగ్నిలో పడిన రత్నమాలికను ఉద్ధరించినవాడు, అగ్నిపాతమునుండి నన్ను రక్షించుగాక! సంపూర్ణముగ టీకావ్యాఖ్యాన మొనరించిన గురువు విషయములనుండి నన్ను సదా రక్షించుగాక!

కాంతారేఽవతు మాం నిత భాట్టసంగ్రహకృద్గురు ।
సుధాపరిమళోద్ధర్తా సుచ్ఛందస్తుసదావతు ॥ 32

భాట్ట సంగ్రహమహా గ్రంథమును రచించిన గురువు నన్ను అరణ్యములందు రక్షించుగాక! శ్రీమన్న్యాయ సుధకు పరిమళ వ్యాఖ్యానమును రచించినవాడు, మంచి అభిప్రాయముల యందు సదా నన్ను రక్షించుగాక!

రాజచోరవిషవ్యాధియాదోవన్యమృగాదిభిః ।
అపస్మారాపహర్తా నః శాస్త్రవిత్ సర్వదావతు ॥ 33

రాజభయము, చోరభయము, విషవ్యాధులు, జలజంతువులు, వన్యమృగములు వీనినుండి రక్షించువాడు, సర్వశాస్త్రముల నెరింగినవాడు నన్ను అపస్మార రోగమునుండి రక్షించుగాక!

గతౌ సర్వత్ర మాం పాతూపనిషదర్థ కృద్గురుః ।
ఋగ్వ్యాఖ్యానకృదాచార్యః స్థితౌ రక్షతు మాం సదా ॥ 34

ఉపనిషదర్థములను ఆచరించిన గురువు అంతటా నన్ను రక్షించుగాక! ఋగ్వేద వ్యాఖ్యానముల నొనరించిన గురువు, స్థితిలో నన్ను రక్షించుగాక!

మంత్రాలయనివాసీ మాం జాగ్రత్ కాలే సదావతు ।
న్యాయముక్తావలీకర్తా స్వప్నే రక్షతు మాం సదా ॥ 35

మంత్రాలయమున నివసించువాడు నన్ను జాగ్రత్కాలమందు సదా రక్షించుగాక! న్యాయముక్తావళి యను మహా గ్రంథమును రచించినవాడు నన్ను సదా స్వప్నములో రక్షించుగాక!

మాం పాతు చంద్రికావ్యాఖ్యాకర్తా సుప్తొహిత త్త్వకృత్ ।
సుతంత్రదీపికాకర్తా ముక్తౌ రక్షతు మాం గురుః ॥ 36

చంద్రికా వ్యాఖ్యానమును రచించినవాడు, తత్త్వ మెరిగినవాడు, సుతంత్ర దిపికయను గ్రంథమును రచించినవాడు, నన్ను ముక్తిలో రక్షించుగాక !

గీతార్థసంగ్రహాకర్తా సదా రక్షతు మాం గురుః ।
శ్రీమధ్వమతదుగ్ధాబ్ధి చంద్రోఽవతు సదానఘః ॥ 37

గీతార్థ సంగ్రహామును రచించిన గురుదేవుడు నన్నెల్లప్పుడు రక్షించుగాక! మధ్వ మత మనెడు క్షీరసాగరము నుండి ఉద్భవించిన చందురుడు నిత్యము నన్ను రక్షించుగాక !

ఫలశ్రుతి

ఇతి శ్రీ రాఘవేంద్రస్య కవచం పాపనాశనమ్ ।
సర్వవ్యాధిహారం సద్యః పావనం పుణ్యవర్ధనమ్ ॥ 38

ఇది శ్రీరాఘవేంద్ర కవచము పాపములను నశింప జేయునది సర్వ వ్యాధులను హరించునది ఇది సత్యము, పావనము, పుణ్యములను వృద్ధి చేయునది

య ఇదం పఠతే నిత్యం నియమేన సమాహితః ।
అదృష్టిః పూర్ణదృష్టిః స్యాదేడమూకోపివాక్పతిః ॥ 39

నియమముగా నిష్టకలవాడై నిత్యము ఈ కవచమును పఠించినచో, దృష్టిలేనివాడు పూర్ణ దృష్టివంతుడగును, మూగవాడు వాక్పతి యగును

పూర్ణాయుః పూర్ణసంపత్తి భక్తిజ్ఞానాదివృద్ధికృత్ ।
పీత్వా వారినరో యేన కవచేనాభిమంత్రితమ్ ॥ 40

ఈకవచముతో మంత్రించిన ఉదకమును త్రావినచో పూర్ణాయుర్దాయము, పూర్ణసంపద, భక్తి, జ్ఞానాభివృద్ధి కలవాడగును.

జహాతి కుక్షిగాన్ రోగాన్ గురువర్య ప్రసాదతః ।
ప్రదక్షిణ నమస్కారాన్ గురో ర్వృందావనస్య యః ॥ 41

గురుదేవునకు, బృందావనమునకు ప్రదక్షిణ నమస్కారముల నొనరించినవాడు గురువు అనుగ్రహామువలన ఉదర రోగముల నన్నింటిని నశింపజేసికొనగలడు.

కరోతి పరయా భక్త్యా తదేతత్ కవచం పఠన్ ।
పంగుః కుణిశ్చపోగండః పూర్ణాంగో జాయతే ధ్రువమ్ ॥ 42

భక్తితో కూడుకొని ఈకవచమును పఠించువాడు, కుంటివాడైనను అంగహీనుడైనను పూర్ణాంగుడగును.

శేషాశ్చ కుష్ఠపూర్వాశ్చ నశ్యంత్యామయరాశయః ।
అష్టాక్షరేణ మంత్రేణ స్తోత్రేణ కవచేన చ ॥ 43

అష్టాక్షరమంత్రమును, కవచమును, స్తోత్రమును పఠించినచో కుష్ఠు మొదలైన మిగిలిన భయంకర వ్యాధులు నశించిపోవును.

వృందావనే సన్నిహితమభిషిచ్య యథావిధి ।
యంత్రే మంత్రాక్షరాణ్యష్టౌ విలిఖ్యాత్ర ప్రతిష్ఠితం ॥ 44

బృందావనము చెంత మంత్రాక్షరములను యెనిమిదింటిని లిఖించి, యంత్రమునుంచి యథావిధిగ అభిషేకింపవలెను

షోడశైరుపచారైశ్చ సంపూజ్య త్రిజగద్గురుమ్ ।
అష్టోత్తర శతాఖ్యా రర్చయేత్ కుసుమాదిభిః ॥ 45

త్రిజగములకు గురువైన శ్రీరాఘవేంద్రస్వామిని షోడశోపచారములతో పూజింపవలెను అష్టోత్తరశతనామములను బల్కుచు పుష్పముల నర్పింపవలెను

ఫలైశ్చ వివిధైరేవ గురోరర్చాం ప్రకుర్వతః ।
నామశ్రవణమాత్రేణ గురువర్యప్రసాదత ॥ 46

భూతప్రేత ... ః విద్రవంతి దిశో దశ ।
పఠేదేతత్ త్రికం నిత్యం గురోర్ బృందావనాంతికే ॥ 47

నిత్యము బృందావనము చెంత మూడింటిని (స్తోత్ర, కవచ, మంత్రములను) పఠించి వివిధములగు ఫలములతో గురుదేవు నర్చించినచో, గురుశ్రేష్ఠుని నామ వణ మాత్రముననే ఆయన ప్రసాదమువలన భూతప్రేతపిశాచాదులు పది దిక్కులకు పారిపోవును

దీపసంయోజ్య విద్యావాన్ సభాసు విజయీభవేత్ ।
రాజచోరమహావ్యాఘ్రసర్పనక్రాది పీడనమ్ ॥ 48

విద్యావంతుడైనవాడు బృందావనముచెంత దీపమును వెలిగించినచో సభలలో విజయమును పొందగలడు. అతడు రాజువలన, చోరులవలన, వ్యాఘ్రాది క్రూర జంతువులవలన, సర్పములవలన, మొసళ్ళవలన పీడలేనివాడగును.

కవచస్య ప్రభావేన భయం తస్య నజాయతే।
సోమసూర్యోపరాగాదికాలే వృందావనాంతికే ॥ 49

సూర్యచంద్ర గ్రహణ సమయములో బృందావనము చెంత నీకవచమును పఠించిన వానికి ఈకవచప్రభావమున ఎట్టి భయము యుండదు.

కవచాదిత్రికం పుణ్యం అప్పణాచార్యదర్శితం ।
జపేద్యః స ధనం పుత్రాన్ భార్యాం చ సుమనోహరామ్॥ 50

శ్రీఅప్పణాచార్యులు రచించిన పుణ్యమయములైన ఈకవచత్రయము (కవచము, స్తోత్రము, మంగళాష్టకము) ను జపించువాడు ధనమును, భార్యను, పుత్రులను, సంపదలను పొందగలడు.

జ్ఞానం భక్తిం చవైరాగ్యం భుక్తిం ముక్తిం చ శాశ్వతీమ్।
సంప్రాప్య మోదతే నిత్యం గురువర్య ప్రసాదతః ॥ 51

ఈకవచత్రికమును (కవచము, స్తోత్రము, మంగళాష్టకము) పఠించినవాడు గురుదేవుని అనుగ్రహము వలన జ్ఞానమును, భక్తిని, వైరాగ్యమును, భుక్తిని, శాశ్వతమగు ముక్తిని పొంది సంతోషము కలవాడగును.

# శ్రీ రాఘవేంద్రస్వామి జప విధానము

ఓం అస్య శ్రీరాఘవేంద్రాష్టాక్షరీ మహామంత్రస్య అప్పణాచార్యః ఋషిః గాయత్రీ ఛందః, శ్రీరాఘవేంద్ర గుర్వాన్తర్గత శ్రీమూలరామచన్ద్రో దేవతా, ఓం బీజం, శ్రీం శక్తిః, రాఘవేంద్రాయ నమః కీలకమ్, శ్రీరాఘవేంద్రప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః.

ఓం అంగుష్ఠాభ్యాం నమః
శ్రీం తర్జనీభ్యాం నమః,
రాఘవేంద్రాయ మధ్యమాభ్యాం నమః ॥
నమః అనామికాభ్యాంనమః
ఇతికనిష్ఠికాభ్యాంనమః
శ్రీరాఘవేంద్రాయ కరతలకరపృష్ఠాభ్యాం నమః ॥
ఇతికరన్యాసః
అథఅంగన్యాసః ;
శ్రీం హృదయాయ నమః
రాఘవేంద్రాయ శిరసే స్వాహా నమః ॥
శిఖాయై వషట్
శ్రీం కవచాయ హుమ్
రాఘవేంద్రాయ నేత్రాభ్యాం వౌషట్
నమః అస్త్రాయ ఫట్
ఇతి దిగ్బంధః ॥

## ధ్యానమ్

తప్త కాంచన సంకాశ మక్షమాలాం కమణ్డలుమ్
దోర్భ్యాం దధానం కాషాయవసనం రామమానసమ్
యోగీన్ద్రతీర్థవంద్యాఙ్ఘ్రిం తులసీదామభూషితమ్
జ్ఞానభక్తితపః పూర్ణం ధ్యాయేత్సర్వార్థసిద్ధయే.

పుటము బెట్టిన పసిడివంటి దేహకాంతి కలవాడును, ఒకచేతజపమాలను, వేఱొకచేతకమండలువునుదాల్చి కాషాయ వస్త్రములను ధరించి యున్నవాడును, సదా శ్రీరామపరబ్రహ్మ మందు మనస్సును నిల్పినవాడును, తులసీదళమాలలను ధరించిన వాడును, యోగీంద్రతీర్థాదులచే పాదాభివందనములను బొందు వాడును, భక్తిజ్ఞానతపసాదులచే పరిపూర్ణుడైనవాడును నగు శ్రీరాఘవేంద్రతీర్థస్వామిని సకలార్థసిద్ధికొఱకు ధ్యానించెదను.

శ్రీవారిమంత్రమునకు అధిదేవతాపర మగు అర్థముగూడ స్ఫురించును. ఓం = ఓంకారస్వరూపుడును; శ్రీ = లక్ష్మీ స్వరూపురా లగుసీతతో గూడినవాడును, రాఘవేంద్రాయ = రఘువంశమందు శ్రేష్ఠు డగురామచంద్రునకు, నమః = నమస్కారము.

"ఓం శ్రీ రాఘవేంద్రాయ నమః"



# షోడశోపచార పూజ

పదునాఱు ఉపచారములచే శ్రీవారిని పూజింపవలెను

1 ధ్యానము, 2 ఆవాహనము, 3 ఆసనసమర్పణము, 4 పాద్యసమర్పణము, 5 అర్ఘ్యసమర్పణము, 6 ఆచమన సమర్పణము, 7 మధుపర్క సమర్పణము, 8 అనులేపనసమర్పణము, 9 స్నానముసమర్పణము, 10 వస్త్ర సమర్పణము, 11 యజ్ఞోపవీతసమర్పణము, 12 ఆభరణ సమర్పణము, 13 గంధసమర్పణము, 14 అక్షతసమర్పణము, 15 పుష్పమాలా సమర్పణము, 16 ధూపదీప సమర్పణము

తదనంతరము ఈక్రిందివిధముగ పూజలను కొనసాగింపవలెను 1 నైవేద్యసమర్పణము 2 హస్తప్రక్షాళనార్థము అర్ఘ్యసమర్పణము 3 తాంబూలసమర్పణము 4 సువర్ణ దక్షిణాసమర్పణము 5 మంత్రపుష్పసమర్పణము 6 నీరాజన సమర్పణము 7 ప్రదక్షిణాచరణము

తదనంతరము ఉత్తరపూజ నొనరింపవలెను

1 ఛత్ర సమర్పణము, 2 చామర సమర్పణము, 3 దర్పణదర్శనము 4 వాద్యవాదనము 5 జయజయాకార సమర్పణము 6 నృత్యము 7 గీతము 8 సమస్తరాజోప

చారమంత్రోపచార పూజాసమర్పణము 9. శ్రీకృష్ణార్పణము 10. సాష్టాంగదండప్రణామము.

ఇట్లుపూజను పూర్తిచేసి శ్రీవారివిగ్రహమును చేతులతో సైకెత్తి ఆరాధనామహోత్సవమునకు అరుదెంచిన సర్వులకు జూపింపవలెను.

## శ్రీమత్సద్గురు రాఘవేంద్ర మంగళాష్టకమ్

శ్రీమద్రామపదారవిందమధుపః శ్రీమధ్వవంశాధిపః
సచ్ఛిష్యోడుగణోడుపః శ్రితజగద్గీర్వాణసత్పాదపః ।
అత్యర్థం మనసా కృతాచ్యుతజపః పాపాంధకారాతపః
శ్రీమత్సద్గురు రాఘవేంద్ర యతిరాట్ కుర్యాద్ధ్రువం
మంగళమ్ ॥ 1

శ్రీరాముని పాదపద్మములందు తుమ్మెద ఐనట్టివాడును, మధ్వవంశమునకుఅధిపతి ఐనట్టివాడుట, మంచిశిష్యులను నక్షత్రములలోని చంద్రుడును, ఆశ్రితులపాలిటి కల్పవృక్షమును, మానసికముగా మాధవమంత్రజపమును సమధికముగా జేసినట్టివాడును, పాప మనునంధకారమునకు సూర్యకాంతి ఐనట్టివాడును, అగు శ్రీసద్గురురాఘవేంద్రయతీంద్రుడు శాశ్వత మంగళమును గూర్చుగాక.

కర్మంద్రీంద్ర సుధీంద్ర సద్గురుకరాంభోజోద్భవః సంతతం
ప్రాజ్యధ్యానవశీకృతాఖిలజగద్వాస్తవ్యలక్ష్మీధవః ।
సచ్ఛాస్త్రాతివిదూషకాఖిలమృషావాదీభకంఠీరవః
శ్రీమత్సద్గురురాఘవేంద్రయతిరాట్ కుర్యాద్ధ్రువం మంగళమ్॥

యతీశ్వరులగు సుధీంద్ర సద్గురువుల కరకమలసంజాతుడును, నిరంతరము మహత్తరమగు ధ్యానముతో సర్వజగన్నివాసి యగు లక్ష్మీపతిని వశమొనర్చుకొనినవాడును, మంచి శాస్త్రములను మిక్కిలిగా దూషించు అసత్యవాదులనెడి సమస్త ప్రతివాదులనెడి గజములపాలిటి సింహము నగుశ్రీసద్గురురాఘవేంద్రయతీంద్రుడు శాశ్వత మంగళకరుడగుగాక

సాలంకారిక కావ్యనాటకకలాకాణాదపాతంజల
త్రైయ్యర్థస్మృతి జైమినీయ కవితా సంగీతపారంగత ।
విప్రక్షత్రవిడంఘ్రి జాతముఖరానేక ప్రజాసేవితః
శ్రీమత్సద్గురురాఘవేంద్రయతిరాట్ కుర్యాద్ధ్రువం మంగళమ్॥

అలంకారశాస్త్రము, కావ్యములు, నాటకములు, కళలు, న్యాయశాస్త్రము, వ్యాకరణము, వేదార్థప్రతిపాదకస్మృతులు, మీమాంసకవిత్వము, సంగీతములందు పారంగతుడును, అనంతమైనచాతుర్వర్ణ్యప్రజాసేవితుడును నగు శ్రీసద్గురు రాఘవేంద్ర యతీంద్రుడు నిరంతరము మంగళకరుడగుగాక

రంగోత్తుంగ తరంగ మంగళకర శ్రీతుంగభద్రాతట
ప్రత్యస్థ ద్విజపుంగవాలయలసన్ మంత్రాలయాఖ్యేపురే
నవ్యేంద్రోపల నీలభవ్యకరసద్బృందావనాంతర్గతః
శ్రీమత్సద్గురురాఘవేంద్రయతిరాట్కుర్యాద్ధ్రువంమంగళమ్ 4

శుభంకరమైన ఉత్తుంగతరంగములతో మంగళకరమగు తుంగభద్రానదీతీరమున నున్నట్టియు, బ్రాహ్మణశ్రేష్ఠులతో ప్రకాశించు మంత్రాలయపురమునందు నవీనములగు ఇంద్రనీలమణులవలె శుభకరమైన బృందావనమునందున్న శ్రీసద్గురు రాఘవేంద్ర యతీంద్రుడు మంగళకరుడగుగాక.

విద్వద్రాజశిరః కిరీటఖచితానర్ఘోరు రత్నప్రభా
రాగాఘౌఘహ పాదుకద్వయచరః పద్మాక్షమాలాధరః
భాస్వద్దండ కమండలూజ్జ్వలకరః రక్తాంబరాడంబరః
శ్రీమత్సద్గురురాఘవేంద్రయతిరాట్కుర్యాద్ధ్రువంగళమ్ 5

పండితశ్రేష్ఠుల శిరస్సులందలి కిరీటములందు ఖచితములైన అనర్ఘములైన రత్నములకాంతులతో పాపపుంజముల నశింపజేయు పాదుకలతో చరించువాడును, పద్మబీజముల అక్షమాలను ధరించువాడును, దండకమండలములు హస్తములందు విరాజిల్లువాడును, అరుణవస్త్రధారియు నగుశ్రీసద్గురు రాఘవేంద్రయతీంద్రుడు శాశ్వతమంగళము గూర్చుగాక.

యస్బృందావన సప్రదక్షిణ నమస్కారాభిషేక స్తుతి
ధ్యానారాధన మృద్విలేపన ముఖానేకోపచారాన్ సదా
కారంకారమభిప్రయాంతి చతురోలోకాః పుమర్థాన్ సదా
శ్రీమత్సద్గురురాఘవేంద్రయతిరాట్ కుర్యాద్ధ్రువంమంగళమ్ 6

ఎవరినివాసమగు బృందావనమునందుప్రదక్షిణనమస్కారములను, అభిషేకములను, స్తోత్రములను, ధ్యానమును, ఆరాధనమును, మృద్విలేపనము మున్నగు నుపచారములను నిరంతరము చేసిచేసి చతుర్లోకములు పురుషార్థములను పొందుచున్నవో ఆ శ్రీమత్సద్గురు రాఘవేంద్రయతీంద్రుడు మంగళమును గలిగించుగాక

వేదవ్యాస మునీశ మధ్వయతిరాట్ టీకార్య వాక్యామృతం
జ్ఞాత్వాఽద్వైతమతం హాలాహలసమంత్యక్త్వాసమాఖ్యాప్తయే
సంఖ్యావత్సుఖదాం దశోపనిషదాంవ్యాఖ్యాం
సమాఖ్యాన్ముదా
శ్రీమత్సద్గురురాఘవేంద్రయతిరాట్ కుర్యాద్ధ్రువంమంగళమ్ 7

వేదవ్యాసముని యొనర్చిన బ్రహ్మసూత్రములకు మధ్వాచార్యులవారు రచించిన వ్యాఖ్యావాక్యామృతమును తెలిసికొని మోక్షప్రాప్తికి అద్వైతము మువలె నపకారియని త్యజించి పండితులకు సుఖకరములగు దశోపనిషత్తులకు వ్యాఖ్యను రచించి విరాజిల్లు శ్రీసద్గురురాఘవేంద్రయతీంద్రుడు ధ్రువమగు మంగళమును గలిగించుగాక

శ్రీమద్వైష్ణవలోక జాలకగురుః శ్రీమత్పరివ్రాట్ భరుః
శాస్త్రే దేవగురుః శ్రితామరతరుః ప్రత్యూహ గోత్రస్వరుః
చేతోతీతశిరుః తథా జితవరుః సత్సౌఖ్య సంపత్కరుః
శ్రీమత్సద్గురురాఘవేంద్రయతిరాట్ కుర్యాద్ధ్రువం మంగళమ్ 8

వైష్ణవలోకబృందములకు గురువును, పరివ్రాజక శ్రేష్ఠుడును, శాస్త్రవిషయములందు దేవగురువును, ఆశ్రితుల పాలిటి కల్పవృక్షమును, విఘ్నపర్వతములకు వజ్రాయుధము వంటివాడును, మనస్సునకు అతీతమైన మహిమగలిగినవాడును, మన్మథుని జయించినవాడు, మంచిసౌఖ్యసంపదను గలిగించు వాడును నగు శ్రీసద్గురురాఘవేంద్రయతీంద్రుడు ధ్రువమంగళ కరుడగుగాక.

యఃసంధ్యాస్వనిశం గురోర్వ్రతిపతే సన్మంగళస్యాష్టకం
సద్యఃపాపహరం స్వసేవి విదుషాం భక్త్యైవ మాభాషితం
భక్త్యావక్తి సుసంపదం శుభపదం దీర్ఘాయురారోగ్యకం
కీర్తింపుత్రకళత్ర బాంధవ సుహృన్మూర్తీః
ప్రయాతిధ్రువ మ్ 9

వినినంతనె సమస్తపాపములను పోగొట్టుయతిపతి యగు శ్రీరాఘవేంద్రస్వామివారి యీమంగళాష్టకమును ప్రతిదినము సంధ్యాసమయమునందు పఠించువాడును, భక్తితో పలుకబడిన దీనిని భక్తితో విద్వాంసులకు పలుకువాడును, సంపదను ఉత్తమపదమును, దీర్ఘాయురారోగ్యములను, కీర్తిని, పత్నీపుత్రులను, బంధువులను, మిత్రులను పొందును. ఇదినిశ్చయము.

# శ్రీ అణురాఘవేంద్ర స్తోత్రమ్

శ్రీరాఘవేంద్ర గురుపుంగవ రోగభంగభంగీ
కృతాఖిలపిశాచసుయక్షరక్షః ॥
మాంత్రీణ పాపమనిశంగురుకర్మ్మణా
హృదాశరణమేమి శరణ్యపాల 1

నానారోగములను నివారించు విధానము కలవాడు, యక్షరాక్షసాది గ్రహముల నన్నింటిని భంగ మొనరించినవాడు, వాక్కుచేత మమ్ములను పాపరహితులుగ నొనరించినవాడు, శరణన్నవారిని పరిపాలించువాడు అగు శ్రీరాఘవేంద్ర గురు పుంగవుని నాహృదయపూర్వకముగ నాశ్రయించుచున్నాను

వ్యాఖ్యాదీపం వినాయస్య మాధ్వస్థాన చతుష్టయే ।
ప్రకాశం లభతే కోద్య రాఘవేంద్రం తమాశ్రయే ॥ 2

ఎవని వ్యాఖ్యాన మనుప్రకాశ దీపము లేనిచో నాల్గు మధ్వస్థానము లం దెవరు వికాసమును (ప్రకాశమును) పొంద గలరు? ఆరాఘవేంద్రుని నేనాశ్రయించెదను

యద్గ్రంథైరనఘైర్వాచః ప్రాచామువచయంగతాః ।
ధీర రాఘవేంద్రార్య దైశికంతముపాస్మహే ॥ 3

ఎవని గొప్పగ్రంథములచేత ప్రాచీనుల వాక్కులు అభివృద్ధి చెందినవో, అట్టి ధీరుడైన శ్రీరాఘవేంద్ర దేశికుని ఉపాసించెదను

శ్రీరాఘవేంద్రగురుపాదజలం కషాయం
మాత్రోత్తమాం గురుశిరోగతమృత్తికాం చ ।
సేవేసదా సకలరోగ నివృత్తి హేతుం
సంప్రాప్య సద్గుణనిధిం గురురాఘవేంద్రమ్ 4

ఎవని పాదోదకమును కషాయముగ (మందుగ), ఏ గురుదేవుని శిరముపై నున్న బృందావన మృత్తికను (మట్టిని) మాత్రగ స్వీకరించినచో నిత్యము రోగము లన్నియు తొలగిపోవునో, ఆసద్గుణనిధి యగు గురురాఘవేంద్రుని చేరి సేవించెదను.

రాఘవేంద్రో దయాలుశ్చ రాఘవేంద్రం తమాశ్రయే
రక్షితో రాఘవేంద్రేణ రాఘవేంద్రాయ తే నమః ।
రాఘవేంద్రాద్గురుర్నాస్తి రాఘవేంద్రస్య సేవకః
రాఘవేంద్రేరమే ఽభీక్ష్ణంరాఘవేంద్రోద్ధర ప్రభో ॥ 5

శ్రీరాఘవేంద్రుడు దయాస్వభావము కలవాడు. నేను శ్రీరాఘవేంద్రు నాశ్రయించెదను. శ్రీరాఘవేంద్రుడు నన్ను రక్షించెను. శ్రీరాఘవేంద్రునకు నమస్కారము. శ్రీరాఘవేంద్రుని కన్న వేరొక గురువు లేడు. నేను శ్రీరాఘవేంద్రుని సేవకుడను. శ్రీరాఘవేంద్రుని యందే నేను రమించెదను. శ్రీరాఘవేంద్రుడు నన్ను రక్షించును. (ఈ శ్లోకములో సంస్కృతములో గల ఏడు విభక్తులను పొందుపరచిరి. 1. రాఘవేంద్రః 2. రాఘ

వేంద్రం 3 రాఘవేంద్రేణ 4 రాఘవేంద్రాయ 5 రాఘవేంద్రాత్, 6 రాఘవేంద్రస్య 7 రాఘవేంద్రే)

క్వభ్రాతశ్చలితోఽసి వైద్యకగృహం కిం తత్ర శాంత్యై
బుజాం కిం తే
నాస్తి సఖే గృహే గురువరః సర్వం గదం హంతి య ॥
వాతశ్చేన్నమనాదితో గురుభరోః పిత్తం చ పాదోదకాత్
శ్లేష్మాణంవినిహంతిహంత గురురాట్ మృత్స్నాదనాద్
భక్తితః 6

సోదరా ! నివెక్కడకు పోవుచుంటివి ? వైద్యుని గృహమునకు, అక్కడ ఏమికలదు ? నాకు రోగము కలదు, అక్కడ రోగనివారణమునకు ఔషధములు కలవు ? ఓయీ ! సఖుడా ! నాగృహములో రోగముల నన్నింటిని నివారింపగల గురువు కలడు వాయురోగ మున్నచో నమస్కారమొనరింపుము పిత్త మున్నచో పాదోదకమును సేవింపుము శ్లేష్మ మున్నచో భక్తితో బృందావన మృత్తికను స్వీకరింపుము

శ్రీలక్ష్మీవరవక్షసం సుజనసంరక్షానిబద్ధాదరం
శ్రీలక్ష్మీప్రియన్నృపాల తనయావక్త్రాంబుజాతారుణం ।
యోషాలోకన మోహితద్విజవరాఘఘ్నం కటాక్షాంభృతో
భూషారత్నమ పాస్మహే విధిమ ఖాదిత్యార్చితాఙ్ఘ్ర్యం
బుజమ్ 7

శ్రీలక్ష్మీనాథుని వక్షము నందు ధరించినవాడు, మంచి వారిని రక్షించుటలో ఆదరము కలవాడు, సంపన్నులు, శ్రేష్ఠులు, రాజకుమారులు మొదలగువారి ముఖములచే అరుణవర్ణములుగ ప్రకాశించు పాదములు కలవాడు, స్త్రీలను జూచి మోహము పొందిన ద్విజుని పాపమును నశింపజేసి ఉద్ధరించినవాడు, కట పర్వత (మంత్రాలయ) ప్రదేశమునకు ఆభూషణ మైనరత్నము వంటివాడు, బ్రహ్మాదు లైన దేవతలయొక్క పాదార విందములను అర్చించువాడు నగు శ్రీగురుదేవుని సేవించెదను.

సన్నిద్రాంచితలోచనోప్యనిరతం జాగర్తి లోకావనే
మోహాధిష్ఠిత హృత్తటోపియతిభిర్ముక్త్యర్థిమిః సేవితః ।
శ్యామోపి స్వగుణోత్కరైర్జితపయో వార్ధ్యుద్భవో మాధవో
దేవో భావుక మాతనోతు సతతం శ్రీ రంగనాథో హరిః 8

నిద్రాముద్రిత నేత్రములు (యోగనిద్రలో నున్నను) కలవాడైనను లోకరక్షణమునందు జాగరూకుడై యుండు వాడును, శ్రీమహాలక్ష్మి విరాజిల్లుహృదయము కలవాడైనను ముక్తిని కాంక్షించు యతీశ్వరులచే సేవింపబడువాడును, నల్లని రూపము కలవాడైనను తనదివ్యగుణాతిశయములచే క్షీర సముద్రమును జయించినవాడును, దేవాదిదేవుడును నైన మాధవుడు రంగనాథుడు శ్రీహరి మాకుయెల్లప్పుడు శుభములను కలుగ జేయుగాక !

స్మేరాననం నవఘనాఘననీలభాసం
శ్రీ జానకీ కనక పీఠవరే నిషణ్ణం।
బింబాధరద్యుతిసురక్తతనుం స్వనాథం
సంప్రేక్ష్య మందహసితాంకగతా సదావ్యాత్ 9

మందహాసవదనము గలవాడును, నూతనమైన దట్టమైన మేఘముయొక్క నల్లని కాంతివంటి కాంతి గలవాడును, బంగారుపీఠమునందు ఆసీనుడై యున్నవాడును, బింబ ధరము యొక్క కాంతిచే మిగుల ఎఱ్ఱగాచేయబడిన శరీరము గలవాడును, తనకు నాథుడును నగు శ్రీరాముని చూచుచు మందహాసము కలదియు అంకపీఠముపై కూర్చున్నదియు నగు ఆజానకదేవి ఎల్లప్పుడు రక్షించుగాక!

అంధోయత్ కరుణాలవేన మఘవా మూకోపి వాగీశితా
వంధ్యాయత్ పదకంజతోయయుక్తా తేనాప్నోతి పుత్రాన్ సతః॥
యం సంసేవ్యాపుమర్థసార్థ మధునాప్యవింద తే సజ్జనః
సోయం మంత్రగృహాలయో గురువరః స్తాదస్మసిద్ధ్యై ముదా 10

ఏ గురుదేవుని కరుణాలేశముచేత గ్రుడ్డివాడు గూడ (నూరు నేత్రములు గల) ఇంద్రుడగునో, మూగవాడు శేషునివలె వక్తయగునో, ఎవనిపాదోదకము స్వీకరించినచో గొడ్రాలైనను సుపుత్రవతి యగునో ఏ గురుదేవుని సేవించినచో చతుర్విధ పురుషార్థములు లభించునో, మంత్రాలయ గృహా

లయములో నున్న ఆగురుదేవులు నాకు ఇష్టసిద్ధులను ప్రసాదించు గాక !

యో దానేఽప్రతిమో జనాః ముదితాః యం ప్రాప్య యే నార్థితం
దత్తంభూసురసద్గణాయ సతతం యస్మై హరీరోచతే ।
యస్మాద్భిభ్యతిదుర్మతిర్నరహరిర్యస్య ప్రియం సర్వదా
యస్మిన్ భక్తియుతో జనః సుఖయుతః సశ్రీగురో మామవ 11

ఏ గురు[illegible] దానమునం దసమానుడో, ఎవనిని పొంది జనులు [illegible]దెదరో, ఎవరు భూసురులకు యిష్ట ద్రవ్య[illegible]నాకై శ్రీమహావిష్ణువు ఇష్టుడగునో, ఎవనివలన [illegible]పడెదరో, శ్రీనృసింహస్వామి ఎవనికి ప్రియుడో, జనులు నిత్యము ఎవనియందు భక్తికల్గి యుందురో ఆగురుదేవుడు మమ్ములను రక్షించుగాక !

శ్రీ ప్రహ్లాదః సుబాలో నరవరమృగరాట్ పాదకంజాళిలీలః
బాహ్లీకో యాదవేశ ప్రభుపదనలినద్వంద్వసేవాధురంధరః ।
వ్యాసార్యో మేదినీంద్రో మితమతి సమయాంభోధిజైవాతృకోఽయం
సశ్రీమద్రాఘవేంద్రోఽవతు సుపరిమళాచార్యకర్మందివర్యః 12

శ్రీనృసింహమూర్తి యొక్క పాదపద్మములయందు తుమ్మెదవలె ఆటాడుచున్న మంచిబాలుడు శ్రీప్రహ్లాదుడు,

అతడే బాహ్లీకరాజు. యదుశ్రేష్ఠుడు, జగత్ప్రభువు నగు శ్రీకృష్ణునియొక్క పాదపద్మముల రెండింటిని సేవచేయుటయం దగ్రగణ్యుడైన వ్యాసార్యు డతడే. ప్రభువు పూర్ణప్రజ్ఞుడు నైనమధ్వాచార్యుల మత గ్రంథము లనెడుసముద్రమునకు చంద్రునివంటివాడు, పరిమళ వ్యాఖ్యానము రచించిన ఆచార్యుడు, యతీశ్వరులలో శ్రేష్ఠుడు నైనశ్రీమద్రాఘవేంద్ర స్వామి అతడే. అయన మమ్ములను రక్షించుగాక !



## శ్రీరాఘవేంద్ర అష్టోత్తర శతనామావళి

ప్రతి నామమునకు ముందు ఓం, చివర : నమః చేర్చి చదువుకొనవలెను.

1. ఓం స్వవాగ్దేవతా సరిద్భక్త విమలీక ర్త్రే నమః
2. శ్రీ రాఘవేంద్రాయ
3. సకల ప్రదాత్రే
4. భక్తాఘసం భేదన దృష్టి వజ్రాయ
5. క్షమా సురేంద్రాయ
6. హరి పాదకంజ నిషేవణాలబ్ధ సమస్త సంపదే
7. దేవ స్వభావాయ
8. దివిజద్రుమాయ

9. ఓం ఇష్టప్రదాత్రే నమః
10. భవ్య స్వరూపాయ
11. భవ దుఃఖ తూల సంఘాగ్ని చర్యాయ
12. సుఖధైర్యశాలినే
13. సమస్త దుష్టగ్రహ నిగ్రహేశాయ
14. దురత్యయోపప్లవ సింధుసేతవే
15. నిరస్త దోషాయ
16. నిరవద్య వేషాయ
17. ప్రత్యర్థి మూకత్వ-నిదాన-భాషాయ
18. విద్వత్పరిజ్ఞేయ మహావిశేషాయ
19. వాగ్వైఖరీ నిర్జిత భవ్య శేషాయ
20. సంతాన సంపత్పరిశుద్ధ భక్తి విజ్ఞాన వాగ్దేహ సుపాటవాది దాత్రే
21. శరీరోత్థ సమస్త దోష హంత్రే
22. శ్రీ గురు రాఘవేంద్రాయ
23. తిరస్కృత సురనదీ ఫల పాదోదక మహిమవతే
24. దుస్తాపత్రయ నాశనాయ
25. మహావంధ్యా సుపుత్ర ప్రదాయ
26. వ్యంగ స్వంగ సమృద్ధిదాయ
27. గ్రహ మహా పాపాపహాయ
28. దురిత కానన దావభూత స్వభక్త దర్శనాయ

29 ఓం సర్వతంత్ర స్వతంత్రాయ నమః
30 శ్రీ మధ్వమత వర్ధనాయ
31 విజయీంద్ర కారాబ్జోత్థ సుధీంద్ర వరపుత్రకాయ
32 యతిరాజే
33 గురవే
34 భయాపహాయ
35 జ్ఞాన భక్తి సుపుత్రాయుర్యశః శ్రీపుణ్యవర్ధనాయ
36 ప్రతివాది జయస్వాంత భేద చిహ్నాధరాయ
37 సర్వవిద్యా ప్రవీణాయ
38 అపరోక్షీకృత శ్రీశాయ
39 సముపేక్షిత భావజాయ
40 అపేక్షిత ప్రదాత్రే
41 దయాదాక్షిణ్య వైరాగ్య వాక్పాటవ ముఖాంకితాయ
42 శాపానుగ్రహశక్తాయ
43 అజ్ఞాన విస్మృతిభ్రాంతి సంశయాపస్మృతి
క్షయాదిదోష నాశకాయ
44 అష్టాక్షర జపేష్టార్థ ప్రదాత్రే
45 ఆత్మాత్మీయ సముద్భవ కాయజ దోష హంత్రే
46 సర్వ పుమర్థ ప్రదాత్రే
47 కాలత్రయ ప్రార్థనా కర్త్రైహికా ముష్మిక
సర్వేష్ట ప్రదాత్రే

48. ఓం అగమ్య మహిమ్నే నమః
49. మహాయశసే
50. శ్రీమధ్వమత దుగ్ధాబ్ధి చంద్రాయ
51. అనఘాయ
52. యథాశక్తి ప్రదక్షిణకృత సర్వయాత్రా ఫలదాత్రే
53. శిరోధారణ సర్వతీర్థ స్నాన ఫలదాతృ స్వబృందావన గత జలాయ
54. ఓం నమః కరణ సర్వాభీష్ట దాత్రే
55. సంకీర్తన వేదాద్యర్థ జ్ఞానదాత్రే
56. సంసార మగ్న జనోద్ధార కర్త్రే
57. కుష్టాది రోగ నివర్తకాయ
58. అంధ దివ్యదృష్టి దాత్రే
59. ఏడమూక వాక్పతిత్వ ప్రదాత్రే
60. పూర్ణాయు ప్రదాత్రే
61. పూర్ణసంపత్తి దాత్రే
62. కుక్షిగత సర్వదోష ఘ్నే
63. పంగు ఖంజ సమీచీనావయవ దాత్రే
64. భూతప్రేత పిశాచాది పీడాఘ్నే
65. దీప సంయోజన జ్ఞానపుత్ర దాత్రే
66. దివ్యజ్ఞాన భక్త్యాది వర్ధనాయ
67. సర్వాభీష్టదాయ

[50]

68 ఓం రాజచోర మహావ్యాఘ్ర సర్పనక్రాది పీడన ఘ్నే నమః
69 స్వస్తోత్ర పరనేష్టార సమృద్ధిదాయ
70 ఉద్యత్ప్రద్యోత నద్యోత ధర్మ కూర్మాసన స్థితాయ
71 ఖద్య ఖద్యోతప్రతాపాయ
72 శ్రీరామ మానసాయ
73 ధృతకాషాయవసనాయ
74 తులసీహార వక్షసే
75 దోర్దండ విలసద్దండ కమండలు విరాజితాయ
76 అభయ జ్ఞానముద్రాక్షమాలా శీలాక
77 యోగీంద్రవంద్య పాదాబ్జాయ
78 పాపాద్రి పాటన వజ్రాయ
79 క్షమా సురగణాధీశాయ
80 హరిసేవాలబ్ధ సర్వసంపదే
81 తత్వప్రదర్శకాయ
82 ఇష్టప్రదాన కల్పద్రుమాయ
83 శ్రుత్యర్ధ భోధకాయ
84 భవ్యకృతే
85 బహువాది విజయినే
86 పుణ్యవర్ధన పాదాబ్జాభిషేక జల సంచయాయ
87 ద్యునదీ తుల్య సద్గుణాయ
88 భక్తాఘ విధ్వంస కర నిజమూర్తి ప్రదర్శకాయ

89. ఓం జగద్గురవే నమః
90. కృపానిధయే
91. సర్వశాస్త్ర విశారదాయ
92. నిఖిలేంద్రియ దోషఘ్నే
93. అష్టాక్షర మనూదితాయ
94. సర్వసౌఖ్య కృతే
95. మృతపోత ప్రాణదాత్రే
96. వేదిస్థ పురుషోజ్జీవినే
97. వహ్నిస్థ మాలికోద్ధర్త్రే
98. సమగ్ర టీకా వ్యాఖ్యాత్రే
99. భాట్ట సంగ్రహ కృతే
100. సుధాపరిమళోద్ధర్త్రే
101. అపస్మారాపహర్త్రే
102. ఉపనిషత్ఖండార్థకృతే
103. ఋగ్వ్యాఖ్యాన కృదాచార్యాయ
104. మంత్రాలయ నివాసినే
105. న్యాయ ముక్తావళీ కర్త్రే
106. చంద్రికా వ్యాఖ్యా కర్త్రే
107. సుతంత్ర దీపికా కర్త్రే
108 గీతార్థ సంగ్రహ కృతే

1 తన వాగ్దేవత యనునదిలో భక్తులను స్వచ్ఛమొన రించువాడు, 2 శ్రీరాఘవేంద్రునకు నమస్కారము, 3 సర్వము

నిచ్చువాడు, 4 భక్తుల పాపములను ఖండించుటయందు తన వృష్టిని వజ్రాయుధముగా నుపయోగించువాడు, 5 సహాన గుణములో సురేంద్రు డంతటివాడు, 6 శ్రీవిష్ణుభగవానుని పాదపద్మములను సేవించుట వలన లభించిన సర్వసంపదలు గలవాడు, 7 దైవ స్వభావము గలవాడు, 8 కల్పవృక్షము వంటివాడు, 9 ఇష్టములను ప్రసాదించు వాడు, 10 మంగళకర స్వరూపుడు, 11 సంసార దుఃఖము లనెడి దూదిపింజలకు అగ్ని వంటివాడు, 12 సుఖము, ధైర్యము కలిగినవాడు, 13 దుష్ట గ్రహముల నన్నింటిని నిగ్రహించువాడు, 14 దుర్మార్గ మనెడు సముద్రమునకు సేతువువంటివాడు, 15 దోషరహితుడు 16 దోషరహిత మైనవేషము గలవాడు, 17 వాదప్రతివాదము లలో ప్రతివాదులకు మూగతనము గలుగునట్లు భాషించు వాడు, 18 విద్వాంసులు గుర్తింపగల గొప్పమహిమా విశేష ములు గలవాడు, 19 మాటలాడు విధానములో అదిశేషునే జయించినవాడు, 20 సంతానము, సంపత్తి, పరిశుద్ధ మగుభక్తి విజ్ఞానము, వాక్కు, దేహమునకు పటుత్వము ఇచ్చువాడు, 21 శరీరమువలన జన్మించిన దోషముల నన్నింటిని నాశన మొనరించువాడు, 22 గురుదేవు లైన శ్రీరాఘవేంద్రునకు నమస్కారము, 23 తన చరణోదకముల మహిమచే గంగానదీ స్నానఫలమును సహితము తిరస్కరించినవాడు, 24 దుష్టము లైనమూషకతాపములను నశింపజేయువాడు, 25 గొడ్రాలునకు మంచికుమారుని ప్రసాదించిన వాడు, 26 వి లాంగులకు సహి

తము మంచి అవయవ పాటవము నొసంగువాడు, 27 గ్రహములను, మహాపాపములను పోగొట్టువాడు, 28 పాపము లనెడు అరణ్యములకు దావాగ్నివంటివాడై తనభక్తులకు గోచరించువాడు, 29 శాస్త్రసూత్రముల కన్నింటికి బాగుగ అర్థమును చెప్ప గలవాడు, 30 శ్రీమధ్వాచార్యులు స్థాపించిన మతమును వృద్ధి చేయువాడు, 31 శ్రీవిజయీంద్రుని కరకమలములనుండి పుట్టిన శ్రీసుధీంద్రునకు పండితశ్రేష్ఠుడైనశిష్యుడు, 32 యతులలో శ్రేష్ఠుడైనవాడు 33 గురువునకు నమస్కారము, 34 భయములను పోగొట్టువాడు, 35 జ్ఞానమును, సుపుత్రులను, ఆయుర్దాయమును, య పుణ్యమును వృద్ధిచేయువాడు, ప్రతి వాదుల ఓటమిని చిహ్నము (మధ్వచిహ్నము)ను ధరించినవాడు, 37 విద్యలన్నింటిలోను నేర్పరి యైనవాడు 38 శ్రీలక్ష్మీనాథుడైనవిష్ణువును ప్రత్యక్షము చేసికొనినవాడు 39 మన్మథుని జయించినవాడు, 40 కోర్కెలను ప్రసాదించువాడు, 41 దయ, దాక్షిణ్యము, వైరాగ్యము, వాక్పాటవము గలవాడు, 42 శాపమును, అనుగ్రహమును ప్రసాదింప గలశక్తి గలవాడు, 43 అజ్ఞానము, మరపు, భ్రాంతి, సంశయము, అపస్మారము, క్షయ మున్నగు దోషములను నశింపజేయువాడు, 44 తన ఎనిమిది అక్షరములు గల్గిన మంత్రమును జపించిన వానికి కోరినకోర్కెల నిచ్చువాడు, 45 తనకు, తనవారలకు కలిగిన శారీరక దోషములను నశింపజేయువాడు, 46 పురుషార్థ

ముల నన్నింటిని ప్రసాదించు వాడు, 47 మూడుకాలము లందును ప్రార్థించిన వానికి ఇహపర సుఖములను, అభీష్టముల నన్నింటిని ఇచ్చువాడు 48 మహిమ తెలియ రానివాడు 49 గొప్ప కీర్తి కలవాడు, 50 శ్రీమధ్వమత మను క్షీరసముద్రమునకు చంద్రునివంటివాడు 51 పాపరహితుడు, 52యథాశక్తిగ ప్రదక్షిణముల నొనరించిన వానికి సర్వయాత్రా ఫలమును ప్రసాదించు వాడు, 53 తన బృందావన జలములను శిరమున జల్లుకొన్నవానికి సర్వతీర్థ స్నాన ఫలమును ప్రసాదించువాడు, 54 నమస్కరించిన వానికి సర్వాభీష్టములను ప్రసాదించువాడు 55 సంకీర్తన మొనరించువానికి వేదార్థములను, జ్ఞానమును ప్రసాదించు వాడు 56 సంసారమందు మునిగిన జనుల నుద్ధరించు వాడు 57 కుష్ఠ్వాది రోగములను పోగొట్టువాడు 58 గ్రుడ్డి వారికి మంచిచూపు నొసంగువాడు 59 నత్తివానికి మూగ వానికి వాక్కును ప్రసాదింపగలవాడు 60 పూర్ణాయుర్దాయము ను ప్రసాదించువాడు 61 పూర్ణసంపదలను ప్రసాదించు వాడు, 62 కడుపులోగల సకలదోషములను నివారించువాడు 63 కుంటివారికి అవిటివారికి పూర్ణాంగములను ప్రసాదించు వాడు 64 భూతప్రేత పిశాచాది పీడలను నశింపజేయువాడు 65 బృందావనముచెంత దీపము నెగదోసినవానికి జ్ఞానమును పుత్రుని ప్రసాదించినవాడు 66 దివ్యజ్ఞానము, భక్తి మొదలగు వానిని వృద్ధిచేయువాడు 67 కోరినకోర్కెల నన్నింటిని ప్రసా

దించువాడు. 68 రాజులు చోరులు అడవి మృగములు సర్పములు మొసళ్ళు మున్నగు వానివలన గలుగు బాధలను పోగొట్టువాడు. 69 తనస్తోత్రమును పఠించిన వారికి కోరిన కోర్కెలను సమృద్ధిగ నిచ్చువాడు. 70 ధర్మపీఠ మైనకూర్మాసనము నధిష్ఠించి ప్రద్యోతనునకు భావజ్ఞాన జ్యోతిని ప్రసాదించిన వాడు. 71 ఖద్యఖద్యోతప్రతాపుడు 72 శ్రీరాముని మనస్సునందు ధరించియున్నవాడు. 73 కాషాయవస్త్రములను ధరించినవాడు, 74 తులసీహారములనుధరించిన వక్షః స్థలముగలవాడు, 75 భుజము లందుప్రకాశించునట్టి దండకమండలములు కలవాడు, 76 అభయ ముద్రజ్ఞానముద్ర, జపమాలధరించిన కరకమలములు కలవాడు 77 యోగీంద్రులచే వందనము లందుకొనుచున్న పాదారవిందములు కలవాడు, 78 పాపములనెడు కొండలను ఖండించుటలో వజ్రాయుధమువంటివాడు, 79 క్షమాగుణమందు దేవగణాధీశ్వరుని వంటివాడు, 80 శ్రీహరిని సేవించి సకల సంపదలను పొందినవాడు, 81 తత్త్వమును బాగుగ ప్రదర్శించు (బోధించు) వాడు. 82 కోరినకోర్కెల నిచ్చుటలో కల్పవృక్షము వంటివాడు, 83 వేదార్థములను బోధించువాడు 84 మంగళముల నాచరించువాడు, 85 ఎందఱో ప్రతివాదులను జయించిన వాడు, 86 పుణ్యమును వృద్ధిచేయు తనపాదముల నభిషేకించిన జలములను భక్తుల కొఱకై యుంచినవాడు. 87 గంగానదితో సమానమైన మంచి గుణములు గలవాడు.

88 భక్తుల పాపములను విధ్వంస మొనరించు తనరూపమును ప్రదర్శించువాడు 89 జగద్గురువునకు నమస్కారము 90 దయ చూపుటలో నిధివంటి వాడు 91 శాస్త్రము లన్నింటిలో ఆరితేరిన వాడు 92 ఇంద్రియముల దోషముల నన్నింటిని నశింపజేయువాడు 93 అష్టాక్షర మంత్రముచే ఆవిర్భావము పొందినవాడు 94 సర్వసుఖములను కలుగ జేయువాడు 95 మర ణించిన బాలకునకు ప్రాణదాన మొనరించినవాడు 96 అరుగుపై మరణించిన మనిషిని జీవింపజేసినవాడు 97 అగ్నినుండి రత్న మాలిక నుద్ధరించిన వాడు 98 సమగ్రముగ టీకావ్యాఖ్యాన మును రచించిన వాడు 99 భాట్ట సంగ్రహమను గ్రంథమును రచించినవాడు 100 శ్రీమన్న్యాయసుధకు పరిమళ మను వ్యాఖ్యానమును రచించినవాడు 101 అపస్మార రోగమును హరించువాడు 102 ఉపనిషత్తులకు అర్థమును రచించినవాడు 103 ఋగ్వేదమునకు వ్యాఖ్యానమును రచించిన ఆచార్యుడు. 104 మంత్రాలయము నందు నివసించువాడు 105 న్యాయ ముక్తావళి యను గ్రంథమును రచించినవాడు 106 చంద్రికా వ్యాఖ్యాన మను గ్రంథమును రచించినవాడు 107 సుతంత్ర దీపిక యను గ్రంథమును రచించినవాడు 108 గీతార్థ సంగ్రహ మను గ్రంథమును రచించిన వాడు.

# శ్రీ గురు గుణ స్తవము

గురుసార్వభౌములు శ్రీవీణా వేంకటనాథాచార్యులు (శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి). వీరి కుమారులు శ్రీలక్ష్మీనారాయణాచార్యులు, వీరికుమారులు శ్రీపురుషోత్తమాచార్యులు వీరికుమారులు మహావిద్వాంసులైన శ్రీనివాసాచార్యులు. శ్రీనివాసాచార్యులు మూడు సంవత్సరముల ప్రాయములో నున్నపుడు శ్రీరాఘవేంద్ర తీర్థస్వామిని దర్శించెను. శ్రీవారు తన మునిమనుమని ఎత్తుకొని ముద్దులాడిరట. ఆబాలుని శ్రీగురుదేవులు తమ పరిపూర్ణానుగ్రహముతో ఆదరించిరి. శ్రీవారి యనుగ్రహ విశేషముచే శ్రీనివాసాచార్యులు మహాపండితు డయ్యెను. ద్వైత మతమును ప్రచార మొనరింప సాగెను. శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి శిష్యపరంపరలో ఒకరైన శ్రీ ఉపేంద్ర తీర్థులకు శ్రీనివాసాచార్యులు శిష్యుడయ్యెను. శాలివాహన శకము 1650 ప్లవంగనామ సంవత్సర మార్గశీర్ష అష్టమీ (1728 A D) శుభదినమున శ్రీరంగములో శ్రీ ఉపేంద్ర తీర్థులు శ్రీశ్రీనివాసా చార్యునకు సన్న్యాసాశ్రమ మొసంగి శ్రీవాదీంద్రతీర్థు లనినామకరణ మొనరించిరి. శ్రీఉపేంద్ర తీర్థుల యనంతరము శ్రీవాదీంద్ర తీర్థులు పీఠాధిపత్యమును స్వీకరించిరి. శ్రీవారు 1728 నుండి 1750 వరకు ఆధ్యాత్మిక సాంమ్రాజ్యమును పరిపాలించిరి. శ్రీవాదీంద్రతీర్థులు ఎన్నియో మహాత్మ్యములను ప్రదర్శించిరి. ఈ మహాను

భావుని యనుగ్రహమునకు పాత్రుడై నసవణూరునవాబు రెట్టె హళ్ళి యనుగ్రామమును మఠమున కొసంగెను 1734 సంవత్సరములో మహామ్మదీయులు కుట్రపన్ని మంత్రాలయ జాగీరుల నన్నింటిని వశము చేసుకొనిరి అపుడు శ్రీవాదీంద్ర తీర్థస్వామి ఆద్వాని యధిపతి యైన ముజఫర్ జంగుతో సమావేశమై ఆయధికారిని ఒప్పించి మరల మంత్రాలయ జాగీరులను శాశ్వతముగ మఠమునకు చెందునట్లు చేసెను

శ్రీ వాదీంద్ర తీర్థులు మధ్వసాహిత్యములో అనేక గ్రంధములను రచించిరి శ్రీమహావిష్ణువును, శ్రీమహాలక్ష్మిని శ్రీవాయుదేవుని శ్రీవ్యాసమధ్వా చార్యాదు లైన యతీందులన, శ్రీరాఘవేంద్ర తీర్థులను శ్రీవారు రచించిన గ్రంధములను శ్రీవారి లీలలను వర్ణించుచుగురుగుణ స్తవ మను స్తోత్రమును సంస్కృతభాషలో రచించెను శ్రీవాదీంద్ర తీర్థులు శ్రీగురుగుణ స్తవమును ముప్పదియేడు శ్లోకములలో రచించిరి ఆయన శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి బృందావన మెదుట నిలువబడి మొట్టమొదట శ్రీగురుగుణ స్తవమును గాన మొనరించి తమ ముత్తాతగారికి వినిపించెను ఆ స్తవమును ఆలకించి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి పరమానందమును చెంది సంతుష్టాంతరంగుడై తలనూపెను శ్రీవారి శిరఃకంపముచే బృందావనము అటునిటు కదిలెను ఈ విచిత్ర మగులీలను నాటి వారందరు దర్శించి శ్రీవారు సజీవముగ బృందా

వనములో నుండుటను గాంచి పరమాశ్చర్య చకితులైరి ఈ అద్భుత లీలవలన భక్తులకు శ్రీవారిపై విశ్వాసము సుదృఢ మయ్యెను అద్భుత మగు శ్రీగురుగుణ స్తవమును రచించి శ్రీరాఘవేంద్రతీర్థస్వామిని సంతుష్టిపఱచి శ్రీవాదీంద్ర తీర్థస్వామి అమరుడయ్యెను ఆయనవాణి పవిత్రమయ్యెను ఆయన స్తోత్ర మధురమయ్యెను

శ్రీమదానంద తీర్థులు బ్రహ్మసూత్రములకు అను వ్యాఖ్యానమును రచించిరి ఆ మహావ్యాఖ్యానమునకు శ్రీటీకాచార్యులు శ్రీమన్న్యాయసుధ యను టీకా గ్రంథమును రచించి ద్వైతవేదాంత సామ్రాజ్యమున విజయ పతాకము నెగురవేసెను శ్రీసుధీంద్రతీర్థుల చెంత శిష్యుడైన శ్రీవెంకన్న భట్టు (శ్రీరాఘవేంద్ర తీ స్వామి) శ్రీమన్న్యాయసుధకు టిప్పణిని రచించెను దానినే పరిమళ వ్యాఖ్యాన మనిరి వెంకన్న పరిమళాచార్యు డనబడెను ఆయన పరిమళ వ్యాఖ్యానమును రచించుచున్నపుడు వ్రాసిన పదములను కించిన్మాత్రమైనను సరిచేయ లేదు, తుడిచివేయలేదు పునరుక్తి దోషమునకు తావులేకుండా కృతిరచన చేసినా రని శ్రీరాఘవేంద్రతీర్థస్వామిని ప్రస్తుతించుచు శ్రీవాదీంద్రతీర్థులు శ్రీగురు గుణస్తవములో శ్లోకరచన చేసెను

శ్రీవాదీంద్ర తీర్థులు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి వంశాబ్ధి చంద్రుడు శ్రీహరివాయువులకు, శ్రీరాఘవేంద్ర తీర్థస్వామికి పరమభక్తుడు భక్తవత్సలు డైనశ్రీవారి పరిపూర్ణానుగ్రహా మునకు పాత్రు డైనధన్యుడు శ్రీరాఘవేంద్రస్వామికి దివాన్ వెంకన్న భవ్య మగుబృందావనమును నిర్మించెను శ్రీవారు శ్రీరామచంద్రునిస్పర్శచే పునీత మైనశిలనుబృందావన నిర్మాణ మునకు ఉపయోగింప వలసినదిగ వెంకన్న కి ఇ అందువలన వెంకన్న శ్రీవారికై నిర్మింపజేసిన బృందావనము కగ్గిన ఉంచబడెను ఆ బృందావనమునే శ్రీవాదీంద్ర తీర్థులకు యోగించిరి మంత్రాలయ మందే శ్రీరాఘవేంద్రతీర్థ స్వామి బృందావనమునకు వామభాగమున నేటికిని శ్రీవాదీంద్ర తీర్థస్వామి బృందావనమును మనము దర్శింప వచ్చును గురు దేవుని యనుగ్రహామునకు పాత్రు డైన వాదింద తీర్థస్వామి జన్మమే జన్మము.



# శ్రీ జగన్నాథ దాసు

శ్రీరాఘవేంద్రస్వామి ప్రహ్లాదుని యవతారము. ప్రహ్లాదునకు సహ్లాదు డనుసోదరుడుకలడు. ఆదైత్యశ్రేష్ఠుడు ఈకలి యుగములో శ్రీజగన్నాథదాసునిగ జన్మించి తనఅగ్రజు డైన ప్రహ్లాదుని శ్రీరాఘవేంద్ర యతిరూపములో దర్శించెను. ఆయన శ్రీవారికి ఏకాంత సేవచేసి చరితార్థు డయ్యెను.

రాయచూరు జిల్లా మానవి యనుగ్రామముచెంత భాగ్య వట్టి యనుకుగ్రామము కలదు. ఆగ్రామములో నరసప్ప యను భగవద్భక్తుడు కలడు. ఆయన ఆగ్రామమునకు కరణము భార్య లక్ష్మక్క మహాపతివ్రత. భార్యాభర్త లిర్వురు గొప్ప సంగీత విద్వాంసులు. వారు పురందర దాసు రచించిన కీర్తన లనుసదాగాన మొనరించుచుండెడివారు. వారి కెంతకాల మైనను సంతానము కలుగలేదు. ఒక దినమున వారికి స్వప్నములో శ్రీపురందరదాసు దర్శనమొసంగి యిట్లు పలికెను. "భక్తులారా! నేను శ్రీహరిని స్తుతించుచు ఐదులక్షల కీర్తనలను రచింపవలె ననిసంకల్పించి నాల్గు లక్షల డెబ్బదిఅయిదువేల కీర్తనలను మాత్రమే రచింప గల్గితిని. నేను నా కనిష్ఠ కుమారు డైన మధ్వపతిని మిలిగిన ఇరువదిఅయిదువేల కీర్తనలను రచింపవల సినదిగ కోరితిని. అతడు మీగర్భవాసమున జన్మించి భగ వంతుని భగవద్భక్తులనుకీర్తించి పరంధామమునకు వెడలగలడు". తదనంతరము భార్యాభర్తలకు మెలకువ రాగా వారెంతయో సంతసించిరి.

ఆదంపతులకు శాలివాహనశకము 1650 కీలకనామ సంవత్సర శ్రావణ శుద్ధవిదియ (27-7-1728) శుభదినమున ఒక తేజోవంతు డగుపుత్రు డుదయించెను వానికి శ్రీనివాసప్ప యనినామకరణ మొనరించిరి శ్రీరాఘవేంద్రతీర్థస్వామి శిష్య పరంపరలోని శ్రీవరదేంద్ర తీర్థస్వామిచెంత విద్యాభ్యాస మొనరించి శ్రీ వాసప్ప గొప్ప సంస్కృతవిద్వాంసు డయ్యెను మధ్వశాస్త్రములలో ప్రకాండ పండితుడయ్యెను సంస్కృత భాషాభిమానియై పాండిత్య ప్రకర్షతో తనమాతృభాష యైన కన్నడభాషను తక్కువగా చూచుచుండెను అతడు గృహస్థా శ్రమమును స్వీకరించి గృహములోనే సంస్కృతగురుకులమును జరుపుచుండెను ఆరోజులలో శ్రీవిజయదాస స్వామి మధ్వ మత ప్రచార మొనరించుచు తనశిష్యు లైనగోపాలదాసు, పంగ నామాలతిమ్మన్నదాసు, మోహనదాసు మొదలగువారిని వెంట నిడుకొని గ్రామగ్రామము తిరుగుచు భాగ్యవట్టి గ్రామమును చేరిరి శ్రీవిజయదాసు కన్నడ వాగ్గేయ కారులు వీరు అసంఖ్యాకముగ భక్తిరస ప్రధానము లైనకన్నడ కీర్తనలను రచించి గానమొనరించుచుండిరి వీరు శిష్యసమేతముగ ఆగ్రామ దేవాలయములో విడిదిచేసి భగవంతుని లీలలను గానమొనరించుచు సత్సంగ మొనరించుచుండిరి

శ్రీ దాసుగారు ప్రతిదినము కీర్తనలను పాడుచు గృహస్థుల గృహములచెంత ఆగెడివారు వారర్పించిన పదార్థములను గైకొని దేవాలయములో భగవంతునకు నివే

దించి సంతర్పణ గావించెడివారు ఒకదినమున నివాసాచార్యుల గృహముచెంత నిలచి కన్నడ కీర్తనల నాలపించిరి సంస్కృతాభిమాని యైన శ్రీనివాసాచార్యులు భిక్షనివ్వక ఆభక్తుని యవమానించెను శ్రీదాసుగారు దేవాలయములో జరుగుచున్న సమారాధనకు శ్రీనివాసాచార్యులను ఆహ్వానించిరి కన్నడ పండితు డైన శ్రీవిజయదాసుల సమారాధనమునకువచ్చుటకు శ్రీనివాసాచార్యు లహంకారపూరిత మైన మనస్సు అంగీకరింపలేదు అతడు తనకు ఆలస్యముగ భుజించినచో కడుపులో శూలకల్గునని అసత్యమాడి భక్తులతో భుజించుటకు పోలేదు ఈ విషయము తెలియగనే శ్రీవిజయదాసస్వామి రోషపడక మందహాసముచేయుచు అటులనా! యని పలికిరి శ్రీదాసుగారి శిష్యులు గోపాలదాసు మొదలగువారు తమగురువులకు జరిగిన యవమానమునకు కుపితులైరి ఆదినమున శ్రీనివాసాచార్యులు ఆలస్యముగ భుజించిరి తత్క్షణమే ఆయన తీవ్ర మైనపరిణామ శూలకు గురియయ్యెను ఎన్ని యౌషధములను వాడినను ఆశూల ఉపశమింపలేదు అతడు తీవ్రముగ అస్వస్థుడై వేరుదారిగానక శ్రీరాఘవేంద్రతీర్థస్వామి బృందావనముచేరి అనేక విధముల ప్రార్థించెను అపుడు శ్రీరాఘవేంద్రతీర్థస్వామి ఆచార్యా! మహాభక్తుడు, కన్నడ వాగ్గేయకారుడునైన శ్రీవిజయదాసులను నీవు సంస్కృతపాండిత్య ప్రకర్షచే అహంకరించి అవమానించితివి భాగవతాపచార

ఫలమే ఈ దుర్భరమగుశూల నీవు వెంటనే ఆమహాత్ముని పాదములపై బడి శరణు వేడుమని ఆదేశించిరి

వెంటనే శ్రీనివాసాచార్యులు గురుదేవుని యాజ్ఞాను సారముగ శ్రీవిజయదాస స్వామిని ఆశ్రయించెను శ్రీవిజయ దాసస్వామి ప్రసన్నులై కుమారా ! నీకు ఇట్టిశూల కల్గుటకు కారణము నాశిష్యుడైన శ్రీగోపాలదాసు నీవు సంస్కృతాభి మానివై నన్ను చులకనగ చూచుటగాంచి నాశిష్యుడు కోపిం చెను నీవు పలికిన అసత్యమే నీకు శూలగ పరిణమించెను నీవు వెంటనే శ్రీగోపాలదాసుని ఆశ్రయింపు" మని పలికెను శ్రీ శ్రీనివాసాచార్యులు శ్రీగోపాలదాసు నివసించుచున్న గ్రామమునకు జని ఆభక్తుని ఆశ్రయించి తన యహంకార మునకు ౘ ముచెందుచున్నానని నన్నుక్షమింపు డని ప్రార్థించెను అపుడు శ్రీగోపాలదాసు జొన్న రొట్టెలను చేసి వానిని శ్రీహరికి నివేదించి ప్రసాదమును శ్రీనివాసాచా ల కొసంగెను ఆభగవత్ప్రసాదము నారగింపగనే శ్రీనివాసా చార్యు లనుభవించుచున్న భయంకర మగుశూల తొలగి పోయెను శ్రీనివాసాచార్యులు శ్రీగోపాలదాసుతో గలసి శ్రీవేంకటాచలమునకు జనెను ఎన్నియో నెలలనుండి రోగ పీడితులై యున్న కారణమున శ్రీనివాసాచార్యులు ఏడుకొండ లెక్కి శోషిల్లెను భగవత్ప్రసాదమును తెచ్చి ఆచార్యులను రక్షింపవలె నని శ్రీగోపాలదాసు ఆలయమునకు జనెను ఇచట క్షణ మాలస్య మైనచో శ్రీనివాసాచార్యులు మరణావస్థ్తు

డగును. అపుడు శ్రీవేంకటేశ్వరస్వామియే తనప్రసాదమును గైకొని శ్రీగోపాలదాసు రూపమువ అలుదెంచి శ్రీనివాసా చార్యుల కొసంగి రక్షించెను. తదనంతరము శ్రీగోపాల చార్యులు ప్రసాదమును తీసుకొని ఆలస్యముగ వచ్చినవాడై జరిగినదంతయు విని పరమానంద భరితుడై వచ్చినవాడు తాను గానని, సాక్షాత్తుగ ఆశ్రీమన్నారాయణు డనిపలికెను. భగ వంతునిచే అనుగ్రహింపబడి శ్రీశ్రీనివాసాచార్యులు చరితార్థు డయ్యెను. నాటినుండి శ్రీశ్రీనివాసాచార్యులు సర్వసంగ పరిత్యాగిగా మారిపోయెను. పండరిపురంలో శ్రీపాండురంగడు శ్రీశ్రీనివాసాచార్యుల ననుగ్రహించి శ్రీజగన్నాథదాసు యనెడి అంకితనామమిడెను. ఆయన శ్రీహరిని కీర్తించుచు ఇలువదిఐదు వేల కన్నడ కీర్తనలను రచించి గానమొనరించెను. శ్రీజగన్నాథ దాసు తనగురుదేవులైన శ్రీరాఘవేంద్రతీర్థస్వామిని ఆరా ధించుటకు మంత్రాలయమును చేరెను. శ్రీజగన్నాథదాసు మంత్రాలయములో నివసించుచు శ్రీరాఘవేంద్రతీర్థస్వామికి ఏకాంతసేవల నొనరించుచుండెను. శ్రీవారియనుగ్రహ విశేష ముచే శ్రీజగన్నాథ దాసస్వామి సకలవేద శాస్త్రోపనిషత్సార మైన శ్రీహరికథామృతసార మనుమహా గ్రంథమును రచిం చెను. ఆదివ్యగ్రంథము ద్వైతసిద్ధాంత సామ్రాజ్యములో విశేషస్థానము నలంకరించెను. శ్రీజగన్నాథదాసు నిత్యము శ్రీరాఘవేంద్రస్వామి బృందావనముచెంత భక్తిరస ప్రధానము లైనకీర్తనలను పాడుచు శ్రీరాఘవేంద్ర తీర్థస్వామిని సంతోష

పెట్టెడివారు శ్రీదాసుగారు శ్రీవారు ఏకాంతమున భగవంతుని దివ్యలీలలను ముచ్చటించు చుండెడివారు శ్రీదాసుగారు పిలువగనే శ్రీవారు బృందావనమునుండి పలికెడివారట వీరి సంభాషణమును వినవలె ననికొందఱు ఆశ్రమవాసులు చాటుగ నుండి ప్రయత్నించిరి ఆదినమున యెన్నిపర్యాయములు ప్రార్థించినను శ్రీదాసుగారితో శ్రీవారు పలుకక మౌనము వహించిరి శ్రీజగన్నాథదాసు పలువిధముల దుఃఖించుచు తనవలన ఎట్టి యపరాధము జరిగెనో యనిశంకించుచు గృహమును చేరెను నాటిరాత్రి స్వప్నములో శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి సాక్షాత్కరించి 'సోదరా ! మన సంభాషణమును వినవలెనని కొందరు పొంచియుండిరి అందువలన నీ వెంత పిలిచినను నేను పలుకలేదు ఇకనుండి నేను స్వప్నములో గోచరించి నిన్ననుగ్రహించెద' నని పలికెను అపుడు శ్రీజగన్నాథదాసు పరమానంద భరితుడై శ్రీరాఘవేంద్ర తీర్థస్వామి ననేకవిధముల స్తుతించెను

ఇట్లు శ్రీవారికి అనేకవిధముల ఏకాంతసేవల నొనరించుచు శ్రీజగన్నాథదాసస్వామి చరితార్థుడయ్యెను ఈ మహాభక్తుడు ఎనుబదియొక్క సంవత్సరములు జీవించి శాలివాహన శకము 1731 శుక్లనామ సంవత్సర భాద్రపద శుద్ధనవమి, భానువారమున (17-9-1809) యోగద్వారమున ఈ పాంచభౌతిక మగు దేహము త్యజించి పరంధామమునకు జనెను

---

# థామస్ మన్రో



శ్రీరాఘవేంద్రస్వామి విరోధినామసంవత్సర శ్రావణ బహుళ ద్వితీయ ( 1593 A D ) దినమున బృందావనమును ప్రవేశించిరి నాటినుండి యావద్భారతదేశమందున్న అన్ని ప్రాంతములనుండి భక్తజనులు తండోపతండములుగ 'మంచాల' లో గల శ్రీవారి బృందావనము నారాధించుటకు వచ్చుచుండిరి ఎందరో పాపులు పునీతులైరి శ్రీవారొసంగిన పుణ్యఫలముచే నెందరో తమయభీష్టములను పరిపూర్ణమొనరించుకొని మనశ్శాంతిని బొందిరి 'మంచాల' 'మంత్రాలయ' మయ్యెను భారతదేశమునకే గాక యావత్ప్రపంచమునకు పవిత్ర తీర్థస్థాన మయ్యెను

ఇట్లు నూటనలుబది సంవత్సరములు గడిచెను భారతదేశమందు రాజకీయముగా నెన్నియో మార్పులు సంభవించెను విశాల సామ్రాజ్యములు ముక్కలై సంస్థానాధీశుల పరమయ్యెను వీరు పరస్పరము ఈర్ష్యా ద్వేషములతో కలహించుకొన దొడంగిరి బలవంతునిదే ధర్మమయ్యెను ధనమే మానవునకు సర్వస్వమయ్యెను అధికారమే మానవుని ధ్యేయమయ్యెను మతకలహములతో, రాజుల యంతః కలహములతో భారతదేశము అస్తవ్యస్తమై సామాన్యుల జీవనము దుర్భరమయ్యెను

ఇట్టి విపత్కర పరిస్థితులలో అంగ్ల దేశమునుండి కొందఱు ఆంగ్లేయ వర్తకులు మెల్లగ దేశమునందు ప్రవేశి చి 'ఈస్టిండియా' కంపెని యను పేరుతో వ్యాపార మొనరించు చుండిరి వారు భరతదేశముయొక్క యీ అంత కలహ ములను గాంచి యెల్లైనను దేశము నంతటిని కబళింపవలె నని సంకల్పించి దేశద్రోహు లైన సంస్థానాధీశులను చేరదీసిరి వారిని దేశభక్తులపై పురిగొల్పి అన్యాయముగా వారిని వధింపజేసి స్వంతరాజ్యము నేర్పరచుకొనిరి దానినే 'కంపెని గవర్నమెంటు అందురు వీరు ఆంగ్లదేశమునుండి అపార సైన్యములను రావించి ఐకమత్యము లేని భారతీయ సంస్థానా ధీశులను జయించుచు నిర్దయులై దేశభక్తుడైన టిప్పుసుల్తానుని సంహరించి దక్షిణాపథమునకు చక్రవర్తులైరి 'దక్కన్ పేష్వాలు' 'నిజాము మొదలగు రాజులందఱు కంపెనీ గవర్న మెంటుకు బానిసలైరి

ఈస్టిండియాకంపెనీ గవర్నమెంటువారు ఆంగ్లేయ మిల టరీ ఆఫీసర్లను దేశమును పాలించు కలక్టర్లుగ నియమించెను ఆ సమయమున ఆంగ్లసైన్యమందు సేనాధిపతియైన (మేజరు) సర్ థామస్ మన్రో' బళ్ళారి జిల్లాకు పదునెనిమిది వందల (1800 A D) సంవత్సరమున కలక్టరుగ నియమింపబడెను ఆయనయే 1820 A D సంవత్సరమున దక్షిణాపథమునకు గవర్నరయ్యెను ఆయనకు ఈ మహాద్భాగ్యము శ్రీరాఘ

వేంద్ర గురుదేవుల కరుణాకటాక్ష వీక్షణములచే లభించెను ఇదియొక చరిత్రప్రసిద్ధమైన యితిహాసము శ్రీరాఘవేంద్ర స్వామి తాను బృందావనము ప్రవేశించిన తరువాత 227 సంవత్స రములకు మఱల యీ థామస్ మన్రోకు దర్శనమొసంగెను ఆ ప్రభావము వలననే ఒక సామాన్యుడైనకలెక్టరు భక్తుడై గవర్నరుగా సింహాసన మధిష్ఠించి దక్షిణభారత దేశమును పాలించి 1827 సంవత్సరములో ముక్తిని బొందెను

1812 సంవత్సరమున యీస్టిండియా కంపెనీ గవర్న మెంటువారు ఒకకఠోరశాసన మొనరించిరి దానివలన ప్రజ లచే పరిపాలింపబడుచున్న దేవాలయ ధర్మాదాయ శాఖకు సంబంధించిన ఆస్తులన్ని (గవర్నమెంటు) ప్రభుత్వమునకు సంక్రమించును ఆ ఆస్తులను ఈనాముగా బొందిన వ్యక్తి సజీవుడైయున్న అవి ప్రభుత్వమునకు చెందజాలవు

బళ్ళారి కలెక్టరు మేజర్ థామస్మన్రో ప్రభుత్వము యొక్క ఆజ్ఞానుసారముగ జాగీరులను ఈనాములను స్వాధీన పరచుకొనుట ప్రారంభించెను 1 వ సంవత్సరములో ఆ కలెక్టరు 'మంచాల గ్రామమును జేరెను ప్రభుత్వము యొక్క రికార్డు ప్రకారము ఆ గ్రామములో ఒక బ్రాహ్మణ సన్యాసి సమాధికలదనియు, దానిని కొందఱు పూజారులు పరిపాలించుచున్నారనియు, అహర్నిశము సమాధిని ఘృతదీప ములచే అలంకరించుచున్నారనియు తెలిసికొనెను దీనికొఱకై

మంచాలగ్రామమే ఆ మఠమునకు జాగీరుగ లభించె నని దెలిసి కొని ఆశ్చర్యచకితు డయె ను వెంటనే కలెక్టరు ఆదోని తాలూకా సిరస్తాదారుని రావించి ఆ మఠమునకు కొంత ధనమును దీపారాధన మొదలగు కార్యక్రమములు జరుపుటకు యిప్పించి గ్రామమును ప్రభుత్వపరము చేయవలసినదిగా ఆజ్ఞా పించెను

ఆదోని తాలూకా సిరస్తాదారు బ్రాహ్మణుడు శ్రీరాఘ వేంద్రస్వామి భక్తుడు కలెక్టరు పల్కిన పల్కుల నాలకించి భయకంపితుడై "దేవా! శ్రీరాఘవేంద్రస్వామి భగవదాంశ సంభూతుడు ఆయన నిగ్రహానుగ్రహ సమర్థుడు ఆమహాను భావుని యనుగ్రహముచే ఒక పశువులకాపరి అసదుల్లా ఖాన్ నవాబుగార్కి దివాను కాగల్గెను అతని పేరే వెంకన్నపంతులు ఆ బ్రాహ్మణోత్తముడు నవాబుయొక్క రాజముద్రికచే ముద్రింపబడిన అధికారపత్రపరముగ మంచాల గ్రామమును శ్రీవా కొసంగెను నేటికి శ్రీరాఘవేంద్రస్వామి మంత్రా లయాంతర్గత బృందావనమందు సజీవులై ఆశ్రిత భక్తుల ననుగ్రహించుచున్నా రనిబల్కెను కొందఱు బ్రాహ్మణు లను రావించి కలెక్టరు ఎదుట యీచరిత్రను సాక్ష్యముగ నిరూపించెను మేజర్ థామస్ మన్రో ఆంగ్లేయుడైనప్పటికి దుర్మార్గుడుకాడు, భగవద్భక్తుడు సిరస్తాదారు చెప్పిన దంతయు శాంతముగ నాలకించి యిట్లు బల్కెను మంచిది

నీవు చెప్పినదంతయు సత్యమైనచో శ్రీరాఘవేంద్రస్వామి సజీవముగ నున్నచో ఈజాగీరు వారికే చెందగలదు నేనే స్వయముగ మంచాల కేతెంచి పరిస్థితులను పరిశీలించెదను

కలెక్టరు గారు మరునాడు స్వయముగ మంచాలకు వచ్చుచున్నారనెడి వార్త గ్రామమంతయు వ్యాపించెను వేల కొలదిగ ప్రజలీ దృశ్యమును తిలకించుటకు మంత్రాలయ బృందావనమునకు విచ్చేసిరి మేజర్ థామస్ మన్రో, సిరస్తాదారు ఎందఱో ప్రభుత్వోద్యోగులు మఠమును జేరిరి నాటి మఠాధిపతులు వీరిందరికీ సుహృద్భావ సూచకముగ స్వాగతము పలికిరి కలెక్టరు మన్రో బృందావన సమ్ముఖమునకు రాగానే పాదరక్షలను విసర్జించి తలపైగల టోపీని తీసివైచి బృందావన సమ్ముఖమున వినమ్రుడై నిలువబడెను ఇదియేనా శ్రీరాఘవేంద్రుల జీవసమాధి యని ప్రశ్నింపగా సిరస్తాదారు మొదలగువా రవునని పల్కిరి ఆక్షణమందే శ్రీరాఘవేంద్రస్వామి స్వయముగ బృందావనమునుండి బయల్వెడలి కలెక్టరు థామస్ మన్రోతో ఆంగ్లభాషలో సంభాషించిరి శ్రీవారిని దర్శింపగనే వారి దివ్యమంగళ విగ్రహమునకు ముగ్ధుడై మన్రో ఆంగ్లసంప్రదాయ ప్రకారముగా నమస్కరించెను కలెక్టరుతో నీ మంచాల గ్రామము తనదని పల్కి శ్రీరాఘవేంద్రస్వామి అంతర్ధాన మొందిరి శ్రీవారు ఒక్క మన్రోకే దర్శనమును ప్రసాదించెను ఆ సమయమున

థామస్ మన్రో పలికిన పల్కులను మాత్రము ప్రజలు ఆలకింప గల్గిరి శ్రీవారు అంతర్ధానముకాగానే ఆయన మహాత్మ్యమును గ్రహించిన కలెక్టరు మన్రో సిరస్తాదారుతో నిట్లు బల్కెను "ఆహా! ఏమి మీగురుదేవుల భవ్యవిగ్రహము! ఆజాను బాహుడు, రధారి, దండధరుడు, పాదుకలను ధరించిన ఆదివ్యవిగ్రహుండు మీ గురువేనా?" అపుడు సిరస్తాదారు "అవును ప్రభూ, కానీ ఆయన ఎక్కడ? మాకు గోచరింపలేదని" బల్కెను

అపుడు కలెక్టరు "ఏమి? మీరు చూడలేదా? ఈ బృందావనము ముందు నిలుచుండి మేఘగంభీర స్వరముతో నాతో పల్కినాడు మీరు వినలేదా దర్శింపలేదా" అని పల్కెను

అందులకు వారు ఆశ్చర్యచకితులై 'మాకు గోచరము కాలేదని' చింతాక్రాంతులై పల్కిరి జరిగిన దంతయు గాంచి శ్రీరాఘవేంద్రస్వామి దైవాంశ సంభూతు డనియెఱింగి కలెక్టరు థామస్ మన్రో శ్రీవారిని స్తుతించి ఆరాధించెను మంత్రాలయ పీఠాధిపతులు కలెక్టరునకు శ్రీవారి ఫలమంత్రాక్షతలను, ప్రసాదము నొసంగిరి వెంటనే 'మన్రో' తన నివాసమునకు జని మంచాలాధిపతి యైన శ్రీరాఘవేంద్రస్వామి సజీవుడు కావున మంత్రాలయజాగీరు వారికే చెందవలె నని గవర్నరునకు తాను గాంచినదంతయు నివేదికగా బంపెను

ఇచట మంత్రాలయమున జేరిన భక్తులాదటు శ్రీవారొక మ్లేచ్ఛునకు దర్శనమొసంగి ఆరాధకులైన తమకు గోచరింపలే దని దుఃఖితులై నిరసన వ్రతమును ప్రారంభించిరి ఆ భక్తులు వారి దర్శనార్థులై విలపింపనారంభించిరి అపుడు వారలకు మేఘగంభీరస్వర మిట్లు వినిపించెను "భక్తులారా! మీరు చింతింపవలదు మీకు గోచరింపకయున్నను సదా మిమ్ములను కటాక్షించుచునే యున్నాను మ్లేచ్ఛుడైన ఆయాంగ్లేయునకు నాదర్శన సౌభాగ్యము గల్గుట వాని పురాకృతపుణ్యము ఈతడు పూర్వము కృతయుగములో ఒక యసురుడు ఆతడు శ్రీమన్నారాయణునిగూర్చి ఘోర తపమాచరించెను భగవదనుగ్రహము లభించినను జన్మ రాహిత్యమును గోరక స్వర్గాదిలోక సుఖములను గోరెను ఆతడు ఇంతవరకు స్వర్గాదిలోకములందు సౌఖ్యముల ననుభవించి ఐశ్వర్యవంతుడైన ఆంగ్లేయునిగ మానవజన్మమును బొందెను అతడు స్వాభావికముగ సకామభక్తుడు భగవంతుని యే యిచ్ఛచే ఆరాధించినను ఆయన వాని ననుగ్రహించును వానికోర్కెలను దీర్చి తన భక్తులతో సమాగమమొనరింపజేసి భవబంధవిముక్తునిగ నొనరించును సకామభక్తుడు ఎట్టకేలకు భగవంతునిజేరును కాని నిష్కామభక్తుడు ఆజన్మమునందే పాంచభౌతిక దేహమును పరిత్యజించి దివ్యదేహధారియై భగవత్పార్షదులు వెంటరాగా పరంధామమును చేరును కావున యీథామస్ మన్రోకు వానిపురాకృతపుణ్యావిశేషముచే భగవ

దనుగ్రహామువలన నాప్రత్యక్షదర్శనము లభించెను నేను మీకు స్వప్నమున సాక్షాత్కరింతునని" పల్కెను

శ్రీవారి యమృతతుల్యము లైనవాక్కుల నాలకించి ఆభక్తులందరు సంతృప్తులై నిరసనవ్రతమును వీడి శ్రీవారి ప్రసాదమును స్వీకరించి తమతమనెలవులకు జనిరె కలెక్టరు థామస్‌మన్రో మంత్రాలయవిషయమున మద్రాసు గవర్నరు గారికి నివేదికపంపి సమాధానముకొఱకై ఎదురుచూచు చుండెను ఆసమయమున మద్రాసుగవర్నరుభార్య గర్భవతి కాగా గవర్నరు ప్రభుత్వమునకు సెలవుపెట్టి భార్యను తోడ్కొని ఇంగ్లండునకు పోయెను వెంటనే యీస్టిండియాకంపెనీ గవర్నమెంటు బళ్ళారి కలెక్టరయిన మేజర్‌థామస్‌మన్రోను మద్రాసుగవర్నరుగ నియమించెను తనకు దక్షిణాపథమునకు గవర్నరుగా పదవి లభించుటగాంచి మన్రో విశ్వసింపలేకపోయెను

ఆయన వెంటనే మద్రాసునకు జని గవర్నరుగా బాధ్యతలను స్వీకరించెను తాను కార్యాలయమునకు జని గవర్నరుగా ప్రమాణస్వీకార మొనరించిన తత్‌క్షణమే తానే కలెక్టరుగా పంపుకొనిన మంత్రాలయ నివేదిక పరిశీల నార్థమై తన ముందుంచబడెను ఈ వైచిత్ర్యమును గాంచి గవర్నరు థామస్ మన్రో యిది యంతయు శ్రీరాఘవేంద్రస్వామి దర్శన ప్రభావమే యని గ్రహించెను కానిచో సామాన్యు డగు ఒకకలెక్టరు సామ్రాజ్యమునకు గవర్నరగుట అసంభవము

తత్‌క్షణమే ఆయన తన మనస్సులో శ్రీరాఘవేంద్రస్వామి భవ్యరూపమునకు నమస్కరించుకొని తాను కలెక్టరుగ పంపిన మంత్రాలయ నివేదికను తానే గవర్నరుగ ఆమోదముద్ర వైచెను తదనంతరము గవర్నరు థామస్ మన్రో పాదరక్షలను విసర్జించి తలపైగలటోపి తీసివైచి మోకాళ్ళపై నిలువబడి ఆంగ్లేయుల పద్ధతి ప్రకారము శ్రీరాఘవేంద్రస్వామిని ప్రార్థించెను

గవర్నరు సర్ థామస్ మన్రో యొక్క యీ జీవిత విశేషము మద్రాసు గవర్నమెంటువారి గెజెట్‌లో ముద్రింపబడెను పాఠకుల సౌకర్యార్థమై మేము ఆగెజెట్ నివేదికను మీాముందుంచుచున్నాము



# మద్రాసు ప్రావిన్సు గెజిటీర్సు

ఛాప్టర్ 11 పుట 213

మంచాల అదోని (తాలుకా)

ప్రచురణకర్త : డబ్లియు ఫ్రాన్సిస్, ఐ సి యస్

వాల్యూమ్ నెం 1 బళ్ళారి

1916వ సంవత్సరములో మదరాసు గవర్నమెంటు ప్రెస్ సూపరింటెండెంటు గారివలన పునర్ముద్రితము 11 వ ప్రకరణము – ఆదోని తాలూక పేజి నం 213

మంచాల – ఇయ్యది తాలూకాయొక్క ఉత్తర భాగమున తుంగభద్రానదీ తీరమున 1212 మంది జనాభాగల యొక శ్రోత్రియ గ్రామము మాధ్వమునీంద్రు లగు రాఘవేంద్ర స్వాములవారి బృందావనము గలిగి యియ్యది బహు ప్రసిద్ధి నొంది యున్నది ఇచ్చట శ్రీస్వాములవారి సంవత్సరోత్సవము ఆగష్టు నెలలో జరుగుచుండును ఈ సందర్భమున బొంబాయి, నిజాము, మైసూరు రాష్ట్రములనుండి యిచ్చటికి వచ్చు నసంఖ్యాకులగు యాత్రికులలో లింగాయతులున్నైత ముందురు దీనికి సంబంధించిన భూదానము 1662 మొదలు 1687 సం॥ వఱకు ఆదోనికి గవర్నరైన సిద్ధి మసుద్ ఖాన్ (అసదుల్లాఖాన్) గారియొక్క సుప్రసిద్ధమంత్రి యగు వెంకన్నపంతులు గారిచే జేయబడినట్లు మెకంజీ దొరగారి వ్రాత ప్రతులలో చేర్కొనబడి యున్నది

ఈ స్థలమునకు సంబంధించి మన్రో దొరగారిని గూర్చిన యొక చిత్రగాధ గలదు ఈ ధర్మాదాయము తిరిగి తీసికొన బడవలయు నను వివాదమును విచారించుటకై మన్రోదొర గారీప్రదేశమునకు వచ్చిరి పాదరక్షలను, టోపీని వదలి శ్రీమన్రో దొరగారు శ్రీస్వాములవారి బృందావనమును సమీపించిరి శ్రీస్వాములవారు బృందావనమునుండి వచ్చి శ్రీదొరగారితో సంభాషించిరి శ్రీమన్రోదొరగారు మాత్రమే శ్రీస్వాముల వారిని సందర్శించి వారితో సంభాషింప గలిగిరి గాని యచట

నున్న తదితరు లెవ్వరికి నది గోచరింపలేదు ఇందుకు గార ణాము శ్రీదొరగారు దేవతాంశగలవా రగుటయే యని జన ప్రతీతి పిదప శ్రీదొరగారు తమ మకాముసకు దయచేసి యీ ధర్మాదాయము మరల దీసికొనబడవలయు నను వాదమును రద్దుచేసిరి స్వామివారి మంత్రాక్షతలను దొర గారు స్వీకరించి తమ భోజనమున నుపయోగపఱుప నాజ్ఞా పించిరి

సరా - సర్ థామస్ మన్రోదొరగారి భూదానపు పట్టా మూలమున తిరుపతి దేవస్థానపు పొంగలి యిప్పటికిని ప్రతి దినము శ్రీస్వామివారికి సమర్పింపబడుచున్నది ఈమంచాలయే మంత్రాలయము అనికూడ బడుచున్నది



## ఫ ల శ్రు తి

సత్యార్థులైనవిజ్ఞులు శ్రీ రాఘవేంద్రస్వామి యీ దివ్య చరితమును పఠించినచో వారిలో భగవంతునిపై అపారమైన భక్తి కలుగును భగవంతునియొక్క దివ్యశక్తిపై సుదృఢ మైనవిశ్వాస ముద్భవించును సకలధర్మములను భగవత్పర ముగ నొనరింపగలిగినవారై నిష్కాములై భవబంధవిముక్త లయ్యెదరు శ్రీహరి, శ్రీవాయువు, ఆభక్తుల సకలాభీష్ట

ములను దీర్పగలరు నిత్యము శ్రీహరిని, వాయుదేవుని ఉపాసించి శ్రీరాఘవేంద్రయతీంద్రులు నిగ్రహానుగ్రహ సమర్థులై అసంఖ్యాక సిద్ధులను బొంది ఆశ్రితులకు కల్పవృక్షమైరి ఆర్తులైన భక్తులకు కామధేనువైరి శ్రీవారి నాశ్రయించిన మానవులు సకలకష్టములనుండి విముక్తులై జీవన్ముక్తులు కాగలిగిరి

శ్రీరాఘవేంద్రస్వామి నారాధించిన కామక్రోధలోభ మోహమద మాత్సర్యములు నివారింపబడగలవు ఆయన పూజల నొనరించిన భూతప్రేత పిశాచాది గ్రహములపీడ నశింపగలదు ఆయన పాదారవిందములను ధ్యానించిన మానవుని మనస్సు పూర్ణశాంతి నొందగలదు శ్రీవారు భక్తులకు అపరోక్ష జ్ఞానమును, ఆధ్యాత్మికవిద్యను, అనన్య భక్తిని, నిస్వార్థత్వమును, కర్మకౌశలమును, శరీరారోగ్యమును, మనోనిగ్రహమును, సమస్త ఐశ్వర్యములను తృటిలో ప్రసాదింపగలరు

స్వామి కృపాకటాక్ష ప్రసరించిన మూగవాడు గును బధిరుడు వినగలుగును కుంటివాడు కొండలను దాటగల్గును మానవులను ఆడించుచున్న గ్రహములన్నియు శ్రీవారి యనుగ్రహమువలన శుభప్రదములు కాగలవు మంత్రాలయ బృందావనమందు విరాజిల్లియున్న శ్రీరాఘవేంద్రస్వామి తన భక్తులపై అనిష్ట పుణ్యములను వర్షించుచుండిరి శ్రీవారు తాపత్రయపీడిత మానవ సమాజోద్ధరణ

మునకై దివినుండి భువికి యేతెంచెను 'ఓం శ్రీ రాఘ
వేంద్రాయ నమః' యని నిశ్చల భావముతో ప్రతినిత్య మొక్క-
పర్యాయమైనను జపించిన భక్తుని సర్వబంధములు నశింప
గలవు ఒక్క-పర్యాయమైనను మంత్రాలయమున కేతెంచి
బృందావనమునకు ప్రదక్షిణ మొనరించి నమస్కరించిన వానికి
సకలక్షేత్ర దర్శన ఫలము ముగ లభించును శ్రీవారి
బృందావనాభిషేక జలములను తలపై సంప్రోక్షించుకొనిన
వానికి సకల తీర్థస్నానఫలము లభించును శ్రీరాఘవేంద్ర
స్తోత్రమును నిత్యము పఠించినవానికి యెట్టి వ్యాధులైనను
తొలగిపోగలవు వాని సర్వాభీష్టములు పరిపూర్ణములు
కాగలవు ప్రతినిత్యము స్నానమాచరించి శ్రీరాఘవేంద్ర
బృందావన చిత్రమెదుట నిలువబడి దీపారాధన యొనరించి,
ధూప సమర్పణముచేసి నమస్కార 'ప్రదక్షిణ మొనరించినచో'
వానికి సుపుత్రు డుదయించును శ్రీహరి, వాయువుల దివ్య
మహాత్మ్యము లవగతమగును శ్రీవారి దివ్యకవచమును
గళమునందు ధరించిన వానికి త్రిపాపములు తొలగిపోవును
శ్రీరాఘవేంద్రస్వామి భక్తులు నిర్భయులు, శంకా రహితులు,
నిత్యానందతృప్తులు, సత్శీలసంపన్నులు నగుదురు వారికి
శత్రువులవలన, క్రూరమృగములవలన, విషసర్పములవలన,
యెట్టి యపకారము సంభవింపదు వారి ఘోరసంసార
సాగరమునుండి ఉద్ధరింపబడగలరు